యక్షిణి చిత్రాన్ని ఝళిపించింది వెంటనే
మందరి చింపిరిగుడ్డలు ముద్దొచ్చే



# బిన్నీవారి

"అచ్చమైన శిల్కు చీరగా మారాయి"

నేడు పేర్కైన సామాజిక మందరాంగికి తాను కట్టిన
చీరవలన తన లావణ్యం పొగడ్తను పొందునని తెలుసు-
కాని భావానుగుణ్యంగా ఉండాలి కట్టే చీర.

ఏ అవకాశమైనా సరే శోభాయమానంగా ఉండండి

బిన్నీవారి

# అచ్చమైన శిల్కు చీర

జార్జెట్‌లు, క్రేపులు ఇంకా శిల్కు రకాలు లభిస్తాయి.

ది బెంగుళూర్ ఉలెన్, కాటన్ &
శిల్కు మిల్స్ కంపెనీ లిమిటెడ్
అగ్రహారం రోడ్డు, బెంగుళూరు-2
మేనేజింగ్ ఏజంట్లు :
బిన్నీ & కంపెనీ (మద్రాసు) లిమిటెడ్





Founder
K. Nageswara Rao

స్థాపితము
1908



సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్



సంపుటము 55
సంచిక 24

24-2-60
బుధవారం

వికారి మాఘ బహుళ త్రయోదశి



విడిప్రతి వెల 25 న. పై.

సంవత్సర చందా 13-0-0



ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీధి
మదరాసు-1.



### గమనిక

గతవారం ముఖచిత్రం వాహినీవారి "రాజమకుటంలో రాజసులోచన" అని గుర్తింపగలరు.

## క్రీడారంగం

ఆర్యా,

క్రీడారంగము వ్రాయుచున్న వారికి మన ఆటగాండ్రగురించిగాని, క్రికెట్ గురించిగాని తెలియనట్లున్నది. మన భారతదేశములోని కెప్టెన్లలోకెల్లా సమర్థుడైన రామ్‌చంద్‌ని ఆటగాడు కాదనుటవల్ల వారికి క్రికెట్ సంగతి తెలియదని తెలియుచున్నది. మన దేశములో కెప్టెనుగా వుండుట మహా కష్టము. అందువల్లనే గులాం అహ్మద్, ఉమ్రిగర్, మంకడ్ మొదలగువారు తప్పుకొనిరి. అటువంటిది జి. ఎస్. రామ్‌చంద్ తను ఫారమ్‌లో (Fcrm) లేకపోయినప్పటికి సమర్థతతో తన జట్టును నడిపించి ఇండియా క్రికెట్‌లో ఏ దేశమునకు తీసిపోదని నిరూపించగలిగారు. ఇటువంటి కెప్టెనుకు జోహారులర్పించవలెను.

కిషన్, తెనాలి.

## ఎప్పుడూ ఇంతే

"ఎప్పుడూ ఇంతే" అను శీర్షిక చాలా బాగుంటోంది. అమాయకపు భర్తలతో కాపురంచేసే గయ్యాళి భార్యలపట్ల ఈ కార్టూన్లు మందులా పనిచేస్తాయి. ఈ కార్టూను చూచి ఇకనుంచి గయ్యాళి భార్యలందరూ తమ భర్తలపట్ల నిర్లక్ష్యంగానూ, కోపంగానూ ప్రవర్తించటం మానగలరనుకోవచ్చునేమో.

వి. ఆర్. శేఖర్,
చేబ్రోలు.

* *

"ఎప్పుడూ ఇంతే" కార్టూనులు 'వనితాలోకం' క్రింద వేయడంలో ఉద్దేశ్యము మహిళలను బాగుగా గమనించమనియా! ఒకవిధంగా ఈ బొమ్మలు గృహిణులను దుయ్యబట్టుచున్నాయి, వీటిని ఈ సెక్షను క్రింద వెయ్యవద్దు అని వారించిన వనితా పాఠకులు లేనట్లున్నది. దీనినిబట్టి చూస్తే కొన్నాళ్లు సంసారం చేసిన తర్వాత గృహిణిదే పైచెయ్యి అవుతుంది అనే యథార్థాన్ని నిరూపించుచున్నట్లున్నది.

పబ్బవీసు ప్రభాకరరావు, నెల్లూరు.

* *

## శోచనీయం

తెలుగువారి యిండ్లలో జరిగే హాస్యరసభరితమైన, ఆకర్షవంతమైన చిత్రాలను ముఖచిత్రంగా ప్రచురణకు పంపవలసిందిగా చిత్రకారులకు పత్రికాముఖంగా పత్రికాధిపతులు చేసిన విజ్ఞప్తికి జవాబుగా ఒక్క చిత్రమూ ముఖపత్రం మీద కనుపించకపోవడం చాలా శోచనీయం! హామేషా సినీతారల చిత్రాలే పత్రిక ముఖపత్రానికి అలంకారాలా? లేక గొడ్డుపోయిందా ఆంధ్రదేశం చిత్రకారులకు??

గుమ్మా ప్రసాదరావు,
రేవా.

(54-పేజీ చూడండి)

# ఆంధ్రప్రదేశ్ లో ప్రాజెక్టుల పరిస్థితి

## “మంచికబుర్లు కాదు, మంచిపనులు కావాలి”

'పరిపాలకులు చాలామంది ప్రత్యేకశాస్త్ర ప్రజ్ఞ లేనివాళ్లు. అందుకల్ల నిర్మాణ కార్యక్రమాలలో క్షుణ్ణమైన పాండిత్యము గల ఇంజనీర్లు, పరిపాలకులకు సత్యమైన సలహాలు ఇవ్వడంలో వాళ్లపై గురుతరమైన బాధ్యత ఉన్నది.' అని మొన్న అన్నది ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ దామోదరం సంజీవయ్య. ఆంధ్ర రాజధానిలో ఈ వారములో జరిగిన అఖిలభారత ఇంజనీర్ల వార్షిక సమావేశాన్ని ప్రారంభిస్తూ వారు ఈ సలహా యిచ్చారు. ముఖ్యమంత్రి యిచ్చిన ఈ సలహా యెంతో పసందుగా సమంజసముగా నున్నది. ఇది ఇంజనీర్లందరికీ శిరోధార్యము.

అనేక కారణాలవల్ల తార్కాణాల వల్ల ఇది మంచిమాట అనాల్సివస్తోంది. ఇంజనీర్ల గోలను, ఇంజనీర్లనూ, రాజకీయాలు తిలకిస్తున్నా మన్నది అనుభవైకవేద్యము. గోదావరిపై రామపాదసాగరము ప్రాజెక్టు అద్భుతమైన నిర్మాణము అవుతుంది అని ఒక ఇంజనీరు అంటే 'అది ఒక కలమాత్రమే' అని మరొక ఇంజనీరు అన్నాడు. న్యాయవాదులు వాదనకోసము మంచిని చెడుగాను, చెడును మంచిగాను యుక్తివాదం చేత చూపిస్తే ఒక పక్షానికి సహించవచ్చునేమో! కాని, కళనిర్మాణదక్షులైన ఇంజనీర్లు సాధ్యాన్ని అసాధ్యంగాను, అసాధ్యాన్ని సాధ్యంగాను, మంచిని చెడుగాను, చెడును మంచిగాను గారడీ చేసి చిత్రించబూనుకుంటే దేశానికి అనర్థము వస్తుంది. కానీ యిద్దరు యింజనీర్లు వ్యక్తిగత భేదాలవల్ల రాజకీయాల మార్పులవల్ల రామపాదసాగరాన్ని సాధ్యముగాను అసాధ్యముగాను చెప్పారనుకుంటే కృష్ణానదిపై యిప్పుడు నిర్మిస్తున్న నాగార్జునసాగర్ డాం ఎత్తు 590 అడుగులు ఉండాలని ఇదివరకు చెప్పిన మహామహుడైన ఒక అఖిలభారత ఇంజనీరే 525 అడుగులకు తగ్గించాలని పట్టుపట్టడము రాజకీయాల ప్రభావముగాక మరేమనాలి? ఈ దశకు ఆయనమాట చెల్లబోవడము లేదనుకొండి.

నిజంగా దేశభవిష్యత్తును తీర్చిదిద్దేది మంత్రులు ఇంజనీర్లేనని ఒప్పుకుంటాము. మన ఆంధ్రప్రదేశ్ కు ప్రధాన యింజనీర్లు నవగ్రహాలలాగా తొమ్మండుగురు ఉన్నారు. వీరిలో కొందరు పనిపాటలకు కొంచెం స్థానమునిచ్చి, మంత్రులస్తోత్రపాఠాలకు (ప్రసంగాలలో) మంత్రుల యిళ్లచుట్టూ తిరగడానికి ప్రధాన స్థానము ఇస్తున్నారనే ఫిర్యాదు ఉన్నది. అంతేగాదు, కొందరు సాంకేతికమైన అభిప్రాయము చెప్పడానికి కూడా మంత్రుల ముఖాలకేసి ప్రొద్దుతిరుగుడు పూవు సూర్యుడి దిక్కు చూచినట్లు సదా ఎదురుచూస్తూ ఉంటారు. సాంకేతిక పరిజ్ఞానాన్ని బట్టి కాక మంత్రుల కోపతాపాలకు అనుకూల ప్రతికూల అభిప్రాయాలకు ప్రధాన యింజనీర్లే ఎదురుచూస్తే ఇక క్రింది సిబ్బంది గతి ఏమి చెప్పాలి? మనకు రాష్ట్రములో వచ్చే ఆదాయములో సగముపైగా వీరి చేతుల మీదుగా ఖర్చు పెడుతున్నాము. ప్రమోషన్లలో లేదా, ఉద్యోగాలకు గడువు పెంచడములో ప్రభుత్వము కూడా ప్రతిభ, సత్తువ, దేశక్షేమాన్ని దృష్టిలో ఉంచుకోకపోతే దేశానికి హెచ్చు ప్రమాదము ఉన్నది. భవనాలశాఖ, ప్రజారోగ్య శాఖల ప్రగతి తృప్తికరముగా లేదని గోలగా ఉన్నది. ఇంజనీరింగ్ శాఖలో ఆంధ్ర తెలంగాణా విభేదాలు బాధగా ఉన్నాయని చెబు

## అట్టమీద బొమ్మ




గతవారం కథలో సుందరిని సుబ్బారావు పెళ్లి చేసుకున్నాడా? జీవితం అమెరికన్ బాటలా మారువేషం వేసుకుని అతనిపాలిట విలనుగా దాపురించిందా? అన్న ప్రశ్నలకు సమాధానం తెలుసుకోవాలని అట్టమీద బొమ్మలో అబ్బాయి కొత్తవారపత్రిక కోసం తహతహలాడి పోతున్నమాట నిజమే. ఆ అమ్మాయీ అదే మనస్థితిలో ఉండి బస్సుస్టాండ్ లోనే పత్రిక తెరచి చూడబోయింది గాని ఆ పేజీలపై రెండు వీక్షణాలు తారట్లాడుతున్నాయి. అవి ఆ అమ్మాయికంట బడడంతో వాటిని అలవోకగా చూసి నవ్వబోయిందా చిన్నది. చిన్నవాడు కూడా తనను తగులుతున్న చూపులను చదువుతున్నాడు. ఈలోకం చుట్టూ పరిభ్రమించే మరెండుగోళాలు ఒక్కప్పుడు ఇటువంటివే కొన్నాళ్లకి విడిపడి గతిమార్చాయి. రావుజీ ఈ సన్నివేశం చూసి ముచ్చటపడి నెమ్మదిగా గత జీవితపు స్మృతులను నెమరు వేస్తున్నారు. “అనగనగా ఒక రాజు” అని ఆరంభమైనకథ తొలివాక్యాలను తలుచుకుంటున్నారు. ఈ వెంపుఉన్న పిన్నిగారు కూడా “అనగనగా ఒక రాకుమారి” అని మొదలైన తన చిన్ననాటికథలో వాక్యాల ప్రతిబింబాలను తనపక్కనున్న సన్నివేశపు దర్పణంలో చూసుకుని స్వప్నానికీ సత్యానికీ, గతానికీ ప్రస్తుతానికీ మధ్య సరిహద్దు రేఖమీద నిలబడి ఉంది. ఈ ప్రేమలోక భ్రమణాలతో ప్రమేయం లేకుండా ఉన్నవాడు ముందు నిలబడ్డ చిన్నపిల్లడొక్కడే. అక్కయ్యకేసి అమ్మా, పిన్నీ ఒకొక్కసారి అదోలా చూసినప్పుడు అందులో తాత్పర్యం, నాన్నగారు అన్నయ్యనీ వదినని అలా చూస్తూ ఆలోచనలో పడిపోయినప్పుడు అందులో తీయదనం వాడికింకా బోధపడదు. తాను చప్పరిస్తున్న లాలిపాప్ కన్న తీయనిది ఇంకోటి ఉంటుందని వాడికింకా తెలీదు. చిత్రకారుడు బాలసుబ్రహ్మణ్యం, ఈ వాక్యకారుడు పనిగట్టుకు బోధపరచినా వాడికి తెలీదు. ★

# ★ హైదరాబాదు విశేషాలు ★

తున్నారు. రోజూ రాజధానీనగరములో మూడునాళ్లు పోర్లన్నా విద్యుత్తు తగ్గిపోవడము లేదా దీపాలు మినుకు మినుకుమంటూ తగ్గిపోతూ ఉండటము జరుగుతోందని రాజధాని నగరవాసులు అంటున్నారు. ఉత్సాహము, పట్టుదల, దక్షత కల చిన్న ఇంజనీర్లు ఎందరో ఆయాశాఖల్లో ఉండవచ్చు. పైవారి ఆదర్శాలు సరిగా ఉండకపోతేను, చిన్నవారికి అవకాశాలు రాకపోతేను, ఫలితముజగదేక వేద్యము.

ఇక రస్తాలశాఖ: 'మాకు కేటాయించినది చాలడము లేదు. హెచ్చు కేటాయించం

డంటారు. ఉదాహరణకు ఒక్క గోదావరిపై ఆలమూరు దగ్గిర కడుతున్న వంతెన సంగతి ఎత్తుకుందాము. కీర్తిశేషులు కళావెంకట్రావు దీనికి పునాదిరాయి వేశారు. 125 లక్షలు ఖర్చు అవుతుందని వేసిన అంచనా యిప్పటికి 172 లక్షలకు పెరిగింది. మొదట పునాది వేసిన స్థలము భద్రాచలముకాగని, వేరేస్థలము నిర్ణయించి మొదటి వేసిన ఆరాయిని పెల్లగించారు.

ఆంధ్ర రాష్ట్ర ఉపముఖ్యమంత్రి, పి. డబ్ల్యు. డి. మంత్రిగా వుండిన శ్రీ సంజీవరెడ్డిగారిచేత మళ్ళీ రెండో చోట పునాదిరాయిని పాతించారు. ఇందుకు దానికి మరో ఉత్సవము. అసలు పని 1956 మార్చిలో మొదలు పెట్టారు. ఇప్పుడు ఎనిమిది నెలలుగా కాంట్రాక్టర్ల టెండర్లు తెగకు తేలక పని నిలిచిపోయింది. పని మొండిపడింది. ఉక్కు, విదేశీమారకం కొరత, టెండర్ల పరిష్కారము త్వరగా తేలితే ఇంకో రెండేళ్ళకు పని ముగుస్తుందేమో అని రస్తాలశాఖ చెబుతున్నది! సరే. ఇది పూర్తిగాకుండానే వెళ్ళిపోతున్న ముఖ్యమంత్రిచేత సిద్ధాంతం దగ్గిర కృష్ణపై మరో కోటి రూపాయల వంతెనకు పునాది రాయి వేయించారు. తుంగభద్రపై వంతెన ఎంతకాలముగానో ఆలస్యమైంది. కేకి. ఉప్పుటేరు, అముదాల శ్రీకాకుళం ప్రాంతాల కూలిపోయిన మరో వంతెన, మధ్యములో ఆలనాపాలనా లేని వంతెనల కథలు గాథలు ఆయా ప్రాంతాల ప్రజను అడిగితే తెలుస్తుంది. ఇంజనీర్ల నుంచి మనకు కావలసింది మంచి పనులుగాని, మంచి కబుర్లు కావు.

కోట్ల డబ్బును వెచ్చించిన కడెం డాం కథను గోదావరితల్లిని అడిగితే చెబుతుంది. మూసీ ప్రాజెక్టుకథ పుష్కరం దాటుతున్నా ఎందుకు పూర్తి కాదో కృష్ణవేణీ తరంగిణిని అడుగుతే చెబుతుంది. కృష్ణాబరాజ్ తలుపులకు, మధ్యతరగతి 14 ప్రాజెక్టులకు ఉక్కు ఎందుకు రావడము లేదో ప్రణాళికాసంఘం ఉపాధ్యక్షులు శ్రీ వి. టి. కృష్ణమాచారిగారు చెప్పాలి. గోదావరిపై ఏటా వరదల ఉధృతము కర్ణపుటాలను భేదిస్తుంటే కట్టలు బలము చేయడానికి. వరదనిరోధక పథకాల క్రింద డబ్బు సహాయము చెయ్యడానికి కేంద్రానికి ఎందుకు అభ్యంతరమో కేంద్ర విద్యుత్ జలమండలి అధికార్లు చెప్పాలి. వారు బుడమేరు రిజర్వాయరుకు డబ్బు యిస్తామన్నా అది ఎందుకు అమలు జరుపబడలేదో కృష్ణాజిల్లా ప్రజలు చెప్పాలి.

ఇప్పుడు మనరాష్ట్రానికి మంత్రిగా ఉత్సాహం పట్టుదల, దక్షతగల వ్యక్తి శ్రీ అల్లూరి సత్యనారాయణరాజుగారు వచ్చారు. పనిలో జరిగే అక్రమాలను, లంచగొండితనాన్ని, కాలహరణాన్ని అరికట్టడానికి ఆయన కంకణము కట్టుకున్నామన్నారు. ఆయన సరి అయిన కొత్తదారి చూపిస్తారని ప్రజలు ఆశించడములో ఆశ్చర్యంలేదు.

* * *

ఒక మండలంరోజులుగా రాజధానీనగరములో ప్రజలకు ఒక వినోదముగా కాలక్షేపము అయిన ఎగ్జిబిషన్ ముగిసిపోయింది. ఈ ఎగ్జిబిషన్ నిర్వాహకుల్లో కొందరు పాతుకుపోయి, కొత్తమనుష్యులను రానీకుండా పాతపద్ధతులే అవలంబిస్తున్నారు. ఎగ్జిబిషన్ నిర్వాహకుల్లో ప్రతియేడు కాకపోయినా రెండేళ్ళ కొకసారి అయినా మార్పు వచ్చి కొత్తమనుష్యులకు చోటురావాలి. ఈ ఎగ్జిబిషన్ పోటీల్లో వ్యవసాయ. ఫలప్రదర్శనములో అనేకమందికి బహుమతులువచ్చాయి. అందులో మల్లపాలెం వాస్తవ్యులు శ్రీ పెరిచర్ల భాస్కరరాజుకు ఆరు బహుమతులు వచ్చాయి. ఢిల్లీలో ఆంధ్ర వ్యవసాయశాఖ పెట్టిన ప్రదర్శనశాల ఆంధ్రకు పూర్తిగా ప్రతిబింబముగాకపోయినా అందులోగూడా శ్రీ భాస్కరరాజువంటివారు చెప్పుకోదగిన ఫలాలను దర్శించారు. తొమ్మిది అడుగుల పొడవు, 326 పళ్ళు గల అరటిగెల, ఎనభై కాయలుగల కొబ్బరిగెలను వారు (శ్రీ రాజు) ప్రదర్శించగా ప్రధానమంత్రి ప్రభృతులు సెబాస్ అని వీపున జబ్బ చరిచారు. వీరు ఏటా రాష్ట్రాల్లోను, అఖిలభారత పోటీ జరిగినచోట పాల్గొని, బహుమతులు తెచ్చి, గెలుచుకొని, గెలిచి ఆంధ్రప్రదేశ్ రైతులకు మంచి కీర్తిప్రతిష్ఠను తెస్తున్నారు. వ్యవసాయశాఖ ఇటువంటి పిదవాసులైన రైతులందరికీ తగు ప్రోత్సాహము యిచ్చి, ఆంధ్రప్రదేశ్ ఉసేద్యములో గల అగ్రస్థానాన్ని జగత్తుకంతా చాటాలి. ★



# న్యూఢిల్లీ లేఖ

## భారతప్రభుత్వపు దేశరక్షణవిధానం

పార్లమెంట్ బడ్జెట్ సమావేశం సాదాగా, తాపీగా ప్రారంభమైంది. ఈ ఏడాదికల్లా ఇదే దీర్ఘ సమావేశం అవుతుంది. ఈ సమావేశంలో మొత్తం 60 సభల వరకూ ఉండేట్లున్నాయి. కడచిన ఏడాదిలో ఏగిపాలనను సమీక్షించటం, రాష్ట్రపతి ప్రసంగంపై చర్చ, బడ్జెట్ పై చర్చ ఈ సమావేశం చేసే పనులు.

రాష్ట్రపతి ప్రసంగంలో గడచిన ఏడాది ప్రభుత్వం చేసిన పనులు, సాధించిన విజయాలు సమీక్షించబడ్డాయి. ఈ సందర్భంలో ఒకవింత గమనించాలి. ఇటు రాష్ట్రపతి పార్లమెంటులో ప్రసంగిస్తూ ఉండగా, అటు రిజర్వ్ బ్యాంక్ గవర్నర్ శ్రీ హెచ్. వి. ఆర్. అయ్యంగారు కలకత్తాలో 'డిపార్ట్‌మెంట్ ఆఫ్ ఎకనామిక్స్'లో మాట్లాడుతూ. నానాటికి పెరిగిపోతున్న ధరల్ని గూర్చి, వాటిని అదుపులో పెట్టవలసిన ఆవశ్యకత గూర్చి, ఉద్ఘాటించారు.

రిజర్వ్ బ్యాంక్ గవర్నరు కలకత్తా వెళ్ళేముందు న్యూఢిల్లీ వచ్చివెళ్ళారు. అందుచేత దేశపు ఆర్థిక పరిస్థితిని గూర్చి, కేంద్ర ప్రభుత్వంతో, ముఖ్యంగా ఆర్థికశాఖతో చర్చించే ఉంటారని అనుకోవచ్చు.

రాష్ట్రపతి ప్రసంగాన్ని తయారుచేసి పెట్టేది ప్రభుత్వమేనని, ఆ ప్రసంగంలో ప్రభుత్వ విధానాలు సూచించబడుతూ ఉంటాయని అందరికీ తెలిసినదే. అందుచేతనే రిజర్వ్ బ్యాంక్ గవర్నరు చేసిన హెచ్చరికను ప్రభుత్వం పట్టించుకోకుండా ఊరుకోవటం ఆందోళనకరంగా ఉన్నది.

భారత - చైనా వివాదానికి సంబంధించినంతవరకు, భారత ప్రభుత్వం తాను ఎలా వ్యవహరించదలచిందో రాష్ట్రపతి ప్రసంగం ద్వారా వెల్లడించింది. చైనా ఆక్రమించిన ప్రాంతాలు ఎందుకూ కొరగానివని ప్రధానమంత్రి పదే పదే అదేపనిగా ప్రజల చెవిసిల్లు కట్టుకొని చెబుతున్నారు. గడ్డి మొక్క అయినా మొలవని ప్రదేశాలనీ, మానవ నివాసయోగ్యం కానివనీ ఆయన నొక్కి వక్కాణిస్తున్నారు. అయితే అలాంటి నిర్జనభూములమీద చైనా కెందుకంత మమకారమో ఆయన చెప్పటం లేదు.

సరిహద్దు తగాదాలో చైనా ప్రపంచ ప్రజాభిప్రాయపు ఒత్తిడికి లోనై, భారత దేశంతో ఒప్పందానికి రాగలదని, ఉభయ దేశాల మైత్రి సుస్థిరం కావటానికి ఇదొక్కటే మార్గమని రాష్ట్రపతి తన ప్రసంగంలో అన్నారు. ఆయన ఇంకా ఇలా అన్నారు:

"జాతి ఐకమత్యంతో, శక్తిమంతంగా వ్యవహరిస్తేనే ఏ రక్షణచర్యలు తీసుకున్నా అవి ఫలవంతం కాగలవు. ఆర్థికంగా, పారిశ్రామికంగా మనం వేస్తున్న ముందడుగు, విస్తృతమైన ఫలితాలు అతిత్వరలో సాధించటానికి పారిశ్రామికోత్పత్తిని, ప్రణాళికలను మనం ఆయత్తం చేసుకుంటున్న పద్ధతి - ఇవన్నీ ఈ ఆధునిక విజ్ఞాన యుగంలో దేశరక్షణకు అవసరమైన పరికరాలను, సంపదను సమకూర్చగలవు. అంతేకాకుండా దేశం బలీయమూ, క్రమశిక్షితమూ అయ్యేట్లు చేసి, ఆ విధంగా మనదేశభద్రతను సుస్థిరం చేయగలవు."

ప్రభుత్వపు ఆలోచనలు ఏ తీరున ఉన్నాయో దీనివలన బోధపడగలదు. మన దేశాన్ని భద్రంగా ఉంచుకోవటానికి ముఖ్యమైన అవసరాలేమిటో భారత ప్రభుత్వం



సోవియెట్ ప్రధాని శ్రీ క్రుశ్చేవ్ భారతప్రధాని శ్రీ నెహ్రూ ఈనెల 12వ తేదీన సమావేశమై వివిధసమస్యలపై చర్చలు జరిపారు. భారతదేశానికి రష్యా ఆర్థికసహాయం చేసే ఒక ఒప్పందంపైనా, సాంస్కృతిక సంబంధాల అభివృద్ధికి సంబంధించిన మరొక ఒప్పందంపైనా ఆనాడే శ్రీ నెహ్రూ ఇంట్లో సంతకాలు జరిగాయి.

# ★ న్యూఢిల్లీ లేఖ ★

ఒక జాబితాలాగా ఇచ్చింది. మనకు జరిగిన అన్యాయాలను సరిదిద్దటానికి ప్రపంచ ప్రజాభిప్రాయాన్ని సుముఖం చేసుకోవలసి ఉంటుందని కూడా సూచించింది. ఒక విషయం ఇక్కడ గుర్తించాలి: హాంగరీ. ఏషియా ఆఫ్రికా దేశాలు కూడా ప్రపంచవాసులను తమ వాదానికి సుముఖులుగా చేసుకోవాలని ప్రయత్నిస్తున్నాయి, కాని ఇంతవరకూ ప్రయోజనమే లేకపోయింది.

ఏ రాజకీయ కూటమితోనూ చేరరాదనే సిద్ధాంతంపై నమ్మకంగల కాంగ్రెసు మంత్రివర్గ సభ్యులు కొందరు ఇప్పుడు తమ ఆశలన్నీ రష్యన్ నియంత శ్రీ క్రుష్చేవ్ పై పెట్టుకున్నారు. శ్రీ క్రుష్చేవ్ ప్రధానమంత్రి అయినప్పటికి, ఆయనకు పాలం విమానాశ్రయంలో భారత రాష్ట్రపతే స్వయంగా స్వాగతమిచ్చారు. ఆయన గౌరవార్థం రాష్ట్రపతి విందు కూడా

చేస్తున్నారు.

ఈ విషయంలో పశ్చిమ దేశాలు "ప్రోటోకాల్" నిబంధనలేమీ లేదని ప్రధాని నెహ్రూ పార్లమెంటులో ఒక ప్రశ్నకు సమాధానంగా అన్నారు. అమెరికా తాను వెళ్ళినప్పుడూ, శ్రీ కృశ్చేవ్ వెళ్ళినప్పుడూ, విమానాశ్రయంలో అమెరికా అధ్యక్షుడే స్వాగతమిచ్చారని చెప్పారు. కాని బ్రిటిష్ ప్రధాని అమెరికా వెళ్ళినప్పుడు కూడా విమానాశ్రయంలో అధ్యక్షుడే స్వాగతమిచ్చారు. మరి బ్రిటిష్ ప్రధాని న్యూఢిల్లీ వచ్చినప్పుడు భారత ప్రధాని ఒక్కరే స్వాగతమిచ్చారు. అందుచేత అమెరికన్ ఉదాహరణను ఇక్కడ అడ్డం పెట్టుకుని మాట్లాడటం సమంజసంగా లేదు. అసలు విషయం ఏమిటంటే శ్రీ కృశ్చేవ్ రష్యా నియంత. అందుచేత చైనా కుంపటిని మన గుండెల మీదనుంచి తొలగించటంలో సహాయపడతాడేమోనని ఆయనకు ఈవిధంగా ప్రత్యేక గౌరవం ఇవ్వటం జరుగుతోంది.

శ్రీ కృశ్చేవ్ తన మిత్రుడైన శ్రీ చౌ ఎన్ లై ను న్యూఢిల్లీకి వచ్చి మాట్లాడవలసిందనీ, రంగూన్ లో నే సమావేశమవుదామని పట్టుబట్టి శ్రీ నెహ్రూను ఇబ్బంది పెట్టవద్దనీ సలహా ఇస్తారని ఇక్కడ లాబీవర్గాలు భావిస్తున్నాయి. చైనా-భారత సరిహద్దు తగాదాకు సంబంధించినంత వరకూ ప్రపంచ ప్రజాభిప్రాయాన్ని తనకు సుముఖం చేసుకోవటం మీదనే భారత ప్రభుత్వం ఆధారపడుతోంది. ప్రపంచ ప్రజలు చైనా చర్యలను ఖండిస్తున్నారని, సరిహద్దు విషయంలో ఒప్పందానికి వచ్చేట్లు చైనాను నేడు కాకపోతే రేపైనా తాను ఒప్పించగలననీ భారత ప్రభుత్వం భావిస్తోంది.

అయితే చైనానుఖండిస్తున్న ప్రపంచ ప్రజలెవరు? భారతదేశాన్ని ఇంతవరకూ సమర్థించింది పశ్చిమ ప్రజాస్వామిక రాజ్యాలే. కమ్యూనిస్టు రాజ్యాలు ఇంతవరకూ ఈ విషయమై ఏమీ నిర్ధారణగా చెప్పలేదు. లేక ఏమైనా చెప్పినా, భారత వైదేశిక శాఖ దాన్ని ప్రచారం చేయటం లేదా! ఇంతే కాదు. భారతదేశానికి గాఢ స్నేహితులనదగిన ముస్లిం రాజ్యాలు, ఆఖరికి కర్నల్ నాసర్ కూడా నోరు విప్పలేదు. కాని మూడేళ్ళ క్రితం ఈజిప్టుపై ఇంగ్లండు, ఫ్రాన్సులు మిలిటరీ చర్యకు దిగినప్పుడు శ్రీ నెహ్రూ దాన్ని ఖండించి, కొమ్ముకాసినంత భారతదేశం దానా పుతిప్పుకు చేయంత పని చేశారు. ఏది ఏమైనా పెట్టుబడిదారీ రాజ్యాలతో కూడిన ప్రపంచాభిప్రాయానికి కమ్యూనిస్టు దేశాలు తలవంచవు అనే నిర్ణయానికి రావాలి.










# తెలుగు వెలుగులు 23

మంత్రిపదవి అనేది శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారిని అంటి పెట్టుకుని ఉన్నట్లుగా మరెవరినీ అంటిపెట్టుకుని ఉండటం లేదు.

1937 సంవత్సరంలో కాంగ్రెసు ప్రప్రథమంగా మంత్రిపదవులు స్వీకరించిన నాటినుండి, నేటివరకూ (ఒక్క ప్రకాశంగారి మంత్రివర్గంలో తప్ప) మంత్రిత్వమనేది ఆయన వెంటపడుతూ వచ్చింది. ఆంధ్రరాష్ట్రం ఆంధ్రప్రదేశ్ గా విస్తరించే సమయంలో ఆంధ్రకు ఆయన ముఖ్యమంత్రిగాకూడా ఉన్నారు. ఆ స్థితిలో ఆంధ్రప్రదేశ్ కు సరాసరి ముఖ్యమంత్రి అవవలసినది. కాలేదు. కాకపోవటానికి ఒక్కటే కారణం. మంత్రి పదవి అయినా, ముఖ్యమంత్రి పదవి అయినా, మరింకో పదవి అయినా, తనకు తానై ఏదీ సాధించుకున్నది కాదు. వచ్చిన వన్నీ అప్రయత్నంగా సిద్ధించినవే. ఆయన అనాయాసయోగ శిఖామణి, కాని అనాసక్త యోగ శిఖామణి కాదు. ఆ సక్తికి తగ్గ సాధన లేకపోయినది. అనాయాసంగా పదవులు రావటమే ఆయనకు చెరుపైనది. పైగా ఆగర్భ శ్రీమంతుడు. లక్ష్మితోపాటు సరస్వతికూడా కటాక్షించింది. పెద్దల ఆదరణ లభించింది. వీటితోడు, చిన్న వయస్సులోనే అప్రయత్నంగా (రాజాజీ మంత్రివర్గంలో మంత్రిత్వం) పెదపదవి రావటంవల్ల, పెద్దగా వ్యవహరించటానికి ప్రయత్నిస్తూ వచ్చారు. ఆ ప్రయత్నంలో సామాన్యులకు దూరమైనారు. అంతే తప్ప అసామాన్యులై, సామాన్యుల గౌరవానురాగాలను సంపాదించలేకపోయినారు. "నాకు జనానురాగం (popularity) అక్కరలేదు. నాకు ఎవరిమీద మమత (attachment) లేదు" అన్నారు ఒక సమయంలో. ఓమాండూరు మంత్రివర్గంలో ఆర్థిక మంత్రిపదవిని కోరి తీసుకున్నారు. అది ఆర్థిక వ్యవహారాలమీద, సమస్యల మీద ప్రత్యేకాభిరుచి అభిమానమూ ఉండికాదు. దినదినమూ వచ్చే సామాన్యుల అప్లికేషనుల గుంపునుండి తప్పించుకోవడానికే. [illegible] మార్దవం ఉంటే తప్ప. మతి మంతజ్ఞో అని మూల కూర్చుంటే నాయకత్వం రాదు. అందుకనే కాంగ్రెసులో ఒకప్పుడు అతిరథులుగా ఉన్నవారు నేడు విరథులుగా ఉన్నారు.

ఆయనకు రాజకీయాలలో రాజాజీగురువు సాహిత్యంలో రవీంద్రుడు గురుదేవుడు. ఆ గురుభక్తికి, సాహిత్యాభిరుచికి రూపాలు ఆయన చేసిన అపక్వానువాదాలు. రవీంద్రుని తెలుగులోకి దించటానికి వట్టి సాహిత్యశ్లాఘలావ, అభిరుచి చాలవు. దానికి కావలసిన సామగ్రి ఇంకా చాలా చాలా ఉన్నది. ఆ అనువాదరచనల ప్రతిష్ఠ శ్రీ రెడ్డిగారి రాజకీయప్రతిష్ఠతో పెరుగుతూ, తరుగుతూ వచ్చింది. మంత్రిగా ఉన్నప్పుడు మాత్రం మనీషి.

శ్రీ గోపాలరెడ్డిగారుకనుక స్వతంత్ర రచనా వ్యాసంగం సాగించి ఉన్నట్లయితే, రచయితగా ఇప్పటికంటే ఎన్నెక్కు రాణించేవారు. పాతిక సంవత్సరాల క్రితము 'విజాయిరెడ్' అనే పేరుతో వ్రాసిన Gandhi, the man of letters) అనే వ్యాసమూ, ఇతరపద్యాలూ ఈ భావానికి ఆధారం.

రాజాజీ, రవీంద్రులను చూసి ముగ్ధుడై, వారిని ఉపాసించటం సాగించారు. ఆ ఇద్దరినీ మేళవించి, పల్లవించాలనుకున్నారు. అది ప్రమాదించింది. ఫలితం—ఆయన కవికాని కవి; సాహిత్య సుందరి చరణ చారణ చక్రవర్తి. నాయకుడుకాని నాయకుడు; రాజకీయాల్లో ఒక మాదిరి ఒమర్ ఖయ్యాం. బుచ్చిరెడ్డి గడల రెక్కు; పోయిన దాన్నిగురించి విచారించక, ఉన్నదాంతో సుఖించి, ఆనందించే వ్యక్తి; వేదాంతి.



# అందమైన కథ

పురిటికైనా తీసికెళ్ళే అత్తగారులు. నెలకొకసారైనా యింటిల్లిపాదీ సినిమాకెళ్ళే ఆస్తిపాస్తులూ...యిలాంటి కనీసమైన కోరికలు కోరడం అత్యాశ అనిపించుకోదుగా! నేనూ అందరిలాగా ఉప్పూ పులుసూ తింటున్నవాడినే. అయిదడుగుల ఆరంగుళాల ఎత్తు, మాటను స్ఫురింపచేసే బరువూ నాకూ ఉన్నాయి. సహజమైన తెలివితేటలలో సాటివారికి నేనెప్పుడూ వెనకబడలేదు. బియ్యే డిగ్రీ అనే అచ్చు యూనివర్సిటీ నాకు వేసింది. అందరూ అర్రులు చాచే అదృష్టాన్ని ఆశించడంలో ప్రత్యేకించి నా ఒక్కడి తప్పూ ఏమీ లేదు. తెలిసి నేనెవ్వరికీ ఏ అపకారమూ చెయ్యలేదు. మరి నాకెందుకీ శిక్ష? ఆకలికి గుమాస్తాగిరీ వెలిగిస్తున్నా నాజీతం నూటయిరవై ఎందుకు దాటకపోవాలి? మంచం దిగని తల్లి, ఓపిక లేని భార్యా నన్నెందుకు వేధించాలి? ఇంటినిండా పిల్లలూ, పెళ్ళికాని చెల్లెలూ నన్నెందుకు బాధించాలి? దుర్భరమైన దారిద్ర్యమూ, దుస్సహమైన దౌర్భాగ్యమూ నాకు ఆనందించే వారంటే అసూయా, కలవారంటే కసీ నేర్పాయి. భరించలేని నా దుఃఖాలు బలహీనుల పాత బాటకే పొమ్మని సలహా చెప్పేయి.

అవాళ...అవాళసలు నా ఒంట్లో ఏం బాగులేదు, ఏమిటో చాలా చికాగ్గా ఉంది. దానిమీద మా ఆఫీసరు చచ్చే చీవాట్లు పెట్టేడు. దారిలో మా యింటతను కనిపించి రెణ్ణెల్ల అద్దె యివ్వలేదని నలుగురిని పోగుచేసి నానా మాటలూ అని నా ప్రాణం సగం తీసేశాడు. మనసూ శరీరం అతిగా అలిసిపోయి విశ్రాంతికోసం తహతహలాడుతూ ఆ మధ్యాహ్నం మూడింటికి యిల్లు చేరుకున్నాను. దూరంనుంచే మా అమ్మ జానకి గొంతుకలు వినిపిస్తున్నాయి. మా పెద్దాడు గబ గబా పరిగెత్తుకొచ్చి నాన్నా, నాన్నా బామ్మా అమ్మా పొద్దుట్నుంచీ దెబ్బలాడుకొంటున్నారు. అమ్మేమో అత్తని తిట్టింది. ఒక్కటే ఏడుపు. బామ్మా అత్తా యింక మనింట్లో ఉండరట. ఉండమని నువ్వేనా చెప్పు నాన్నా' అని చెయ్యి పట్టుకు లాగేడు. నాకు భగ్గుమంది. నా ఒళ్ళు నాకు తెలియలేదు. నలుగురూ నన్ను అడ్డేవరకూ వాణ్ణి బాదుతూనే ఉన్నాను.

'కట్టుకున్నదాన్ని కట్టు ఖాయిదాల్లో పెట్టుకోలేక నోరెరగని గుంట వెధవని గొడ్డుని బాదినట్టు బాదుకుంటావట్రా? నీకేమైనా మొగసిరి మిగిలి ఉంటే దాని కింత గడ్డి పెట్టు' అంది మా అమ్మ.

'చూశారా, చూశారా, నేను పల్లెత్తు మాటయినా అన్నానా? ఇంకా ఊరుకుంటారేమిటండీ...నన్ను యిన్ని మాటలన్నా, క

యింకా మీకు ఊరుకో బుద్ధి ఎలాగయిందండీ? ఆ పని చేతని వాళ్ళకొట్టడానికి చేతులొచ్చాయిగాని యీ కొట్టుకున్నవాని...' అని దానికి అనబోతూంటే మా చెల్లాయి అడ్డొచ్చింది.

'...నోరుముయ్యి వదినా... మరీ చిన్నంతరం పెద్దంతరం లేకుండా పోతోంది. ఏంరా అన్నగార్ని అన్నీ వింటూ అలా ఊరుకుంటావేంరా? అమ్మని అలా అంటూంటే నీకు చీమకుట్టినట్టయినా లేదేంరా? దిక్కూ దివాణం లేక నీ పంచ చేరినంత మాత్రాన మాలో సిగ్గూ అభిమానమూ చావలేదురా! నీ ప్రతాపం అంతా చూపించడానికి ఆ గుంట నాగమ్మ ఒక్కతే నా దొరికింది?...'

ఇలా ఉన్నాయి... గదిలోకి వెళ్ళి రెండు తలుపులూ వేసేసుకున్నా వాళ్ళ గోల వినబడుతూనే ఉంది. పక్కమీద పడుకుని రెండు తలగడాలు పెట్టుకున్నా. బుర్ర గిర్రున తిరుగుతూనే ఉంది. చెవుల్లో రెండు వేళ్ళు పెట్టుకున్నా మావాడి మాటలు వినబడుతూనే ఉంది.

ఇంట్లో ఉండే బుద్ధి పుట్టలేదు. తలుపు గడియ తీసుకొని యివతలికి పరిగెత్తుకొచ్చాను. 'ఎక్కడికి?' అన్నారు. 'ఏట్లోకి' అన్నాను. నన్నెవరూ ఆపలేదు. నేనెక్కడికీ పోలేనని వాళ్ళకి తెలుసు. నేను నమ్ముకున్న నీతులే నాకు సంకెళ్లు వేశాయని వాళ్ళకి తెలుసు. తెలుసు తెలుసు నాకూ తెలుసు. దిద్దుకో లేని తప్పుకి తప్పుకోలేని శిక్ష ఎలా వేస్తారో నాకూ తెలుసు. పోతాను. మరి రానిచోటుకే మళ్లీ వచ్చినచోటుకే పోతాను. ఏట్లోకి కాదు. ఏర్లన్నీ ఎక్కడ ఏకమౌతాయో అక్కడికే పోతాను. సముద్రంలో పడతాను. చస్తాను. అంతే. ఈ నిశ్చయానికి తిరుగులేదు, ఉండబోదు. ఎదియున కాలేజిపిళలోంచి సముద్రం వైపు విలయినంత గబగబ నడుస్తున్నాను.

ఆ వీధిలో యించుమించు మధ్యకి వచ్చేసరికి పసుప్పచ్చని మేడ కనిపించింది. అప్రయత్నంగా నువ్వు జ్ఞాపకం వచ్చావు. 'ఒరే, కాలేజీ వీథిలో రామకోటిల యివతల పోస్టుడబ్బాకెదురుగా పసుప్పచ్చని మేడుంది. అందులో మేడమీద వాటాకే మేంకొత్తగా మారేం. ఒరేయ్ రా' అన్న నీమాటలు జ్ఞాపకానికి వచ్చేయి. నాకింక ప్రపంచంలో ఎవరయినా మిగులుతే అది నువ్వే. నిన్నొకమారు చూసి మరీ చద్దామనిపించింది. నీ మేడమీదకు వచ్చాను, నువ్వు కేంపుకి వెళ్ళేవుట, లేవు. నీ ఆవిడ పిల్లల్ని తీసుకుని మేటనీకి వెళ్లిందిట, లేదు. ఆ డాబామీద కుర్చీవుంటే దానిమీద చతికిలపడి ముందుకి చూశాను. రఘూ నేనేం చూశానో ఆ తరువాత నామనస్సుకే కలిగిన అనుభవం ఏమిటో

## బహుమతి పొందిన కార్టూన్






"ఎవరది వెనక్కి కూర్చో!"

చిత్రం: వై. లక్ష్మణరావు, మద్రాసు.

మాటలలో వర్ణించగలనని నాకే నమ్మకం లేదు. అయినా ప్రయత్నిస్తాను. చూశాను. కళ్లు ఒక్కసారి నలుపుకొని మళ్లీ చూశాను. విప్పారిన కళ్లతో మళ్లీ మళ్లీ చూశాను.

నేను చూసింది ఏమిటంటావా? ఎన్నో సార్లు యథాలాపంగా బీచికి వచ్చినా అంత ఎత్తునుంచి అంత ఏకాగ్రతతో అంతసేపు సముద్రాన్ని చూడలేదు. ఎంతబాగుందని! నాకెన్ని లోతులు దొరికేయని!!

విశాలమైన దృష్టితో అపారమైన కృషితో గంభీరమైన శ్రమతో విధాత నిర్మించిన రమణీయ కృత్యం. తెల్లంచుల నల్లని పరికిణీ కట్టుకొని ప్రకృతి సుందరి నిరంతరం చేసే రమణీయ నృత్యం. హృదయమున్న ప్రతివాళ్లని ఉయ్యాలలూగించే కమనీయ దృశ్యం. ఓహ్! అద్భుతసాగరం!!

నిప్పు లేకపోతే కుంపటి ఆరిపోతుంది. నీళ్లు లేకపోతే చెరువు ఎండిపోతుంది. సుఖజీవన సంఘర్షణలో నలిగిపోతే నశించిపోడానికి మధురమైన మానవత అంత రసహీనమైనదా? కాదు, కాకూడదు. నాలోని సౌందర్య పిపాసి లేచి కూచున్నాడు. 'తియ్ నీ జీవిత పుస్తకంలో నవక పేజీలు తియ్' అన్నాడు. పేజీలు తిప్పుతూంటే నా కళ్లమ్మట నీళ్లు కారేయి.

నేను సెకండుఫారం చదువుతున్నప్పుడు ఒవాడు మైనంతో తేలుబొమ్మని చేసి గోడమీద పెడితే నిజంతేలు అనుకొని మా మేష్టారు గొడుగుతో బాదేరు! మా అమ్మ మామిడిపళ్ళరసం తీసి తాండ్రకోసం చేటలకు పూసి ఎండలో పెడితే కాకులు రాకుండా నేనొక మట్టికాకిని చేసి అక్కడ పెట్టేవాణ్ణి. మా వీధిలో ఎవరింట్లో పెళ్లయినా రంగుకాగితాల తోరణాలు నేనే కట్టేవాణ్ణి. మొన్న మొన్నటివరకు మా కాలేజీలో వేసే

#  అందమైన కథ 

డామాలకన్నిటి మేకప్ నేనే. ఊళ్ళో ఏ ఎగ్జిబిషను జరిగినా ఉత్తినే గుండ్రంగా అక్షరాలు రాసిపెట్టేది నేనే. ఏమైంది ఈ సౌందర్యారాధన? 'ఏమీ అవలేదు..' 'అనుభవించు... ఆనందించు' అంది కొర బాల జవరాలు. మళ్ళీ మరింత తన్మయత్వంతో అటు చూశాను. ఎంత తేజస్సని!

ముసుగులోని రాకుమారి వయసులోని రంపులూ, కన్నెపిల్ల మనసులోని కోర్కె ఎన్ని రంగులూ, అమ్మకొంగు చాటునున్న పాప కనుల కాంతులూ... తలిస్తే సాగరంలో ఎన్ని ఎన్ని దొరుకుతాయని! రఘూ! పాలపొంగుల నా మనస్సు రంగు రంగుల ఇంద్రధనుస్సు అయింది. ఆకాశం వైపు నా రెండుచేతులూ ఎత్తి జోహారు చేశాను. 'ప్రభూ! నువ్వు సృష్టించిన ప్రతీ జీవికీ ఆనందించే అధికారం ఉంది. సర్వగుణ కేంద్రమూ, సర్వోత్కృష్టమూ అయిన ఈ మానవజన్మ మహాద్భాగ్యం కాదనే అధికారం ఎవరికుంది? నీరజాజిపువ్వులా చిరుపాప నవ్వులా విరిసిపోయే మానవ జీవన జ్యోతిని ఆర్పే అధికారం ఎవరికుంది? ప్రభూ, నన్ను క్షమించు. నీ సౌందర్యం వదిలి నేనెక్కడికి వెళ్ళగలను? నీ కోసమే బతుకుతాను. అందరిలోనూ నీ చక్కదనమే వెతుకుతాను.'

అంతే. ఒకరిగురించి నా భావాలకి జీవమూ నా అంచనాకి అందమూ అప్పుడే ఏర్పడ్డాయి. ఆకారంలో గాని అందంలో గాని ఈ ప్రపంచమే గురివింద గింజలా అందరికీ అనిపించవచ్చు. కాని నిలువెల్లా మెరసిపోయే అరుణకాంతుల్ని కాదని మాలిన్యమున్న నలినాన్ని వెదకడం ఏం న్యాయం? పరిస్థితులకి బానిసలయి బ్రతుకుతూ బాధపడుతూ ఎదుటి వాళ్ళలో అవే లోపాల్ని సహించలేకపోవడం ఏం ధర్మం? మనుషుల తప్పుల్ని క్షమించడం కంటె మనోహరమైంది ఉందా? ఇలాంటి తియ్యని ఊహలతో ప్రతిది 'గుడ్ సెన్స్'లో తీసుకోవాలనే ఉద్దేశంతో నేను నూ వాళ్ళతో ప్రయోగంచేసి సరమార్గాన్ని సాధించాను. కష్టానికి నష్టానికి ఓర్పులో లేనంత బాధ వస్తే యిక్కడికే అప్పుడప్పుడు వచ్చి యీ సుందర దృశ్యం నిజంలో నే ఓదార్పు అందుకునే వాణ్ణి. జీవించడం ఎందుకో జీవనమాధురి అంటే ఏమిటో నాకిప్పుడిప్పుడే తెలుస్తోంది రఘూ! ఇంకొకర్ని సుఖపెట్టడానికి చిన్న చిన్న కష్టాలు పడి నేను పెద్ద పెద్ద ఫలితాలే సాధించాను.

గట్టిగా టిఫిన్ చేస్తే మనకి ఒకరూపాయి కూడా చాలదు. ఆ రూపాయే నేనేం చేశానో తెలుసా? జానకికి యిద్దరుని పాతిక సంపెంగ పువ్వులూ, చెల్లాయికి రెండు జతల రబ్బరు గాజాలూ అమ్మకి అర సంపు ఉప్పు చెక్కలూ మిగిలిన డబ్బుతో పిల్లలకి నాలుగు స్ట్రాంగు బిళ్ళల పాకెట్లూ తీసుకెళ్ళాను. వాళ్ళ ఆనందానికి మూల్యం ఎంతని!

రఘూ, ఆత్మహత్యలకి దారితీసే ఆపన్నుల్ని ప్రశ్నించే నిండుతనం కూడా యిప్పుడు నాకొచ్చింది సుమా! పరీక్షలో ఫెయిలయి రైలు క్రింద బుర్ర పెట్టే తమ్ముడూ! ఒక్కసారి తలెత్తి ఆకాశం వైపు చూడు. తారు మబ్బులు ఒకటేనా? వాటి చుట్టూ జలతారు అంచులు లేవా? మొగాడే మోసానికి సర్వస్వం సమర్పించి ఉరి తీసుకుని ఊపిరి తీసుకుందామని చెట్టుకింద చేరిన చెల్లాయీ! ఒక్కమారు పక్కకి తిరిగిచూడు. ఏమిటమ్మా నువ్వు చూస్తున్నది? ఎండిపోయిన చెట్టు తొఱ్ఱ ఒకటేనా? అందులో అనుపచ్చని రామచిలక లేదా? 

(ఆకాశవాణి, విజయవాడ సౌజన్యంతో)



# వెలుగు నీడలు

పాలమనిషి కేకతో సంజీవరావు ఉలిక్కిపడి లేచాడు. తల బద్దలు కొట్టినట్టుంది. కళ్ళు ఎఱ్ఱగా అయినవి. నీరసంగా తూలుతూ వెళ్ళి తలుపు తీశాడు. పాలమనిషి పాలుపోసి వెళ్ళింది. కాసేపు నిర్లిప్తంగా శూన్యంలోకి చూశాడు సంజీవరావు. గేటు తీసుకుని రాఘవయ్య తొందరతొందరగా వస్తున్నాడు. "చిటికెలో కాఫీ చేసుకొస్తా బాబూ" అని ఆదరబాదరగా లోపలి వెళ్ళాడతను. తూలుతూ దొడ్లోకి నడిచాడు సంజీవరావు. గులాబి మొక్కని ఒక్కటే పువ్వు విచ్చుకుని, ఎఱ్ఱగా, అందంగా ఉంది. రేకలమీది మంచుబిందువులు జారి కిందగడ్డిమీద పడుతున్నాయి. "పువ్వు పూసింది!" అని ఆశ్చర్యపడ్డాడు సంజీవరావు. నిన్న మొగ్గ కూడా వేసినట్టు లేదు. ఎందుకు వేసుండదు? తను చూసి ఉండడు సరిగ్గా.

పొద్దు తేలిగ్గా ఉంది: నీరసంగా, తూలుతూ నిమ్మచెట్టు మొదట్లో కూచున్నాడు. గడ్డిపరకలమీద మంచు చల్లగా తగిలింది. కాళ్ళు బారచాచుకుని చేతుల్లో మొహం పెట్టుకున్నాడతను.

నిమ్మచెట్టునించి వొచ్చే వాసన అతనికి ప్రశాంతత నిచ్చింది. అనుకోకుండా సంజీవరావుకి "నిన్న" జ్ఞాపకం వచ్చింది. అతనికి భయం వేసింది. నిన్న లేవడంతోటే పిల్లి అరిచింది ఎక్కణించో. అతనికి భయం వేసింది పొద్దున్నే లేవటానికి. శకునాలంటే నమ్మకం ఉన్న మనిషతడు. అందుకని అల్లాగే పడుకున్నాడు ఎనిమిది దాకా. గడియారం గంట కొట్టేటప్పటికి తప్పక లేవవలసి వచ్చింది. ఆఫీసు పదిగంటలికి. భూమి తల్లకిందులయినా, ప్రళయం వచ్చినా, ఏది ఏమయినా సరే పదిగంటలకి ఆఫీసులో ఉండాల్సిందే. ఆఫీసరు ఆనందరావు గారంటే మరి అంత నిక్కచ్చి మనిషి. ఇంకా నిన్నటిపని మిగిలిఉంది. అందుచేత మరి సంజీవరావుకి లేవక తప్పలేదు. గబగబా మొహంకడిగి ఇంత కాఫీ తాగాడు. కాఫీ తాగుతూంటే కొలమారింది. గొంతుమంట పెట్టింది. సరస్వతి తలుచుకుంటూందేమో అనుకున్నాడు.

పాలడుగు వెంకటేశ్వరరావు

అన్నట్టు సరస్వతి దగ్గర్నుంచి ఉత్తరం వచ్చి పదిహేను రోజులయింది. ప్రసవించే రోజులు. ఆరోగ్యం ఎలా ఉందో..? పెద్దాడికి జబ్బుగా ఉందని రాసింది. ఎలా ఉందో వెధవకి? అందులో వాడు వొట్టి అర్భకుడు. బాధకి తట్టుకోలేడు. చిన్నాడికి చెవిమీద ఏవో కురుపులట. తనకికూడా వొంట్లో సరిగా లేదని, తిండి సహించటం లేదని రాసింది. వెళ్ళి చూడాలనిపించింది సంజీవరావుకి; కాని ఎదురుగా బల్లమీది ఫైళ్ళు వెక్కిరించాయి. ఆఫీసరు ఆనందరావుగారు గర్జించినట్టు ఉలిక్కిపడ్డాడు హెడ్ గుమాస్తా సంజీవరావు.

తన చేతికింద ఆరుగురు క్లర్కులూ తనని తిట్టుకుంటారు ఎప్పుడూ. తనదేముంది?? తను మాత్రం మనిషి కాదూ? వాళ్ళు ఆఫీసుపని ఎక్కువచేస్తే తనకేం వొరుగుతుంది? ఆఫీసరు గారి ఆర్డరు. వాళ్ళకేం పోయింది? తనమీద ఎగురుతారు. తీరా ఆఫీసరు అనేది తననేగా..? అందరిలోకీ ఆ శంకరానికి తనంటే మంట. తనేదో వాళ్ళపాలిటి యముడయినట్టు చెబుతాడుట అందరికీ! ఇంకా పెళ్ళి కాలేదుగా! పైలా పచ్చీసు మీదుంది వ్యవహారం. బయట కనబడితే ఆ నక్క వినయాలు చూపించినా తనో పురుగు అన్నట్టు చూస్తాడు. ఇంకో ఇద్దరిని కూడగట్టుకుని వాళ్ళతో గుసగుసలు తనమీద! మరి ఆ శంకరం చూసే చూపులు ముళ్ళు గుచ్చుకున్నట్టుంటుంది, తనకి.

తనుమాత్రం. ఏం చేస్తున్నాడు? వాళ్ళకంటె ఎక్కువ వెట్టిచాకిరీయే చేస్తున్నాడే! వాళ్ళ సమస్యల్ని సానుభూతితో అర్థం చేసుకుంటున్నాడే! మరి ఎందుకు వాళ్ళకి తనమీద ద్వేషం, వాళ్ళతో మంచిగా ఉందామన్నా వుండలేక పోతున్నాడే? వాళ్ళు గుమాస్తాలు. తను హెడ్ గుమస్తా. ఇంతమాత్రానికే మనుష్యుల్లో అంత ఈర్ష్యా ద్వేషాలు ఎందుకూ? శంకరానికి తనేమీ అపకారం చెయ్యలేదు. మరెందుకలా చూస్తాడు? తనమీద ఎందుకంత ద్వేషం?

సంజీవరావుకి తల బద్దలు కొట్టినట్టయింది. టంగ్ మని గడియారం అరగంట కొట్టింది. ఉలిక్కిపడి ఫైలు ముందుకి లాక్కున్నాడు సంజీవరావు.

"నమస్కారమండి!" తలెత్తి చూశాడు సంజీవరావు ఎదురుగా శంకరం. "నమస్కారం. రా! కూర్చో" "ఫరవాలేదులెండి." అంటూనే [illegible] జుగుప్స [illegible]. "నువ్వు హెడ్ క్లార్కువిగా!"



# వెలుగునీడలు



అని వెక్కిరించినట్లయింది. తను శంకరాన్ని తోటిమనిషిగా గౌరవించాడు. దాన్ని అతగాడు క్లర్కు-హెడ్ క్లర్కు తేడాలో నిరాకరించాడు." "రాఘవయ్యా! రెండు కాఫీ" అని "ఫరవాలేదు కూర్చోవోయ్!" అని కుర్చీలాగాడు సంజీవరావు. 'కొంచెం పనులన్ని చేసానండి, రేపు గుడివాడలో మా స్నేహితుని పెళ్లి తప్పక వెళ్ళాలి...'

సంజీవరావు కేం పాలుపోలేదు. ఎల్లుండి 'ఇన్‌స్పెక్షన్'కనుక పని పూర్తిచేసి సిద్ధంగా ఉండాలని తనకు ఆఫీసరు ఆనందరావుగారి హుకుం. ఈ పరిస్థితుల్లో సెలవు ఇవ్వాలా వద్దా అని నిర్ణయించడం కష్టం. అసలే శంకరం తనమీద కుర్రుగా ఉన్నాడు.

రాఘవయ్య కాఫీ పట్టుకొచ్చాడు. 'ఇప్పుడే తాగివస్తున్నానండి." నా సంగతి ముందు చెప్పు అన్నట్లు ఉంది శంకరం ధోరణి. "సరే! చూద్దాం కాఫీ తాగు," అనేప్పటికి అయిష్టంగానే కాఫీ తాగేశాడు శంకరం. "సరే! నీ ఫైళ్లన్నీ నాకివ్వు. రేపటికి నీ పని కూడా నేను చేస్తాను. కాని ఒక్క విషయం. నువ్వెన్నింటికి వెళ్ళాలి?" "పన్నెండు గంటలకి బండి ఉంది" "సరే. నీ ఫైళ్లన్నీ బల్లమీద వుంచేయ్. నేను తీసుకుంటాను" సంతృప్తిపడి శంకరం వెళ్ళిపోయాడు.

గడియారం తొమ్మిదిన్నర కొట్టింది. సంజీవరావుకి మనసులో భయం వేసింది. కారణం అతనికి కూడా తెలియదు. గబగబా స్నానం చేసి భోంచేసి ఆఫీసుకి వెళ్ళేప్పటికి అయిదు నిమిషాలు తక్కువ పదయింది. తను వెళ్ళేప్పటికి శంకరం తన డ్రాయరులోంచి ఫైల్లు తీస్తున్నాడు గుమ్మంలో టకటకమని చప్పుడయింది. లేచి నిలబడ్డాడు సంజీవరావు. ఆఫీసరు ఆనందరావు టకటకమంటూ వచ్చేస్తున్నాడు. మిగతా వాళ్ళంతా తలలొంచి ఫైళ్లలో మునిగిపోయారు. ఒక్క శంకరం మాత్రం నిలబడి ఫైళ్లు తీస్తున్నాడు. ఆయన దృష్టి శంకరం అటు ప్రసరించింది. తలగడికేసిపోయారాయన. బంట్రోతు అప్పన్న వొచ్చి చెప్పాడు దొరగారు పిలుస్తున్నారని. సంజీవరావు వెళ్ళేసరికి, ఆఫీసర్ మొహం, కందగడ్డలా చేసుకుని "ఆ శంకరం అలా నిలబడి ఉన్నాడేం?" అన్నాడు. 'ఇవ్వాళ సెలవు పెట్టాడండి' 'సెలవు' ఎవరిచ్చారు? సెలవు అతడికి ఎల్లుండి ఇన్‌స్పెక్షన్ అని తెలీదూ? వచ్చినంత పని ఉంది. కాస్త మతుండొద్దుటయ్యా నీకయినా?" తలవొంచుకున్నాడు సంజీవరావు. 'వీల్లేదు. సెలవు లేదు. గిలవు లేదు. ఇవిగో ఇవికూడా ఇవాళికి పూర్తికావాలి". బల్లమీది దొంతర చూపించాడు ఆఫీసరు ఎల్లుండే ఇన్‌స్పెక్షన్.

ఫైళ్ళు పట్టుకొని బయటికి వెళ్ళేసరికి శంకరం నవ్వుతూ ఎదురయి "ఇహ నేను వెడతానండి" అన్నాడు. నవ్వాలో ఏడవాలో అర్థం కాలేదు సంజీవరావుకి. "మిస్టర్! శంకరం! అయామ్ సారీ!" అని తలవొంచుకున్నాడు. శంకరానికి అర్థం కాక తెల్లబోయాడు. "అర్జెంటండి! తప్పకుండా వెళ్ళాలి." అన్నాడు. కాసేపటికి అర్థం చేసుకుని "నీ సంగతి తెలుసులే. నువ్వు తేసెవూసినక తిని.

చూస్తూ విసుగ్గా వెళ్ళి తన చైర్లో కూర్చున్నాడు.

సంజీవరావు నిర్లిప్తంగా చూసి తన ఫైళ్ళలో మునిగిపోయాడు. మనసు కల్లోలంగా ఉంది. టెలిగ్రామ్! సార్! పోస్టుమాన్ గుమ్మంలో ప్రత్యక్షం. "ఎవరికి" "అన్నట్టు ఆరుగురు క్లార్కులూ తలెత్తి చూశారు." "సంజీవరావు, హెడ్ క్లార్క్" అని పోస్టుమాన్ టెలిగ్రామిచ్చి వెళ్ళిపోయాడు. క్లార్కులు ఫైళ్ళలో మునిగారు. శంకరం వ్యగ్రంగా చూసి పక్కవాడి కేసి కన్నుకొట్టాడు.

"పనెగ్గొట్టటానికి టెలిగ్రామ్ తెప్పించుకున్నాడుగోయ్!" అన్నట్లు చూశాడు అందరి కళ్ళల్లోకి.

సంజీవరావు చేతులు వొణికాయ్! మనస్సు బిగబట్టి టెలిగ్రాం చించాడు. "సరస్వతి... సీరియస్...హాస్పిటల్...కమ్" తల తిరిగిపోయింది. నూనుగారిచ్చారు. 'భగవాన్" అనుకొన్నాడు. మనస్సు బిగబట్టుకోటానికి ప్రయత్నించాడు దీనికి తట్టుకొనే మనస్థైర్యం ప్రసాదించమని భగవంతుని ప్రార్థించాడు. గుండె దిక్కు బట్టుకుని ఫైళ్ళ ప్రపంచంలో మునిగిపోయాడు. సంజీవరావు "టెలిగ్రామట! ఎవరికి?" ఆఫీసరుగారు కబురంపించారు. "నాకే." వాలిపోయిన మొహంతో సమాధానమిచ్చాడు సంజీవరావు.

సాయంత్రం నాలుగున్నరయింది. అందరూ సర్దుకుంటున్నారు ఆఫీసరు బయటికొచ్చారు. సంజీవరావు ఇంకా లేవలేదు. "సంజీవరావ్! టెలిగ్రామొచ్చిందట!" ఆఫీసరు అడిగారు. "అవునండి" ఏదీ చూపనీ "వొణుకుతూ అందించాడు సంజీవరావు." చదివిన తర్వాత కాసేపు ఆశ్చర్యంగా అతన్ని చూసి వెళ్ళిపోయాడు ఆఫీసరు. "అయిదయిందండి." గుమాస్తా చలమయ్య చెప్పాడు. దగ్గిరకొచ్చి "ఫైళ్ళు సర్ది చంకలో పెట్టుకుని అనుసరించాడు సంజీవరావు." "పాపం! శంకరానికి సెలవివ్వకపోవడం అన్యాయమండి. ఏమనుకోకుంటే ఒకటి చెబుతానండి." "చెప్పు చలమయ్యా! ఎందుకనుకుంటాను." "నేను నమ్మలేదుగాని ఇదంతా మీరు చేయించిందే ననుకుంటున్నానండి."

సంజీవరావు ఒకనిముషంసేపు అయోమయంలో పడ్డాడు: ఏం చెప్పాలో తోచలేదు. అప్రయత్నంగా జేబులోంచి "టెలిగ్రాం తీసి అతని చేతిలో పెట్టాడు. నిశ్శబ్దంగా తలవొంచుకుని అతనిపక్కనే నడిచాడు.

"చలమయ్యా! ఎంత మంచిగా ఉండాలని ప్రయత్నించినా, మనిషి చెడ్డవాడుగానే పరిగణింపబడటానికి కారణం?...ఇదే... వేధిస్తున్నదయ్యా. నన్ను...బరువుగా బాధగా ధ్వనించిన ఈ మాటలకి చలమయ్య జాలి పడ్డాడు. అంతకంటే ఏం చెయ్యాలో తోచలేదు అతడికికూడా. కొంతదూరం నడిచి సెలవు తీసుకొని చలమయ్య వెళ్ళిపోయాడు.

రోడ్డు పక్కగా నడుస్తున్నాడు సంజీవరావు అతని మనస్సు అల్లకల్లోలంగా ఉంది. రయ్ మంటూ దూసుకొచ్చిందో టాక్సీ. ఎవరో పక్కకి లాగారు హఠాత్తుగా సంజీవరావుని. బ్రేక్ పడకపోవటంవలన అది పక్కగా దూసుకెళ్ళి ఇసకలో పడుకున్న కుక్క మీదుగా వెళ్ళింది "కుయ్యో" మని బాధగా అరిచి కుక్క అప్పటికప్పుడే ప్రాణాలు వొదిలింది. అప్పటికే కారు మైలుదూరాన అదృశ్యమయింది, ఎవరికి పట్టినట్టు జనం ఎవరిదారిన వారు పోయారు.

కొంచెంలో తప్పిందిగాని లేకపోతే తను కూడా ఇల్లాగే... ఇహ ఊహించుకోలేక పోయాడు సంజీవరావు తరువాత ఏమయితే ఎవరికి గావాలి?

బరువుగా ఫైళ్ళు దించి తలుపు తీశాడు సంజీవరావు. ఒక ఉత్తరం జారి కిందపడింది. తమ్ముడు పరీక్ష పోయిందట. ఏం చెయ్యమన్నయ్యా?" అని రాశాడు దీనంగా.

ఎనిమిదింటికి హోటలునించి కారియరు వొచ్చింది. అన్నం సహించలేదు. నీరసంగా కుర్చీలో కూర్చున్నాడు ఫైళ్ళముందు. పని కొబోయేప్పటికి రాత్రి ఒంటిగంటకొట్టింది,

బద్ధకంగా నడుం వాల్చాడు. నిద్ర పట్టలేదు. పాడు ఆలోచనలు. కలత నిద్ర. సరస్వతి పిల్లలు శంకరం ఆఫీసుపని!

ఇదీ 'నిన్న!" ఈ "నిన్న" వొద్దనుకున్నా సంజీవరావుని వొదిలిపెట్టలేదు. నిమ్మ ఆకు మీదినుంచి వో మంచుబిందువు రాలి కంటిమీద పడింది చల్లగా. అయోమయంగా కూర్చుండిపోయాడు సంజీవరావు కాఫీ తెచ్చి ఇచ్చాడు రాఘవయ్య. రుచిగావుంది. మనస్సు ప్రశాంతంగా ఉంది. ఎందుకో తనకే తెలీదు. స్నానం చేసి ఫైళ్ళు సర్దుకునేప్పటికి తొమ్మిదయింది. ఆఫీసుకి బయలుదేరబోతూండగా వీధి తలుపు తెరచుకొని చలమయ్య, శంకరం వొచ్చారు.

"మిమ్మల్ని తప్పుగా అర్థం చేసుకున్నానండి...చలమయ్యగారు అంతా చెప్పారు." తల వొంచుకుని అన్నాడు శంకరం. నవ్వొచ్చింది సంజీవరావుకి. "ఫరవాలేదు అపోహ పడటం మానవ నైజం. తెలుసుకున్నావు అది చాలు. నాకు తృప్తిగా ఉంది." అని కాఫీలు తెప్పించాడు సంజీవరావు. ముగ్గురూ తృప్తిగా కాఫీ తాగారు.

"నిన్న ఇతను బయలుదేరవలసిన బండి తప్పిందండి. చాలా ప్రమాదం జరిగింది. అదృష్టవంతుడు శంకరం" అన్నాడు చలమయ్య. "అంతా విధి విధానం" అన్నాడు సంజీవరావు

ముగ్గురూ కలిసి ఆఫీసుకు బయలుదేరారు. "టెలిగ్రామ్స్ సార్!" అన్నాడు పోస్టు

# ఆంధ్ర సచిత్ర వారపత్రిక : బాలలసంఘం

# ఉగాది ప్రత్యేక సంచికలో రచనలపోటీ

## మార్చి 5 వ తేదీలోగా రచనలు మాకు చేరాలి.

ఆంధ్ర సచిత్ర వారపత్రిక "బాలలసంఘం" సభ్యులకు మూడవసారిగా రచనలపోటీ ఏర్పాటు చేస్తున్నాము. పోటీ ఫలితాలు శార్వరి ఉగాదికి వెలువడే (30-3-60) వారపత్రిక ప్రత్యేకసంచికలో ప్రకటిస్తాము. **రచనలకు గడువు తేదీ 5-3-60.**

### ముఖ్య విషయాలు

ఈ క్రింది విషయాలు జాగ్రత్తగా చదివి మీరచనలు పంపండి:

1. ఇప్పటివరకు సభ్యత్వపు కార్డులు అందినవారుమాత్రమే పోటీలో పాల్గొనాలి.

2. రచనమీద సభ్యుని పూర్తి పేరు, చిరునామా, సభ్యత్వపు సంఖ్య, పుట్టిన తేది, A వర్గమో, B వర్గమో స్పష్టంగా వ్రాయాలి.

3. ఈ ప్రక్కన ఉన్న "కూపన్"లో సభ్యులు వివరాలన్నీ జాగ్రత్తగా నింపి, కత్తిరించి, రచనకు జత చేసి పంపాలి. కూపన్ జతచేయని రచన పోటీకి స్వీకరించము.

4. రచన చక్కగా విడివిడి అక్షరాలతో, దూరపుపంక్తులలో కాగితానికి ఒకవైపే వ్రాయాలి. అరటావుమించకూడదు.

5. రచన పంపే కవరుమీద ఆంధ్ర సచిత్ర వారపత్రిక "బాలలసంఘం పోటీ రచన" అని వ్రాయాలి.

6. సభ్యత్వపు కార్డులలో ఏ వర్గానికి చెందినట్లు ఉన్నప్పటికి వచ్చే ఉగాది (28-3-60) నాటికి సభ్యుడు లేక సభ్యురాలు పదేళ్లు దాటినట్లయితే A వర్గానికి చెందినట్లు, పదేళ్ళలోపే ఉన్నట్లయితే B వర్గానికి చెందినట్లు గ్రహించి ఆవిధంగా కూపన్ పూర్తిచేసి, ఆ వర్గానికి పెట్టిన పోటీలోనే పాల్గొనాలి. 15 ఏళ్ళు దాటినవారి సభ్యత్వం రద్దయిపోతుంది గనుక, వారు పోటీలో పాల్గొనవీలులేదు.

7. మార్చి 5 వ తేదీ తరవాత వచ్చేవాటిని పోటీకిస్వీకరించము. పోటీలో చేర్గ నిరచనలు తిప్పిపంపటం సాధ్యంకాదు. నుక స్టాంపులు పెట్టవద్దు.

8. A వర్గం పోటీకి ప్రథమ ద్వితీయబహుమతులు. B వర్గం పోటీకి ప్రథమ ద్వితీయ బహుమతులు ఇస్తాము.

9. బహుమతుల విషయంలో అంతిమనిర్ణయం పోటీ నిర్వాహకులదే. ఈ విషయమై ఉత్తరప్రత్యుత్తరాలకు అవకాశంఉండదు

---

### పోటీ విషయాలు

**A వర్గం సభ్యులకు**

**"నేను చేసిన మంచిపని"**

(రచన ఒక అరటావుకు ఒకవైపు మించకూడదు)

**B వర్గం సభ్యులకు**

**"నాకు ఎక్కువ ఇష్టమైన వ్యక్తి"**

(మీ బంధువులలో అంటే తండ్రి, తల్లి, అన్న, అక్క, మామయ్య, బాబయ్య మొదలైనవారిలో ఎవరంటే మీకు ఎక్కువ ఇష్టమో, ఎందుకిష్టమో వ్రాయండి. ఒక అరటావుకు ఒకవైపునమించకూడదు)

### పోటీ కూపన్

సభ్యులు తమ రచనలకు దీన్ని జతపరచాలి.

వర్గము ... A లేక B

సభ్యత్వపు సంఖ్య ...

సభ్యుని లేక సభ్యురాలి పూర్తి పేరు.

పుట్టిన తేదీ నెల సం॥

తరగతి లేక ఫారము ...

పాఠశాల పేరు ...

పూర్తి చిరునామా

---

## వెలుగు నీడలు

జమాను, చలమయ్య, శంకరం చెరొకటి అందుకొని చించారు. "సరస్వతీ... డెలివర్డ్ బాయ్... సేఫ్" అని చదివాడు చలమయ్య. "ఎగ్జామ్... మిస్టేక్... పాస్... హేపీ..." అని చదివాడు శంకరం. వొకటి మామగారి నుంచీ, రెండోది తమ్ముడినుంచి.

సంజీవరావు గాలిలో తేలిన ట్లయిపో యాడు. ఇద్దరిభుజాలమీదా చేతులేసి "నన్ను మీతోటి మనిషిగా అర్థంచేసుకోండి. నేను మీ స్నేహితుణ్ణి." అన్నాడు. "ఆ సంగతి మాకు తెలుసు. కాకపోతే తెలీక అవాక్కు పడతా అప్పుడప్పుడూ" అన్నాడు చలమయ్య. శంకరం సిగ్గుగా తలొంచుకున్నాడు.

ఆ మధ్యాహ్నం ఆఫీసులో ఆఫీసరుపిలిచి "నీ క్షేమసమాలో నాకు తెలీటంలేదు. ఇన్నాళ్లూ నిన్నర్థం చేసుకోలేకపోయాను. ప్రొమోషన్ లిస్టులో నీ పేరు మొదట వేస్తున్నాను. నాకు చాలా సంతోషంగా ఉంది, ఎందుకంటే నేను చేస్తున్నది నా విధ్యుక్తధర్మం గనుక" అన్నాడు.

సంజీవరావుకి ఏమనాలో తెలీలేదు. చీకటి వెలుగుల్లో తికమకపడి "జీవితమే ఇంత" అని గొణుక్కున్నాడు తనలో. 




మా లాంచీని పాపికొండలదగ్గర ఆపించారు నాన్నగారు; అమ్మ కూడా అక్కడ ఆ పూటకి ఆగి ఆ కొండల సౌందర్యాన్ని చూసి సరీ వెళ్దామని పట్టుపట్టింది. అక్కడే దగ్గరలోవున్న పురాతన శిథిలాలను పరిశీలించి, అందులోంచి ఒకటి రెండు విగ్రహాలను సంగ్రహించాలని నాన్నగారి ప్రయత్నం! నాన్నగారి జిల్లాకలెక్టరు హోదాకి ఏది సాధ్యంకాదు కనుక! ఇదివరకు అలా సేకరించిన మూడు విగ్రహాలను బ్రిటిషు మ్యూజియంకి అమ్మి, ఆయన రహస్యంగా ఇరవై వేలు సంపాదించారు. ఇప్పుడు కూడా మరో విగ్రహం మీద ఆయన కన్నుపడింది. నాన్నగారు అది పాపంకాదు పుణ్యమంటారు.

రెండురోజులనించి కొంచెం మబ్బు మబ్బుగా వుండి, చిన్నచిన్న వానతుంపరలు పడుతున్నాయి. నాన్నగారు తమ ప్రయత్నంలో కొంతమంది పడవవాళ్ళని తీసుకుని వెళ్ళారు. దాదాపు మధ్యాహ్నమవుతోంది. అమ్మ యింకా వంటపనిలోనే నిమగ్నమయివుంది. ఎటొచ్చీ నేనే ఖాళీగా, చుట్టూ పరవళ్లు తొక్కుతున్న నది తరంగాల నృత్యాన్ని చూస్తున్నాను. మబ్బులు కమ్మితే నెమళ్లు నృత్యం చేస్తాయి. చినుకులు పడుతుంటే నది తరంగాలు నృత్యం చేస్తాయి కాబోలు!

---

శిరీషా రాంషా

---

అమ్మ మూకెలో అప్పడాలు వేపుతోంది. మూకె చిటపటలాడుతోంది. నాన్నగారింకా భోజనానికి రానందుకు అమ్మ చిటపటలాడుతోంది.

ఎవరిదో మరో లాంచీ వస్తోంది; బహుశా భద్రాచలయాత్రీకుల దెవరిదో అయివుంటుంది. నిండుచూలాలిలా ఉన్న నదిమతల్లి గర్భంలో తేలుతూ ఆలాంచి క్రమక్రమంగా మాలాంచీ సమీపానికి వచ్చింది. దాని యజమాని కొడుకు కాబోలు—నాలాగే బైటకు చూస్తున్నాడు. ఇరవై ఏళ్ళుంటాయి చాలా అందగాడే. చదువూ సంస్కారం వున్నట్టే కనిపిస్తున్నాడు. అతనూ నా కళ్లల్లోకి చూసేసరికి నాకు వొళ్ళు చచ్చిపోయింది. అలా ఒంటరిగా వున్న పెళ్లి కాని యువతుల కళ్లల్లోకి చూడకూడదని అతనికి తెలియదు కాబోలు! నేను చరచరా లోపలికి వెళ్ళిపోయాను.

ఆ తర్వాత తెలిసింది: అతని తండ్రిగారికి భద్రాచలం స్పెషలు ఆఫీసరుగా బదిలీఅయిందని! తండ్రీ, ఒక్కగాని ఒక్క కొడుకు, తల్లీ—మాలాగే బయలుదేరారు. వాళ్ళకీ ఒకే ఒక్క కొడుకు వుండటం, నా తల్లిదండ్రులకు నేనూ ఒకే ఒక్క కూతుర్నయి వుండటం—మేమిద్దరం ఈ గోదావరి సాక్షిగా తొలిసారి ఒకరి కళ్లల్లోకి ఒకరం చూసుకోవటం ఆశ్చర్యంగా లేదా?—సింగినాదం;

# ★ పెళ్ళిముచ్చట ★

ఆశ్చర్యం దేనికి? చూసినంత మాత్రాన అయిందా—నా పిచ్చిగాని!

లాంచి ఆగగానే అందులోంచి కళాసి ఒకడు వచ్చి ఈలాంచీ ఎవరిదని వాకబు చేశాడు. మా నాన్నగారి పేరు, హోదా అన్నీ పూస గ్రుచ్చినట్లు చెప్పాను. ఆ కళాసీ హడలిపోయ్యాడు. ఆకళాసియే కాదు; ఆ తర్వాత వాళ్ళ యజమాని కూడా హడలిపోయి ఉంటాడు. ఇంతకీ ఆ కుర్రాడు కూడా... బొత్తిగా ఈనాటి చదువుకున్న కుర్రాళ్ళకి పెద్ద భయభక్తులు లేకుండా పోతున్నాయి.

సాయంత్రం నాన్నగారు రాగానే లాంచి సంగతి వాకబు చేశారు. అమ్మ ఆయన తలకి కొబ్బరినూనె మర్దన చేస్తూ చెప్పింది.

'వాళ్ళూ మనమూ ఎక్కడో దూరపు బంధువులమయివుంటాం. వాళ్ళ శాఖా మన శాఖా ఒకటే,' అన్నారు నాన్నగారు!

"మీకు చాదస్తంటండీ, ఏ శాఖయితే ఏమిటి? వాళ్ళ అబ్బాయికి నిలువెత్తు ధార పోసినా మనపిల్లని ఇవ్వంకదా!" అంది అమ్మ.

"బాగుందే అమ్మా! నువ్వు మరీను!" అన్నాను. పైకి ఇష్టంలేనట్టు నటించాను. నిజంగా అలాంటి పెళ్ళి అయితే ఎంత బావుండిపోనో అనుకున్నాను.

"అవునవును. ఆ విషయంకూడా ఆలోచించవలసిందే!" అన్నారు నాన్నగారు.

"ఏ విషయం?"

"అమ్మడు పెళ్ళివిషయం!"

"ఇప్పుడేమంత మునిగిపోయిందని! దానికి పదిహేడు ఏళ్ళైనా నిండలేదు. దానికేం తెలుసు?" అమ్మ నాన్నమాటని తోసిపారేసింది! నాకేం తెలియదట! చూడు పాపం! తనకి తెలుసా?

ఇంతలో మా కళాసీవచ్చి నాన్నగారి కోసం-ఆయనెవరో — ఆ స్పెషల్ ఆఫీసరు గారు ఎదురుచూస్తున్నారని చెప్పాడు. నాన్నగారు పరేవని భుజంమీద కండువా వేసుకుని ఆయన్ని కలుసుకున్నారు. ఇద్దరూ కలిసి నాలుగడుగులు ముందుకు వేసి డెక్ మీద కుర్చీలు వేయించుకుని కూర్చున్నారు. అమ్మ కాఫీ కాచి యిద్దరికీ పంపించింది. ఆయన తన కొడుకును రప్పించి మా నాన్నగారికి నమస్కారం చేయించాడు. మా నాన్నగారుకూడా అతన్ని దగ్గరికి తీసుకుని, చక్కగా మెరుస్తున్న అతని కళ్ళనీ, సువిశాలమైన అతని నుదురుని, నిగనిగలాడే నల్లని క్రాపింగునీ చూచి మురిసిపోయారు. ఆయనకు కొడుకులులేని లోపం యిప్పుడు బాగా కనిపించిందిగావును!

'అమ్మాయి! ఇలా రా!' అని పిలిచారు. నన్ను వారికి పరిచయంచేస్తూ 'కొడుకైనా కూతురయినా నాకిదే అనుకుంటున్నాను. ఇదికూడా పెళ్లి కెదిగింది. రేపో మాపో పెళ్ళయి అత్తవారింటికి పోతుంది. ఆ తరువాత బిక్కు బిక్కుమంటూ మేమిద్దరమూ మిగిలిపోతాం,' అన్నారు.

నాన్నగారికి దుఃఖం పెల్లుబికివచ్చింది. ఆయన తన దుఃఖాశ్రువుల్ని కళ్ళల్లోనే అణుచుకోవటం నేను కనిపెట్టకపోలేదు. నేనున్నూ ఏదో మహాపరాధం చేసినదానిలా తల వంచుకున్నాను. అమ్మ లోపలనుంచే అందుకుంది:

"దానికి యిప్పట్లో పెళ్ళిచేయటం వారికి యిష్టంలేదండీ! అందుకే అది చదువుకున్నంతవరకూ చదివించాలనుకుంటున్నారు."

నా కెక్కడ పెళ్ళి స్థిరమయిపోతుందోనని అమ్మ భయం. అందుకే నాన్నగారి మీద తోసేసి అమ్మ గబ-చబ్‌గా తప్పుకుంది. ఆ కుర్రాడు చాలా విచిత్రంగా చూస్తున్నాడు నాకేసి. నాన్నగారు అది కనిపెట్టినట్టున్నారు. అతనిదృష్టి మళ్ళించాలని చెప్పి నాలుగుప్రశ్నలు వేశారు.

భవభూతి ఉత్తరరామ చరిత్రం నుంచి బైరన్ డాన్‌జువాన్ వరకూ ఎన్నో గ్రంథాల మీద నాన్నగారు అతన్ని పరీక్ష చేశారు. అన్నిటికీ అతను చెప్పిన సమాధానాలకు విస్మయపడి, కుర్రవాడని సందేహించకుండా అతన్ని పొగిడారు. ఆ సమయంలో నాన్నగారి ముఖం వికసించినదాన్నిబట్టి చూస్తే ఆయనకి ఇలాంటి అల్లుడొరికితే బావుండు ననిపించివుంటుంది. ఆ సంగతే తర్వాత అమ్మతో కూడా అన్నారు.

"నీ మూర్ఖత్వంగాని, సిరిసంపదలే మనుష్యులకి ప్రధానం కాదు. బుద్ధివున్నవాణ్ణి కారడవిలో వదిలేసినా దాన్ని నందనవనం చేసుకుంటాడు. బుద్ధిహీనుణ్ణి నందనవనంలో వదిలేసినా దానిని కారడవి చేసుకుంటాడు. మన అమ్మాయి పువ్వులాంటిది. (నాకు సిగ్గేసింది, చెప్పొద్దూ) "పువ్వులు తలమీద వుండాలిగాని. పాదాలకింద కాదు" నాన్నగారిమాటలు అమ్మకి రుచించలేదు.

"అమ్మడూ!" అన్నారు నాన్నగారు.

"ఏమండి నాన్నగారూ?"

"కుబేరు డెవరు?"

"ధనానికి అధిపతండి."

"అతడివాహనం ఏమిటే?"

"మనిషి."

"సామాన్యుడు సామాన్యుడిచేత రిక్షా లాగించుకుంటాడు. కాని కుబేరుడు సామా

...చేస్తాడు" అన్నారు నాన్నగారు. అమ్మ ముఖం చిట్లించుకుంది.

"మీ తెలివి తేటలలా వున్నాయి. డబ్బున్నవాళ్లంతా అలా చేస్తారనివుందా!" అంది అమ్మ. శాసనమో, శిలాశాసనమో చూపిస్తేగాని అమ్మ నమ్మదు. ఆ రాత్రి చాలా సేపటిదాకా అమ్మ చిరబుర లాడుతూనే వుంది. వాళ్లిద్దరూ చాలా సేపుదాకా గొణగొణ లాడుతూనే వున్నారు. ఆ తర్వాత వాళ్ళే సర్దుకున్నారు.

ఆ కుర్రాడితండ్రి ఏమంత తెలివైనవాడిలా కనిపించలేదు. చిన్న చిన్న వుద్యోగాలు చేసేవాళ్ళకి తెలివితేటలు కావాలంటే ఎక్కడినుంచి వస్తాయి?

"మీ కెంతమందండీ పిల్లలు?" అని అడిగాడు మా నాన్నగారిని.

"ఒక్కర్తె ఆడపిల్ల"

"అయ్యోపాపం, మగపిల్లలు లేరా?"

"లేరండీ! అమ్మాయి బి. ఏ. చదువుతోంది."

"దీపంలాంటిపిల్ల! ఏయింటి కోడలవుతుందో!" ఆయన కొంగకోపము. ఆయనింటి కోడలైతే బావుండునని ఆయనకూ వుంది. కాని, అలా సాహసించి అడగెందుకు ఆయనకుమాత్రం కలేజా ఏది?

నాన్నగారికి ఆకుర్రాడిపిచ్చి మరి జోరయింది. దానికితోడు అమ్మకు ఆ కుర్రాడిపై ద్వేషం పట్టపగ్గాలు లేకుండా పెరిగిపోతోంది. కాని, లోలోపల అమ్మకి కూడా ఆ కుర్రాడిమీద అభిమానంవున్నట్టే కనిపిస్తోంది. ఇంతకీ వాళ్ళిద్దరి తగాదాలే అన్నికన్నా చూడ ముచ్చటగా వున్నాయి.

చినికిచినికి ఆకాశం అయర్నాటికి గాలివాన అయింది. నదీతరంగాలు ఎంతో ఉధృతంగా పొంగిపోతున్నాయి. గాలికి కెరటాలు మూడయి అడుగుల ఎత్తుదాకా లేస్తున్నాయి. జల్లులు లాంచీలోకే వస్తున్నాయి. కళాసులు ఒక పక్కనించి నీళ్ళని ఎత్తిపోయటంతోనే సరిపోతోంది. బయట కుంభవృష్టిగా వాన! మృత్యువును అంత దగ్గరగా చూస్తూ కూడా మాలా ఎవరూ వినోదించ రనుకుంటాను. ఈ లాంచీలకు ఏక్షణంలోనైనా ప్రమాదం రావచ్చు. కనుక క్షేమం కోసం రెండింటిని దగ్గరచేర్చి పగ్గాలతో బిగించి కట్టారు. మునిగితే రెండూ మునగాలి. తేలితే రెండూ తేలాలి. సౌఖ్యమైనంత వరకూ మునగకుండా ఉండటానికే ఈ ప్రయత్నమంతా.

బాగుందికదూ! జీవిత మహాసముద్రంలో దంపతులనే జంట నౌకల అనుబంధంకూడా యిలాంటిదే నేమో!



చిత్రం: చిల్లరిగె లక్ష్మణరావు, బందరు

నేను ఒక్కర్తెనీ నా గదిలో నా మంచం మీద కూర్చుని మా లాంచీతో బాటే ఉయ్యాల లూగుతున్నాను. నాలో కూడా ఆలోచనల తుఫానుపట్టింది. పక్కగదిలో నాన్నగారూ, ఆ అబ్బాయి, అతనితండ్రీ భోజనం చేస్తున్నారు. మధ్యమధ్య తలుపు కంతల్లోంచి చూస్తే కనిపిస్తూనే వుంది. నాన్నగారు వాళ్లని భోజనానికి పిలవటమే అమ్మకి యిష్టంలేదు. ఆ కుర్రాడు భోజనం చేస్తున్నంతసేపూ నవ్వుతూనే వున్నాడు. అదృష్టవంతులు ఎప్పుడూ నవ్వుతూనే వుంటారు.

"అలాంటివాడు నాకుభర్తఅయ్యాడంటే నా నోములు ఫలించినట్టే. నా జన్మ తరించినట్టే. ఊరికే వెర్రిగొడ్డులా మూగచూపులు చూస్తూ కూచుంటే ఏం ప్రయోజనం? ఎలాగో నా అభిమతాన్ని అతనికి తెలియజెప్పాలిగాని!" అనుకున్నాను. ఎలాగ తెలియజెప్పటం? చదువుకోని ఆడదానికన్నా చదువుకున్న ఆడదానికే ఇది గడ్డు సమస్య.

భోజనాలయ్యాయి. నాన్నగారూ, ఆ స్పెషలాఫీసరూ కలసి తాంబూలం వేసుకొంటూ పిచ్చాపాటీ చెప్పుకొంటున్నారు. ఈమంత్రుల్నీ, ఈ ప్రజాప్రభుత్వపు అవకతవకల్నీ స్వేచ్ఛగావిమర్శిస్తున్నారు. అతను గోడవల్లో లేడు. చరచరాపోయి, వాళ్ళ లాంచీలో, తనగదిలో, తన మంచంమీదనే పడుకున్నాడు.

అతను కన్నెత్తి నన్ను చూస్తూ, తీరా నేనూ అటే చూచేసరికి చటుక్కున చూపుల్ని మళ్లించుకునేవాడు; అలాగే అతనూ సాహసించి నావైపు చూచేసరికి చటుక్కున నాదృష్టి మళ్లించుకునేదాన్ని. ఓహో. విడియమంటే ఇదేకాబోలు!— ఇద్దరమూ కొత్త పెళ్లికూతుళ్లమే అయితే ఎలా? రేపో మాపో తుఫాను వెలిసిపోతుంది. జంట కలిసిన మా లాంచీలు రెండూ విడి, దేనిదారిన అది పోతుంది. వాటిపై దురదృష్ట జీవులమూగఆక్రందనమాత్రం నిట్టూర్పులతో గాలిలో లీనమైపోతుంది.

ఈఆలోచనతో నాకు మనస్సు పూర్తిగా పాడయిపోయింది. అన్నం తినబుద్ధికాలేదు. అన్నం తిననన్నాను. అమ్మ బతిమాలింది. మొండికెత్తి ముసుగుతన్ని పడుకున్నాను. అమ్మ ఏడ్చింది. ఎప్పుడు నిద్రపోయానో ఏమో.

పక్క లాంచీలోంచి పాట వినిపిస్తోంది:

"ఓ స్వర్ణదీతీర సౌందర్యనిలయమా!
ఓహో తపస్వినీ! ఓ స్వప్నరాజ్ఞీ!
వలపుభారాన గుండెలు బరువుతో చ
మాట తడబడు; కొంతైనవిడదు పెదవి;
ఒడలు కంపించు; కాళ్లాడరావు కదల—

# పెళ్ళిముచ్చట

ఎట్లు చెప్పుకొందు దుర్భర ప్రణయ గాథ!"
ఓ స్వర్ణదీతీర సౌందర్య నిలయమా!
ఓహో తపస్వినీ! ఓ స్వప్నరాజ్ఞీ!

అర్థమయిందికి ఆ పాటలోని బాధ నాకు అర్థమయింది. అందులోని భావం నాకు అర్థమయింది. చటుక్కున లేచాను. బయటకు వచ్చి 'నేవారం' మీద నిలబడ్డాను. పెల్లుబికి ఎగిరేతరంగాలు నామీదకు విరుచుకు పడుతున్నాయి. అంతులేనిఅగాధం నాముందర. తూలిపోతున్నాను; తూగిపోతున్నాను సొమ్మసిలి పడిపోతున్నాను.

ఇంతలో...అవంతలో

అకస్మాత్తుగా అతను నా లాంచిమీదకి దూకి, నన్ను పట్టుకున్నాడు. తన హృదయానికి అదిమిపెట్టుకున్నాడు. మెలకువ, మగతా కాని నా మనస్థితి గ్రహిస్తూనే వుంది. ఆశ్చర్యాన్నీ, ఆనందాన్నీ పొందుతూనే వుంది. అతను చేసిన ఏ ప్రయత్నాన్నీ నేను నిరోధింపలేకపోయాను. ఆ వివశత్వమలాంటిది. ఆ పరిస్థితు లలాంటివి. ఈ ప్రపంచాన్ని క్షణమో, మరుక్షణమో విడిచిపెడతా ననగా...

ఎవరివో కేకలు! దొంగ! దొంగ! అమ్మో కళాసులు! తెలివి తెచ్చుకున్నాను. ఏం చేసేది? దుప్పటి తీసి అతనికి కప్పాను. అంతా కంగారు, హడావిడి. నాన్నగారూ అమ్మా పరిగెట్టుకు వచ్చారు. అతని కాళ్ళు దుప్పటిలోంచి కనిపిస్తున్నాయి!

నాన్నగారు ఆ దుప్పటి లాగివేశారు. కోపావేశంతో గజగజ వణుకుతున్నారు. వెంటనే అతనూ నేనూ నాన్నగారి కాళ్ళమీద పడ్డాము. లాభం లేకపోయింది. "ఈ వెధవ నా వంశానికి కళంకం తెచ్చాడు. గోదావరిలోపారేయండి" నాన్నగారి శాసనమది. ఆ కళాసులు—యమకింకరుల్లా అతని కాళ్ళూ చేతులూ గట్టిగా పట్టుకుని—ఈ పాపిష్టిదాని కళ్ళముందే నదిలోకి విసిరివేశారు. ఎగురుతున్న గోదావరీ తరంగాలు ఒక్క గుటకలో అతణ్ని మింగివేశాయి. పావుగంట క్రితం నేను గోదావరిలో పడవలసింది! అప్పుడు నన్ను కాపాడాడు. ఇప్పుడో? ఆఖరి క్షణంలోకూడా నాకై చేతులు చాచి, సీతా అని ఆర్తనాదం చేశారు. ఏం చెయ్యగలను. కన్నీరుతప్ప వారు నా కన్నీళ్లు గోదావరిలో కురుస్తున్నాయి. ముఖం తిరిగి తూలిపోయాను. తూలిపోయి పడ్డానో, భ్రమపడ్డానో...

అకస్మాత్తుగా మెలకువ అయింది. ఏమిటీ ఘోర స్వప్నం! నా భవిష్యత్తును తానెలా రాసిపెట్టాడో ఈ స్వప్నరూపంలో భగవంతుడు నాకు చూపించలేదు గదా!—నాకో వేళంతా ఇదేచింత!

రాత్రి అతనికి కూడా నిద్రపట్టినట్టు లేదు. చాలా సేపటిదాకా అతని గదిలోంచి కూనిరాగాలు వినిపిస్తూనే వున్నాయి. ఎప్పుడు తెల్లవారుతుందా భగవంతుడా అని ఏడుస్తూ కూచున్నాను. ఎలాగో తెల్లవారింది ఆ రాత్రి...

ఆ రాత్రి నేను అనుభవించిన బాధ నా జీవితంలో ఎరుగను. ఒళ్ళంతా హూనమయిపోయింది. ఏదో మంత్రబద్ధమైనట్టుగా బిగుసుకుపోయింది శరీరం. కాకలు, మంటలు!

ఆ పాదుకలను స్మరించుకుంటూనే తలుపు తెరిచాను. అప్పటికే అతనిగది తలుపులు తెరుచుకుని నా కోసం నిరీక్షిస్తున్నాయి. తొలి చూపులోనే మా కళ్లు కలుసుకుని గొప్ప తేజస్సు ప్రజ్వలించాయి.

నేను ఆశ్చర్యపోయాను; అతను విస్తుపోయాడు. నేను పారవశ్యం పొందాను. అతను తన్మయుడయ్యాడు—చివరికి ఇద్దరమూ సిగ్గుపడి పోయాము.

నిజంగా ఆరంభయౌవనం కనే కలల్లో ఎంత మాధుర్యం వుంటుందో, తొలిసారి ప్రేమబీజాలు అంకురించినప్పుడు కూడా హృదయంలో అంత మాధుర్యమూ వుంటుంది. ఆ మాధుర్యాన్ని వర్ణించటం ఎంత గొప్ప కవులకైనా సాధ్యం కాదు.

అతను పలకరించాలనుకున్నాడు; ఎవరన్నా వింటారన్న భయమేమో! నేనే పలకరిద్దామనుకున్నాను; నోట్లోంచి మాట రాక సతమతమవుతున్నానో! ఏమిటి బాధ!

సాధారణంగా, యిలాంటి వ్యవహారాలలో, మగవాళ్ళకి చొరవ వుంటుందంటారు. అతనికలాంటి చొరవవున్నట్టు లేదు. ఏమిటో ఈ చదువుకున్న మగవాళ్లు ఆడవాళ్ళకన్నా కనిష్ఠంగా తయారవుతున్నారు. అంత బిడియపడుతున్నాడు.

చివరికి నేనే సాహసించాను. అక్కడే వుండమని సంజ్ఞ చేశాను. అతను కొయ్యబారిపోయ్యాడు. ఇదేమి ఆడదిరా అనుకున్నాడేమో!—తన చిత్తంవచ్చినట్లు అనుకోనీ—నాకెందుకు! ఏదన్నా పని తలపెట్టనే కూడదుగాని, తీరా తలపెట్టాక విడిచిపెట్ట కూడదు. చరచరా వెళ్ళి, నా మంచంమీద కూర్చుని కలమూ, కాయితమూ తీసి ఏవో రెండుముక్కలు గొలికాను. ఆ తర్వాత దానికి బేబురుమాలుచుట్టి అతనికి అందేలా విసిరాను. రెండుచేతులూచాచి అంది పుచ్చుకున్నాడు. వెంటనే అతను తలుపులు బిగించుకున్నాడు.

వళ్ళు ఝల్లుమంది. సిగ్గుతో క్రుంగిపోయాను. తలుపు వేసుకుని నా మంచంమీద పడ్డాను. దుఃఖం వచ్చింది. ఇదేం పని? నా విజ్ఞత, నా చదువు, నా సంస్కారం ఏ గంగలో కలిశాయి? నా వంశప్రతిష్ఠ ఏ మంటలో కలిసింది?—

"మీకోసం పరితపిస్తున్నాను. మీ..."

ఇదీ నా ఉత్తరం. అవ్వ!

అతను ఆనందంతో ఉబ్బితబ్బిబ్బయి వుంటాడు. మరో క్షణంలో ఒక చిన్న గులకరాయి వచ్చి నా తలుపును తట్టింది. దాన్ని చుట్టి ఓ ఉత్తరంవుంది. చటుక్కున తీసి దాచాను. ఎవరో వస్తున్న అలికిడి! ఎవరా అని చూస్తును గదా అమ్మ!

అమ్మ అతన్ని చూసిందేమోనని హడలిపోయాను. చూడలేదుపిచ్చిమనిషి! చూస్తే చిందులుతొక్కుతుంది.

నాన్నగారూ, మేమూ వాళ్ళింటికి భోజనానికి వెళ్ళాలిట! అమ్మకు వంట్లో బాగాలేదట! నేనుకూడ రానని అమ్మే చెప్పేసిందట! నాన్నగారికి తప్పలేదు. అమ్మ నాగదిలోకూర్చుని నేనుచెప్పే అర్థంలేని మాటలన్నీ వింటోంది. ఆమె మనస్సు మనస్సులో లేకపోవటంకూడా నా అదృష్టమే. లేకపోతే కన్నంలో దొంగలా దొరికిపోదును.

అమ్మవెళ్ళిన తర్వాత చాలాసేపటిదాకా నాగుండె దడతగ్గలేదు.

ఆ వేళ చీకటి చాలాఆలస్యంగా పడింది. అతనూ బుద్ధిమంతుడిలా తలుపులుమూసుకుని అర్థంకాని చదువేదో చదువుతున్నాడు. బుర్ర అందులోవుంటేగా! ఎప్పుడు నేను గట్టిగా దగ్గుతానాఅని చెవులు రిక్కించి వింటున్నాడు. వినబడీ వినబడగానే చటుక్కునలేచి పిల్లిలా తలుపులు తెరుచుకుని, ఆలాంచీలోంచిమాలాంచీలోకిదూకి తిన్నగా నాగదిలోకి ప్రవేశించాడు. నాగుండెలు మరీ జోరుగా కొట్టుకోసాగాయి. ఏమి అఘాయిత్యం జరుగుతుందో!

చిత్రమేమిటోగాని ఇలాంటి ప్రమాదకరమైన సమయాల్లోనే మనస్సు మరీ ముడుచుకుపోతుంది. శరీర మాస్వాధీనంతప్పి పరాధీనతకోసమే ప్రాకులాడుతుంది. మా యిద్దరికీ మాటలు తోచలేదు. మాట్లాడుకోనేందుకుకూడా అది సమయం కాదు. అయితే ఇంత సాహసమూ ఎందుకు జరిగినట్లు?

అతని చేతులు వణుకుతున్నాయి. నేను దూరంగా జరగాలని ప్రయత్నించాను గాని, నా వొళ్ళే నాకు స్వాధీనంకాలేదు. అదేమిటో చిత్రం - నాకు స్వాధీనం కాని శరీరం అతని కిట్టే స్వాధీనమైపోయింది.

నాకు వచ్చిన స్వప్నం సంగతి చెప్పాను. ఆయన నవ్వారు.

"అనవసరంగా భయపడకు సీతా! మా వాళ్ళతో చెప్పి మన పెళ్ళి ఏర్పాటు చేయిస్తాను."

ఏదో భయంతో కూడినధైర్యంతో, ఈ అపూర్వానుభూతి వంటి మధురవేదనతో సొమ్మసిల్లిపోయ్యాము. చల్లనిగాలి తరగలు తెల్లవారకట్ల మమ్మల్ని మేల్కొల్పాయి. అంతవరకూ ఆదమరచి నిద్రపోయామన్నమాట!

ఒకడు: నీకు ఒక లక్షరూపాయలు బహుమతివస్తే మొదట నీవేం చేస్తావు?

స్నేహితుడు: డబ్బు చేతికి అందేదాకా ఒక డాక్టరుని దగ్గర ఉంచుకుంటా.

—ఎస్. ఎ. హబీబ్.

తెల్లవారకట్ల లాంచీని విడిచిపెట్టాలని నాన్నగారు అన్నారు. అందుకే తెల్లవారేలోగా ఎన్నో విషయాలను మాట్లాడుకోవాలని ఆశగా ఈ సమావేశాన్ని ఆహ్వానించాను. తానొకటి తలిస్తే దైవమొకటి తలిచాడు. లేకుంటే ఏమిటీనిద్ర!

కళాసులు అప్పటికే ఎప్పుడో నిద్రలేచారు. లాంచీని విడిచిపెట్టారు నాన్నగారు కాచుకుకూర్చున్న విగ్రహం దొరికింది. మరెవళ్ళకీ తెలియకుండానే అది ఓ రాత్రివేళ మా లాంచీలోకి ప్రవేశించింది. ఆయన ఆ విగ్రహంతోనూ, నేనీవిగ్రహంతోనూ మామాగదుల్లో తెల్లవార్లూ ఉండిపోయాము.

లాంచీ గోదావరీగర్భాన్ని చీల్చుకుని శరవేగంతో వెళ్ళిపోతోంది. పాయలైన గోదావరి, లాంచీ దెబ్బకు జలజలలాడుతోంది. ఆయన త్రుళ్ళిపడ్డారు.

"అమ్మయ్యో. లాంచి వెళ్ళిపోతోంది!"

ఉష్, మాట్లాడకండి; ముందు సంగతి నేను చూస్తాగా!"

"సీతా! చివరికి నీకలే నిజమౌతుందేమో" అన్నారాయన. కళ్ళ నీళ్ళ పర్యంతమయ్యారు కూడా. ఏమిటీ మగతనం! ఛీ, ఈ చదువుకున్న మగాళ్ళకన్నా పిరికివాళ్ళుండరు. కొత్త పరీక్షవొస్తే స్వబుద్ధి ఉపయోగించుకోలేరు? వీళ్ళ చదువు కాల్పనా!

"నాకో ఆలోచన తడుతోంది. పగలల్లా నా మంచంక్రింద దాక్కుంటూ వుండండి. జబ్బుచేసిందనే వంకతో నేను మంచంమీద పడుకుంటాను. రాజమండ్రిరాగానే లాంచీ ఒడ్డుకు చేరుతుంది. లేదా ఈలోగా ఎక్కడ ఒడ్డును పట్టినా మీరు ఉడాయించేద్దురుగాని. మీ రైలు ఖర్చులకు సరిపోయేడబ్బు నా దగ్గరవుంది. ఇనిస్తాను. వెళ్లిమీవాళ్లతో మాట్లాడి పెళ్ళి ఏర్పాటు చేసుదురుగాని."

నాన్న నామాట కాదనరనే ధైర్యం నాకుంది. అమ్మ పెంకితనం ఏమయినా నాన్నగారి దగ్గర సాగదు. అమ్మమాట లెక్కేమిటి?

 పెళ్ళిముచ్చట 

అలా గొడవని నా మంచంకిందకి దూరారు. జాగ్రత్తగా నా మంచంమీది దుప్పటి ఈ కొత్త పెళ్ళికొడుకు కనపడకుండా తెర గట్టింది. చాలా పొద్దుపోయింది. నేనింతకీ రాకపోవటం చూసి అమ్మ కాఫీపట్టుకుని తానే వచ్చింది.

"అమ్మాయ్! ఝాము పొద్దెక్కినా నిద్రలేవలేదే!"

"నాకు ఒంట్లో బాగోలేదే. కొంచం తలనొప్పిగానూ వుంది."

"అయ్యోతల్లీ! బయటగాలి బాగోలేదు. దుప్పటి కప్పుకు పడుకో అమ్మా! అంత ఒంట్లో బాగోలేకపోతే ఈ పూటకి పాలూ అన్నమే తింటావుగానిలే."

"నాకు ఆకలేస్తోందమ్మా, అన్నం తింటాను."

ఈ దొంగజ్వరం పేరు చెప్పి అమ్మనన్నూ మాత్రేలా వుంది. ఒక మనిషికి సరిపోయే

దేవిక, టి.బి.ఎస్. ప్రొడక్షన్స్‌వారి "నాగనందిని చిత్రంలో తార)



వీనులకు
విందైన మధుర
సంగీతమా!

మీరు
సొగసుగా
నున్నారని
వినగానే!




సినీమా తారలకు సౌందర్యము నిచ్చే
శుద్ధమైన, సౌమ్యమగు సబ్బు

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి

ఒక్క చూపు, ఒక్కటే మెచ్చుమాట ... ఇవి స్వల్ప విషయాలే అయినా, అద్దంలోవలె మీ వశీకర తన్మయత్వం — అందమే అందంగా చాటుచున్నవి. మీరు సొగసుగా నున్నారనే ఆత్మ విశ్వాసం హెచ్చుచున్న కొలదీ మీ సౌందర్యం శుక్లపక్ష చంద్ర బింబమువలె వృద్ధి పొందదా! చర్మము సొగసుగా లేకపోతే సంపూర్ణ సౌందర్యం కలుగదని సినిమా తార దేవిక ఎరుగును. ఆమె ఇలా చెప్పుచున్నది. "అందుకే నాకు పరిమళమైన లక్స్ టాయిలెట్ సబ్బుయందు నమ్మకం, దాని సౌమ్యమైన మీగడవంటి నురగ నా చర్మమును మృదువుగాను సొగసుగాను వుండునట్లు చేయుచున్నది." మీరు కూడా అత్యంత సౌందర్యంగా వుండండి ... లక్స్ వాడుట వల్ల!

LTS. 44-X52 TL

భోజనం కూడా యిప్పుడు చాలదు. రెండింతలు కావాలి. వచ్చే చావొచ్చి పడింది.

అమ్మదగ్గర మారాం చేశాను. అమ్మ భయపడుతూనే చారూ అన్నం కలిపితెచ్చింది. అమ్మ వెళ్లేదాకా ఓపికపట్టి. ఆ తర్వాత ఒక్క మెతుకన్నా వాసన చూడకుండా ఆ కంచాన్ని మంచం కింద కి తోశాను. కంచాన్ని కూడా పూర్తిగా నాకేశారాయన పాపం ఆయనకది ఒక బుగ్గకు కూడా రాలేదు. మంచి కసరత్తుచేసిన శరీరమేమో, అలిసి వుండటంవల అవురావురంటూ వున్నారు. ఏం చేయను? చాలా పొరబాటయిపోయింది. నా తెలివి తెల్లారిపోనూ ఎక్కడైనా రోగమని చెప్పుకుంటారా? అసలే నేను పిడికెడు మెతుకులు తింటాను. కనుక అమ్మ రెండు గోరుముద్దలు చేసుకు తెచ్చింది.

ఆయన ఇంకా ఆకలేస్తోందన్నారు. ఆయన ఆకలి ఆకళ్లల్లో స్పష్టంగా కనిపిస్తోంది నాకు జాలివేసింది.

"ఇంకా ఆకలేస్తోందమ్మా!"

"వేసుందమ్మా వేసుంది. వేసినా తినకూడదు," అంది అమ్మ. ఇంకేం చేయను? నాన్నగారు కూడా ఈమాటు గదిలోకి వచ్చారు.

"పెట్టవే, ఫరవాలేదు. ఆకలివేస్తోంటే దోషం లేదన్నమాట!" అన్నారు. అమ్మ గతిలేక అన్నం తెచ్చింది. అప్పటికి గండం గడిచి బయటపడ్డాను. అయినా ఆయన ఆకలితీర లేదు.

"ఏం చెయ్యమంటారు?"

"ఏమో, నువ్వే ఆలోచించు."

ఆరాత్రి మా నాన్నగారితో చెప్పాను. నేనీ ఆకలికి తాళలేకున్నాను. తవ్వెడు బియ్యపు అన్నం కావాలన్నాను. నాన్నగారు నవ్వారు. నాకు ఉండి ఉండి మతి పోతోందేమో అనుకున్నారు. అమ్మ హడలి పోయింది. బహుశా ఏ భూతమో, పిశాచమో నన్ను పట్టుకుని వుంటుందని చెప్తూ ఏడ్వసాగింది. అసలు పిశాచం నా మంచం కిందే వుందన్న సంగతి ఆమెకి మాత్రం ఏం తెలుసు?

ఏం చేస్తుంది?- పరవని తీసుకొచ్చింది. వచ్చినా పక్క నే కూర్చుంది. తనకళ్ల ముందే తినాలంది.

"నువ్వు ఎదురుగుండా వుంటే తినను వెళ్లిపో" అన్నాను. అమ్మయిది తప్పకుండా గాలి లక్షణమే అనుకుని వెళ్లి పోయింది.

గాదికింద పందికొక్కులా ఆయనపనే బాగుంది. కడుపునిండా తిని, పువ్వ తేల్చారు. పోనీ రెండు ముద్దలు నీవుకూడా తినమని అయినా అనలేదు. నేను లంకణాలు చేస్తున్న సంగతి ఆయనకు తెలియదా?

కాస్సేపటికి అమ్మ వచ్చింది. ఖాళీ కంచాన్ని చూసింది. నా కడుపు తడిమింది. తడపలావుంది నా కడుపు. ఆమెకు మతి పోయింది. కంచెడన్నమూ ఏమయినట్టు?

నాన్నగారు చెయ్యిచూశారు. నీరసంగా వుందన్నారు. అంతే. మరో దోషం లేదన్నారు. ఇదెక్కడి రోగమో వాళ్ళకి అర్థం కాలేదు.

గబగబా అమ్మ లోపలికివెళ్ళి ఏడుస్తూ వచ్చి యిన్ని మిరపకాయలు దిగదుడిచి నదిలో పారేసింది.

"అమ్మ నా తల్లీ! నీ కెంత కష్టం వచ్చిందమ్మా! అడ్డమైన ప్రతి వెధవకీ నిన్నిచ్చి పెళ్ళి చేస్తానంటారు. ఆశపడి ఆ దిక్కుమాలినవాళ్ళు ఏ పాడుకొట్టారో! బంగారంలాంటి నా తల్లి బల్లిలా అయింది!" అని ఒకటే ఏడుపు.

నేను బావురుమని ఏడ్చాను. మా అమ్మ నా తలని తన గుండెలమీద అద్దుకుని నిమిరింది. నాన్నగారు దొరికిపోయిన నేరస్థుడిలా తలవంచుకుని బైటకు వెళ్ళిపోయారు.

ఆ రాత్రికింక అన్నం పెట్టద్దని నాన్నగారు ఆజ్ఞాపించారు. అమ్మ ఆయన ఆజ్ఞల్ని తుడిచి పెట్టేసింది. మళ్ళీ కంచెడు అన్నం మామూలుగానే తయారయింది.

ఈ మంచంకింద మనిషి అమ్మ పెట్టిన అన్నమూ తిన్నారు. అత్త పెట్టిన తిట్లూ తిన్నారు. కిక్కురు మనకుండా ఆవిడ ఉన్నంతసేపూ ఊరుకున్నారు.

ఆయన క్షేమమహారాజు! మధ్య నా ప్రాణం కడంటి పోతోంది. పైగా ఆయన గొణుగుడొకటి. నా సంగతే ఆయనకు పట్టనట్టుంది.

ఏదో ప్రయాణీకుల సత్రం ఎదురైతే అందులో డాక్టరెవరన్నా వున్నారా అని నాన్నగారు వాకబు చేశారు. ఎవరో ఆయుర్వేద వైద్యుడు దొరికాడు. వాడి మూతి గుండ్రంగా పెదాలు బిగించి, బుర్ర బరువెక్కించి, నోరు మెదపకుండా బయటకు చక్కాబోయాడు. ఈ డాక్టర్లకు మంచం కింద చూడాలన్న జ్ఞానం ఎందుకుండదో!

"రోగం ఏమిటో చెలవిచ్చారుకాదు." కలెక్టరంతటి నాన్నగారు, వాడి పక్క బిళ్ల బంట్రోతులా నిలబడి వున్నారు. ఎంత ప్రారబ్ధం వచ్చింది!

వైద్యుడుగారు దగ్గారు; ఏమి చెప్పాలో తోచివుండదు; నాన్న యింకా అలా ఆయనముఖంలో చూస్తున్నారు ఏమంటాడో అని.

చెప్పటానికేముంది?—మీ అమ్మాయికి సరైన ఆహారం లేదు."

"అదేమిటండి డాక్టరుగారూ, యిందాకనేగా మీకు మనవి చేశాను; పూటకు తవ్వెడు బియ్యపు అన్నం తింటోందని!" నాన్నగారికి కళ్లు మండింది.

వైద్యుడుగారు నవ్వారు.

(62-వ పేజీ చూడండి)

# హరివంశము

[illegible] శివశర్మ

## వ్రజనివాసపర్వం - 10

బృందావన కేళికినై
బృందారకవరద! చాల ప్రియపడియెదు నీ
డెందము తడవింకేటికి
మంద గదిల్చికొని చను మమంద ప్రీతిన్.
—హరివంశము.

ఇంతకుముందు సభలోంచి వెళ్లిన నందుడు వేరు. ఇప్పుడు సభలోకి తిరిగివచ్చిన నందుడు వేరు. ఆ నందుని ముఖంలో బాధ, భయం, సంశయం, దుఃఖం అన్నీ ఉన్నాయి. ఈ నందుని ముఖంలో సంతోషం, ఆనందం, ధైర్యం, నిశ్చింతమైన మనస్సు కన్పించాయి. ఆ నందుడు పరమ సంశయాత్ముడిలాగా, సముద్ర రోగంలో పడ్డవాడిలాగా వున్నాడు; ఇప్పుడు పరమయోగిలాగా, స్థితప్రజ్ఞుడిలాగా, వ్యవసాయాత్మికమైన బుద్ధిగలవాడిలాగా మారిపోయాడు. నందునిలో వచ్చినమార్పు ఇటువంటిదని చెప్పాలంటే, అక్కడ వారిలో ఏ ఒక్కరూ చెప్పలేరు. కాని వారు అందరు మనస్సులలో మాత్రం ఆ కాస్త వ్యవధిలో నందునిలో పెద్దమార్పు ఏదో వచ్చిందని మాత్రం గుర్తించగలారు. నందుడు సభలోకి వచ్చి రోహిణీదేవి, యశోద, తక్కిన గోపస్త్రీలు కూర్చున్నవైపు చూశాడు. రోహిణీదేవికి, యశోదకు దగ్గరగా పిల్లలు కూర్చున్నారు. వాళ్లు ఏమో మాట్లాడుకుంటున్నారు. తల్లులను ఎందుకో వేధిస్తున్నారు. వారిమాటలు వింటూ రోహిణి పూరికే నవ్వుతోంది. యశోద నవ్వుతూ కృష్ణుణ్ణి కసురుతోంది. కృష్ణుడు ఆవిడ తొడమీద రెండు చేతులు ఆన్చి, పిడికిళ్ళతో గడ్డం ఎత్తిపట్టుకొని, తల పైకెత్తి, ఆవిడ కళ్లల్లోకి చూస్తూ ఏమో మారాము చేస్తున్నాడు. ఏమో మాట్లాడుతున్నాడు. రోహిణి, బలరాముడూ అతనిమాటలు వింటున్నారు, నవ్వుతున్నారు. తక్కిన గోపికలు కూడా నవ్వుతున్నారు. ఇంతకవంలో ఆడవాళ్ళు ఈ నవ్వులు ఏమిటో అని మగవాళ్ళు తెల్లబోతున్నారు. అప్పుడు నందుడు అక్కడికి వచ్చాడు. అతనికి కృష్ణుణ్ణి చూస్తే ముదమయింది. ఆ కూర్చోబడడం చూస్తే ఆశ్చర్యమైంది. అతని బాలకం చూస్తే మనస్సులో భక్తి కుదిరింది. నందుడు సరాసరి స్త్రీలు కూర్చున్నచోటుకి వచ్చాడు. ఒకసారి యశోదను చూశాడు. కృష్ణుణ్ణి చూశాడు. బలరాముణ్ణి చూశాడు. రోహిణీ అమ్మవారిని చూసి "ఏమిటి!" అని పలుకరించాడు. "ఏమిటి! తండ్రి అల్లరిచేస్తున్నా లేవుంది" అన్నాడు.

"ఇదుగో! నందా! వీడితో వేగడం కష్టంగావుంది. పిల్లవాడు ఇంతలేడా! ఈ గోపికలతో పరాగాలు! బృందావనం వుందిటగా, అక్కడికి పోతాట! అక్కడ మడుగు లున్నాయిటగా, వాటిలో ఈదు క్రీడలు చూపిస్తాట! నేను చెబుతున్నాను చూడు! వీణ్ణి ఇట్లా వదిలి లాభంలేదు" అన్నది రోహిణి.

అప్పుడు అంతా నవ్వారు. నందుడు ఒక్కడే నవ్వలేదు. "తండ్రీ! నీకు బృందావనం వెళ్లాలని వున్నదా? నవ్వు ఒక్కడివే వెళ్తేది? మమ్మల్ని కూడా తీసుకువెళ్లు. ఎందుకైనా సమర్థుడివి!" అన్నాడు నందుడు. ఆ మాటలు అక్కడ అందరికి అర్థమైనాయి; అర్థం కాలేదు. రోహిణీ మాత్రం తలఎత్తి నందగోపుణ్ణి తీక్షణంగా చూచింది. ఆ కళ్లలో ఆవిడ ఏమి ప్రశ్న వేసిందో అవును అన్నట్లు నందుడు తల వూపాడు. ఆవిడ రెండుచేతులు ఎత్తి నమస్కారం చేసింది. ఎందుకు చేసిందో, ఎవరికి చేసిందో అక్కడ ఒక్కరికీ తెలియలేదు. అప్పుడు ఆవిడ బలరాముణ్ణి దగ్గరకు తీసుకుంది. కృష్ణుణ్ణి ఒళ్లోకి తీసుకుంది. ఇద్దరిని ముద్దుపెట్టుకుంది. "నాయనా! మనం బృందావనం వెడుతున్నాము. మీరు అన్నదేగా! పదండి ఇంటికి; అన్నీ సర్దుకోవాలి కదా!" అంది.

నందుని నిశ్చయం ఏమిటో అందరికి తెలిసింది. అయినా నందుడు సభను సంబోధించి, ఇట్లా అన్నాడు: "వ్రజస్థానంలో నావల్ల మీరు ఇంతకాలం కొన్ని కొన్ని కష్టాలు పడ్డారు. ముఖ్యంగా ఈ వృకదర్శనంవల్ల కలిగిన బాధ చెప్పరానిది. అంతా బృందావనం పోదామన్నప్పుడే నేను ఒప్పుకోవలసింది. కాని ఒప్పుకోలేకపోయాను. అది నా లోపమే. ఇక్కడ ఈ బాధలు పడుతూ ఎట్లా వుండటం అన్న ఆలోచనే నాకు సరిగ్గా రాలేదు. ఈ తోడేళ్లను మనం చంపగలమా? అది మనచేతకాదని తేలిపోయింది. ఈ తోడేళ్లవల్ల వ్రజస్థానంలో ఇల్లు ఇల్లు గాలించింది. ఒక ఇంట్లో కోడెను పట్టుకుపోతే, ఒకొక ఇంట్లో సోదరుడు చనిపోయాడు. ఒక ఇంట్లో పసిపిల్లను ఎత్తుకుపోతే, ఇంకో ఇంట్లో పాడిపశువులు ఎత్తుకుపోయాయి ఈ తోడేళ్లు. ఎన్ని పశువులు నష్టమైనాయో ఎవరు చెప్పగలరు? జనం ఎంత బాధపడ్డారో ఎవరు చెప్పగలరు? ప్రతిఇల్లు ఏదోవిధంగా వృకవ్యాపాదితం అయింది. ప్రతిఇంటిలోనూ ఏదోవిధమైన దుఃఖం కన్పిస్తోంది. ఇంత దుఃఖాన్ని చూస్తూ కూడా నేను ఒక నిర్ణయానికి రాలేకపోయాను. అది నా లోపమే. మీరు చెప్పనే చెప్పారు. నేనే వినలేదు. ఇప్పుడు మీ నిర్ణయమే సరియైన నిర్ణయం అనిపిస్తున్నది. ఇంతమంది వృద్ధులు, పెద్దలు మీరు చేసిన నిర్ణయం ఎప్పుడూ తప్పు కాదు. మనం ఇప్పుడే బృందావనం బయలుదేరుతున్నాము. బృందావనం మనకు మన పశువులకు హితనివాసం అయినచోటు."

నందుని వాక్యాలు విని గోపకులు, గోపికలు చాలా సంతోషించారు. బృహస్పతిలాగా ఆలోచించి చెప్పావు అన్నారు. వెంటనే ప్రయాణసన్నాహాలు ఆరంభమైనాయి. వ్రేపల్లెలో ఎడ్లబళ్లు బయటికి వచ్చాయి, ఎడ్లను తీసుకువచ్చి బండ్లకు కడుతున్నారు. బండ్లను కట్టండి; బరువులు ఎక్కించండి; లెక్కించండి; కావళ్లు అన్నీ జాగ్రత్తగా పెట్టండి; కొత్తపనులు జాగ్రత్త; బియ్యం కొత్తపంచుల్లో పోసి ఎక్కించండి; నెమరివద్దు మరిచిపోకండి; చాపలు మంచాలమీద వేసి పదిలంగా కట్టండి; దామెనలు, కర్రత్రాళ్లు, తలుపులు, కవ్వాలు, కొడవళ్లు, కత్తులు, మూడగొడవలు, వాదోళ్ళు, మొదలైనవి చెడకుండా చూచుకోవాలి. గంటలఎడ్లను బళ్లకు కట్టండి అంటూ వ్రేపల్లె అంతటా కేకలు వినిపిస్తున్నాయి. ముసలివాళ్ళను, ఆడవారిని, గంపమోపులవారిని ముందుగా కదలనియ్యవలసివుంటుందని పెద్దలు ముదలలు మొదలుపెట్టారు. ఇట్లా పెక్కువిధంగా రొదలతో వ్రేపల్లె మహా కోలాహలంగా వుంది. ఆ కోలాహలంతోనే వ్రేపల్లెను వ్రేపల్లె ముందుకు కదిలింది.

లావుపాటివాలు పశువులతో ముందుగా కదిలారు. వారివెనుక బళ్లు, బండ్లవెనుక తక్కిన వ్రజం. ఇట్లా ప్రయాణం ఆరంభమైంది.

వృద్ధులు, జరఠప్రముఖులు దారిలో త్రుస్సి ఓలాకు పడిపోకుండా వారికి కావలిగా వుండి నడిపించుకు వచ్చేందుకు మనుష్యుల్ని ఏర్పాటు చేశారు. తరుణులు, తరుణస్త్రీలు దారిలో ఒకచోట సరసాలు. ఒకచోట మేలమాడుకోవడం. కృష్ణుడు బండిలో నిల్వడు. బలరాముణ్ణి నిల్వనీయడు. చేతిలో వేణువు పట్టుకొని ఏవో సంగీతాలు ఊది పోస్తాడు. ఎటువంటి వృద్ధగోపిక అయినా, అట్లా నిలిచి, ఒక నవ్వు నవ్వి ఒక నాట్య హావభావం చూపించక తప్పని ఆవేశం ఏదో ఆపాటలోంచి పుట్టుకువస్తోంది. ఎక్కడ కృష్ణుడు వుంటే అక్కడ పాటలు; అక్కడ నాట్యాలు; అక్కడ ఆనందాలు; ఆనంద తరంగాలు పొంగులుపోతున్న విధంగా ప్రయాణం సాగుతోంది.

గోపికలు తలలమీద కుండలు పెట్టుకొని కదులుతూవుంటే, ఆకాశంలో తారకలు కదులుతున్నట్లు వుంది. పలుదరుచాలను కొందరు నీలవల్కలాలచేత, కొందరు పీతవస్త్రాలచేత, కొందరు అరుణాంబరాలచేత, బిగించికట్టుకొని ముందుకు సాగుతూవుంటే, మహేంద్రచాపాలు భూమిమీద నడుస్తున్నట్లువుంది. బళ్లు వేగంగా కదులుతూవుంటే సముద్రంలో నౌకలు కదులుతున్నట్లు వుంది. క్షణంలో వ్రజస్థానాన్ని శూన్యం చేసి గోకులంఅంతా బృందావన నివాసేచ్ఛామతియై అతి కుతూహలంతో ముందుకు నడుస్తోంది. మేటికుజ్జులమున్న పాలబండిలో యశోద, రోహిణి కూర్చున్నారు. నందుడు బండి తోలుతున్నాడు. పిల్లలు చెప్పినమాట వినడంలేదని యశోద గుసగుసలాడుతోంది. నందుడు నవ్వుతున్నాడు. రోహిణి నవ్వుతోంది. పిల్లలను పిలవండి అని యశోద అంటే. నందుడు పిలవడు. ఆ పిల్లలు తోటిబాలురతో కలిసి, దారి అంతా వడిచేస్తున్నారు. అలగోలు బాలగోలు చేస్తున్నారు. ఉన్నవాద్యాలు వాయిస్తున్నారు. తలలమీద కాకపత్రాలతో మయూరతలల కోడెత్రాచుల్లాగా మందఅంతటా మెరులుతున్నారు. రోహిణి వారి చేతులకు మయూరాంగదాలు పెట్టింది. తలలో పూలు పెట్టింది. దారిలో ఆ పూలు, ఈ పూలు కోసి, మాలలు కట్టి వేసింది. అవి ధరించి వాళ్లు గ్రుమపోతుల్లాగా కన్పిస్తున్నారు. గోపవేణువులు ఊదుతున్నారు. ఎక్కడబడితే అక్కడ సంచరిస్తున్నారు. అశ్వపోతాల్లాగా ఆడుకుంటున్నారు. వారి ఆటలు చూస్తే యశోదకు భయం; ఎవరిపిల్లలను ఏమి చేస్తారో అని భయం! "అమ్మా! రోహిణి అమ్మగారూ! వాళ్ళు పెద్దవాళ్ళమాట వినే పిల్లలు కారు. మనమే వాళ్ళమాట వినాలి. మీరంటే వాళ్లు కొంచెం వింటారు. వాళ్లకు కథలేమైనా చెప్పి అయినా ఇక్కడ కూర్చుండేట్లు చూద్దురూ. మీకు పుణ్యంవుంటుంది" అంది యశోద.

"వాళ్ళు నామాట వింటారనే! విని ఇందులో కూర్చుంటారనే! నేను ఒకపని చేస్తాను వుండు! గోపయ్యా! కొంచెం బండి ఆపు. వీళ్ల సంగతి నేను చూస్తాను" అంది రోహిణి. నందగోపుడు బండి ఆపాడు. తక్కిన బళ్లుకూడా ఆగాయి. బళ్ళు ఎందుకు ఆగాయా అని అంతా అనుకున్నారు. పిల్లలు బళ్లి వద్దకు పరుగెత్తుకు వచ్చారు. రోహిణి బండి దిగుతూవుంటే రామకృష్ణులు ఆవిడకు చేతులు అందిఇచ్చి క్రిందకు దింపారు. "నాయనలారా! మీరు బండి ఎక్కరాదా! యశోదప్రాణం నిల్వడం లేదు" అంది రోహిణి. పిల్లలు మేము బండి ఎక్కం అన్నారు. "అయితేసరే! నేనుకూడా మీతో నడుస్తాను రండి అంది రోహిణి. "ఏమండోయ్! రోహిణిఅమ్మగారు! రండి రండి, ఆ పురూరవుడికథ ఇప్పుడు చెప్పండి. అప్పుడు అన్నారుగా! నేను మరిచిపోలేదండోయ్!" అన్నాడు కృష్ణుడు. "నందా! బండి పోనియ్యి. నేను పిల్లలతో వస్తాను. వీళ్ళకు కథలు చెప్పాలిట!" అంది రోహిణి. నందునిబండి కదిలింది. తక్కినబళ్ళు కదిలాయి. గోకులం ముందుకు కదిలింది.

రోహిణి కథ చెపుతుందనగానే చాలామంది ఆమె చుట్టూ చేరారు. ఆవిడ పిల్లలుకోరినట్లు పురూరవుడికథనే మొదలుపెట్టింది "ఇలకు బుధుడికి పుట్టాడని చెప్పాను. ఆయనే పురూరవుడని కూడా చెప్పాను ఆ పురూరవుడు అతిదానశీలుడు. సత్యవాది. ఎన్నో యజ్ఞాలుచేశాడు. మంచి తేజస్వి. అతిరూపసి. మనస్వి.



# ★ హరివంశం

ఒకరోజున ఆయన మిత్రావరుణుల శాపంవల్ల మానవలోకంలో పడిపోయిన కృతమతిని ఊర్వశిని చూచాడు. ఆ ఊర్వశి ఆయన్ను చూచింది. చూడగానే అది తన పూర్వవృత్తాంతాన్ని మరిచిపోయింది. పురూరవునియందే మనస్సు నిల్పివేసింది. పురూరవుడు గూడా దాని శరీరకాంతిని, సౌకుమార్యాన్ని, లావణ్యాన్ని, గతి విలాసాన్ని, మధురహాసాన్ని చూచి దానియందే తన చిత్తవృత్తి నంతా ఆయత్తంచేసి వేశాడు. ఆ ఊర్వశి సకలలోక స్త్రీలోక సౌందర్యాన్ని తనలో దాచుకుంది. కాబట్టే పురూరవుడికి దానియందు అంతటి ప్రేమ కుదిరింది. వాళ్ళిద్దరూ ఒకళ్ళనొకళ్ళు చూచుకొని తమ్ముతప్ప సర్వాన్ని మరిచిపోయారు. రాజు ప్రగల్భుడు గనుక ఆ ఊర్వశిని ఇట్లా పల్కరించాడు. "ఓసి! అందమైన కనుబొమలుకల దానా! నేను నిన్ను ప్రేమించాను. నీవు నన్ను పెండ్లిచేసుకుంటావా?" రాజు ఈమాటలు విని ఊర్వశి సిగ్గుపడ్డది. ఊర్వశి రాజుతో ఇట్లా అన్నది: "మహారాజా! నాకు మూడు వ్రతాలు వున్నాయి. వాటిని మీరు పాలిస్తారా?" రాజు ఊర్వశితో "ఓసి! నువ్వు గడుసుదానవే! ఏమో మూగదాననుకున్నాను. సరే. ఆ వ్రతాలు ఏమిటో చెప్పు" అన్నాడు. ఊర్వశి సరేనని ఆ మూడు వ్రతాలు ఏమిటో చెప్పింది.

"రాజా! నాదగ్గర రెండు మేకలు వున్నాయి. అవి నాకు బిడ్డలతో సమానం. నేను వాటిని మంచందగ్గర కట్టిపెట్టుకుంటాను. ఇది నా వ్రతం. దీన్ని మీరు కాదనకూడదు."

"ఇంతేనా! సరే! అట్లాగే కానియ్యి!" అన్నాడు రాజు. "రెండో వ్రతం ఏమిటో వినవచ్చా" అన్నాడు.

"దానికేం! మహారాజా! మీరు దిస్సమొలతో నా కళ్ళను ఎప్పుడు పడరాదు. ఇది నా వ్రతం. మీరు పాలిస్తారా?"

"సరే! మూడో వ్రతం ఏమిటో చెప్పు"

'మూడో వ్రతం. నా ఆహారానికి సంబంధించింది నేను నేయి తప్ప ఇంకోటి ముట్టుకోను. ఇది నా వ్రతం. మీకు ఇష్టమేనా?"

ఇష్టమే నన్నాడు పురూరవుడు. అప్పటినుంచి వారిజీవితం నిత్యవసంతంగా సాగిపోయింది. ఊర్వశికి పురూరవునియందు అనురాగం అధికమైపోయింది. ఆ దేవవేశ్య, అసురలోకాన్ని, అమరలోకవాసులను మరిచిపోయింది. ఊర్వశి లేని స్వర్గం దేనికని సిద్ధులు, గంధర్వులు, దేవతలు అంతా అనుకున్నారు. వారికి ఏమిచేస్తే ఊర్వశి పురూరవుణ్ణి వదిలి వస్తుందో తెలియలేదు. ఆ తెలిసినవాడు ఒక్కడే ఒక్కడు. వాడు గంధర్వుడు. పేరు విశ్వావసువు. అమరగణం ఈవిశ్వావసువును ఊర్వశిమీద, పురూరవునిమీద ప్రయోగించింది. వాడు మహామాయలమారి. ఒక రోజున పురూరవుడు, ఊర్వశి, మంచాలు వేసుకొని ఆరుబయట పడుకుని వుండగా ఊర్వశికి పుత్రభూతం అయిన మేకల్లో ఒకదాన్ని ఎత్తుకుపోయాడు. వాడు అటూ దాన్ని ఎత్తుకుపోతూ వుంటే ఆ మేక దీనంగా మేఁ మేఁ అని అరిచింది. ఊర్వశి ఆ అరుపువిని అదిరిపడి "నా మేకను ఎవరో ఎత్తుకుపోతున్నారు. మహారాజా! మీరు రక్షించాలి" అంటూ గోలగా విలపించింది.

రాజు దిస్సమొలతో వున్నాడు. అంతా చీకటిగా వుంది. దిస్సమొలతో వుండగా అది, ఈ ఊర్వశి తన్ను చూస్తే సమయ భంగం అయిపోతుంది. అందుచేత దాని యేడ్పు వినికూడా పురూరవుడు మంచంమీదనుంచి కదలలేదు. ఇంతలో తక్కిన గంధర్వులు వచ్చి మిగిలిన ఇంకో మేకనుకూడా ఎత్తుకుపోయారు. ఆ మేక గూడా మేఁ మేఁ అని దీనంగా పరిదేవనం చేసింది. ఊర్వశికూడా "నేను అనాథను. అభర్తృకను. ఏ పురుషుణ్ని ఆశ్రయిస్తాను" అని పరిదేవనం చేసింది.

రాజుకు ఇంకో గత్యంతరం లేదు. చుట్టూ చీకటిగా వుంది గనుక, తన నగ్నత్వం ఆ ఊర్వశి చూడలేదనుకొని రాజు కత్తిపట్టుకొని "ఎవడురా! వాడు! ఊర్వశికి అపచారం చేసినవాడు. వాడికి ప్రాణాలు ఇక లేవు" అంటూ బయలుదేరాడు. ఆ గంధర్వులు పరమ ధూర్తులు. అప్పుడు వారు ఒక్క విద్యుత్తును సృష్టించి చీకటిని

ఒక్క క్షణం తొలిపార వేశారు. ఆ ఒక్క క్షణంలో ఊర్వశి దిస్స మొలతో వున్న పురూరవుణ్ని చూసింది. పురూరవుడు ఆడినమాట తప్పినవాడైనాడు. దాని సమయాన్ని భంగం చేసినవాడైనాడు. గంధర్వులు మేకలను వదిలి కదిలిపోయారు. ఊర్వశి రాజును వదిలి లేచిపోయింది.

ఊర్వశి కన్పించక రాజు పిచ్చివాడై పోయినాడు. పిచ్చివాడై దేశాలన్నీ తిరిగాడు. ఒక్కనాడు ఊర్వశి రాజుకు కురుక్షేత్రంలో అంభోజ సరసిలో అప్సరసలతో కలిసి స్నానం చేస్తూ కన్పించింది. రాజుకు పిచ్చి ఎత్తిందా యేను! ఆపిచ్చిరాజు దానిని చూడగానే "హే జాయే! తిష్ఠ! మనసా ఘోరే! తిష్ఠ! వచసి కపటేకే తిష్ఠ!" అంటూ ప్రలాపాలు మొదలుపెట్టాడు. నిజానికి అవి ప్రలాపాలు కావు. మంత్రాలు. వేదాలలో కూడా ఈ మంత్రాలు ఈ కథలు వున్నాయి. పురూరవుడి కథ వేదాల్లో కూడా వుంది. వేదసూక్తాలతోనే పురూరవుడు ఊర్వశిని వేడుకున్నాడు.

ఊర్వశి రాజును మన్నించింది. ప్రేమతో బ్రతిమలాడింది. "రాజా! ఈ పిచ్చి చాలు! నేను ఇప్పుడు అంతఃప్రసవను. ఒక్క సంవత్సరంలో నీకు నావలన ఒక పుత్రుడు ఉదయిస్తాడు. ఆనాటినుంచి ప్రతి సంవత్సరం ఒక్క ఒక్క రాత్రి నీతో గడుపుతాను." అంది. రాజు సంతోషించాడు. ఆయనకు పిచ్చి వదిలిపోయింది.

ఊర్వశికూడా తిరిగి అప్సరసలతో స్వర్గభూములకు వెళ్ళింది. అక్కడ అప్సరసలు దాన్ని హాస్యం చేశారు. "అనురాగకృష్టమానసుడయిన ఆ పురుషశ్రేష్ఠుణ్ని ఏమి ఏడిపిస్తున్నావే"— అన్నారు. ఊర్వశి వారిని ప్రార్థించింది. నిజంగా ఏడ్చింది. నన్ను హాస్యం చేయబోకండి అంది. ఆయనవంటి వానితో జీవితం అంతా పెళ్ళయిచ్చినా తనివితీరదు అంది.

తిరిగి ఏ రోజున ఊర్వశి తనకు కురుక్షేత్రంలో కన్పించిందో, ఆ రోజు తిరిగివచ్చేనాటికి తిరిగి పురూరవుడూ ఆ కురుక్షేత్రం చేరుకున్నాడు. ఆ రోజున తిరిగి ఊర్వశి ఆయనకు కన్పించింది. ఇప్పుడు ఊర్వశి ఒక్కర్తెగా రాలేదు. పుత్రుణ్ణి వెంటబెట్టుకు వచ్చింది. ఆ పుత్రుడే ఆయువు. ఆయువును ఊర్వశి రాజుకు ఇచ్చింది. ఇట్లా ప్రతి సంవత్సరం ఊర్వశి పురూరవులు కలుసుకుంటూ వచ్చారు. కలుసుకున్నప్పుడల్లా ఊర్వశి గర్భం ధరించింది. గర్భం ధరించినప్పుడల్లా అప్సరసలు దాన్ని అవహేళనం చేస్తూ వచ్చారు. ఇట్లా ఊర్వశికి పురూరవునివల్ల మరో ఐదుగురు పుత్రులు కలారు.

ఒకసారి ఊర్వశి రాజుతో తన్ను అప్సరసలు అవహేళనం చేస్తూ వున్న సంగతి చెప్పింది. తన్ను వదిలిపెట్టవలసిందిగా ప్రార్థించింది. రాజు అందుకు అంగీకరించలేదు. "నా రాజ్యాన్ని, బంధువులను, బలాన్ని, కోశాన్ని, వదలగలను గాని ఊర్వశీ! నిన్ను వదలలేను" అన్నాడు. "ఊర్వశీసాలోక్యం తప్ప నేను ఇంకో దేనినీ వాంఛించను" అన్నాడు. "మహారాజా! నేను నీలో కలిసిపోతే బాగుండును" అంది ఊర్వశి.

ఊర్వశీ పురూరవుల ప్రణయం అతిలోకమైందని దేవతలకు గంధర్వులకు అర్థమైంది. అది గ్రహించి గంధర్వరాజు పురూరవుడికి ఒక అగ్నిస్థాలిని ఇచ్చాడు. ఆమ్నాయానుసారం ఈ అగ్నిని మూడుభాగాలుచేసి యజించగల్గితే నీకు ఊర్వశీసలోకత లభ్యం అవుతుందని రాజును గంధర్వరాజు ఆశ్వాసించాడు. రాజు ఆ అగ్నిస్థాలిని పట్టుకొని అడవుల్లో ఆలోచిస్తూ పూర్తిగా భ్రమ్మరిల్లాడు. ఊర్వశికి బదులు ఈ అగ్నిస్థాలిని ఇచ్చారేమిటి అని వాపోయాడు. "నేను మూఢుణ్ణి. ఇంతకంటే చేయగలింది ఏమిటి" అనుకున్నాడు. ఆ అగ్నిస్థాలిని అడవిలోనే వదిలి నిజపురానికి, ప్రతిష్ఠానానికి, తిరిగి వచ్చాడు.

ఆరాత్రి పురూరవుడికి నిద్ర పట్టలేదు. ఆయన ఇట్లా చింతించాడు. ఈ గంధర్వరాజు ఊర్వశీప్రలోభితుడు. లేకపోతే అట్లా ఎందుకు చెబుతాడు. అగ్నిని మూడుభాగాలు చేసి, ఊర్వశీసలోకతను కోరి యజ్ఞం చేయమన్నాడేమిటి? నేను దాన్ని అడవిలో వదిలివేసి వచ్చాను. ఇప్పుడు దాన్ని తిరిగి తీసుకువస్తాను. ఏమౌతుందో చూస్తాను—అనుకున్నాడు.

వెంటనే బయలుదేరి రాజు అరణ్యాలకు వెళ్ళాడు. అక్కడ అగ్నిస్థాలీ కన్పించలేదు. దాన్ని తాను వదిలిన స్థానంలో శమీగర్భమైన అశ్వత్థం కన్పించింది. "నేను అగ్నిస్థాలిని ఇక్కడ పెట్టాను. ఇక్కడే ఇది పుట్టింది. దీన్ని తీసుకుపోయి అరణిని మథించి అగ్నిని పుట్టిస్తాను. దాన్ని ఉపాసిస్తాను" అనుకొని, శమీగర్భమైన అశ్వత్థంతో పురూరవుడు ప్రతిష్ఠానం చేరుకున్నాడు.

ప్రతిష్ఠానం చేరుకున్న వెంటనే అరణిమథనం ప్రారంభమైంది. గాయత్రిని పఠిస్తూ, ఆ మంత్ర సామర్థ్యంతో, ఆ మంత్రంలో ఎన్ని అక్షరాలు వున్నాయో అన్ని అంగుళాల అరణులను రాజు మథించాడు. అందులోంచి అగ్ని పుట్టుకు వచ్చింది. అది మూడు రూపాలుగా పుట్టుకు వచ్చింది. గార్హపత్యం, ఆహవనీయం, దక్షిణాగ్నుల రూపంలో పుట్టుకువచ్చింది. ఆ అగ్నులు త్రేతాగ్నులయినాయి. ఆమ్నాయానుసారం ఆ అగ్నులతో రాజు యజ్ఞం చేశాడు. ఊర్వశీ సాలోక్య ఫలం అందువల్ల ఆయనకు అభిసంధితమైంది. ఆ యజ్ఞంవల్ల లభించిన ఫలంతో పురూరవుడు గంధర్వలోకాన్ని పొంది ఊర్వశితో వియోగంలేని సుఖాన్ని పొందగల్గాడు."

ఈకథను అంతా సావధానులై విన్నారు. ఇంతలో ఎదురుగా బృందావనం కన్పించింది. నందుని ఆజ్ఞతో బండ్లన్నీ అక్కడ ఆగాయి. అంతా ఒక్కచోట చేరి ఏమి చెయ్యవలెనా అని ఆలోచన చేశారు. ముందు కొందరు ఆ వనంలో ప్రవేశించి నివాసయోగ్యమైన స్థలాన్ని నిర్ణయించడం మంచిదని తేలింది. నందుడు మరి కొందరు వృద్ధవేత్తలు వనంలో ప్రవేశించి ఆనుడవరపు కల్గిన సమప్రదేశాన్ని పరిశీలించి, ఇది నివాసయోగ్యం అని నిర్ణయించారు. తిరిగివచ్చి బండ్లను ముందుకు సాగనిచ్చారు. బండ్లు ముందుకుపోవడానికి వీలుగా ముందు కొందరు చెట్లునరికి దారులు చేశారు. ఘోషం ఘోషం ఆ ప్రదేశం చేరుకుంది. ఆ అమల ప్రదేశంలో బండ్లన్నీ అరచంద్రాకారంగా నింపి, విడిదులు ఏర్పాటు చేసుకున్నారు. కొందరు గుడిసెలు వేసుకున్నారు. కొందరు ఘననికుంజాలే ఇళ్ళను కొన్నారు. కొందరు ఆకుజొంపాలలోనే కాపురాలు పెట్టారు. కొందరు చెట్లక్రిందనే బసచేశారు. క్రంపలు నరికి పశువు కుదొడ్లు వేశారు. ఇట్లా ఒక్కరోజులో బృందావనం వ్రేపల్లెగా మారిపోయింది. ఒక్కరోజులో గోపకుటుంబులందరూ అక్కడ ప్రాతకాపులై పోయినారు.

నాలో కోర్కెలు గూళ్లు కట్టుకొని నాన్నా!
పార్వతీ నాథ! తా
మేలో పక్షులు ఆకటం బడిన వెంతే
తీవ్ర పర్ణాహతిన్
లోలద్భావముగా మనస్సరసి
కల్లోలంబుగా పేర్చెడిన్
లీలా యాదవు పేరి తూపులను
త్రోలింపంగ లేవో శివా.

ఇది వ్రజనివాసపర్వము




(గతవారం తరువాయి)

'రాలేదా అన్నయ్యా!' నీరసంగా ప్రశ్నించింది లక్ష్మి.

దీక్షితులు మౌనంగా యింట్లోకి వచ్చేశాడు. బ్రహ్మయ్యగారు యింకా నిద్రపోలేదు, దీక్షితులు పట్నంనుంచి శివరాంను తీసుకువస్తాడని. అతను ఒంటరిగావచ్చి ఎదురుగా నిలుచున్నాడు.

'రాలేదన్నమాట!' బ్రహ్మయ్యగారు నీరసంగా నిట్టూర్చారు.

'ప్రజాసేవకు శరీరం అంకితంచేసిన గొప్పవాళ్లకు మాలాంటి సామాన్య సంసారులపై మమతలు స్మరించుకోడానికి సావకాశముండొద్దూ!' వ్యంగ్యంగా నవ్వారు బ్రహ్మయ్యగారు. ఆయన అల్లుకున్న ఆశలన్నీ తెంచుకుపోయాయి. మర్నాడు రెండుగంటలకైనా మనుమడువస్తే రావచ్చునన్న మరొకఆశ బ్రహ్మయ్యగారిలో పొడచూపింది.

ఇంతలో వెంకటేశ్వర్లు చిన్న సంచీ పుచ్చుకుని దిగాడు. తాతయ్య చెలులు క్షేమం ప్రశ్నించాడు. స్వార్థపరుడైన అతని రాకపోకలు ఆ యింట్లో ఎవ్వరికి నచ్చకపోయినా బంధువుగా వచ్చిన అతిథికి తప్పనిసరిగా సత్కారాలు చెయ్యకతప్పలేదు.

రాత్రి విశ్రమించి, మర్నాడు లేచి రాజమండ్రి దగ్గరున్న తన పొలాలపంటలగురించి ప్రస్తావించి, కుటుంబంలో పిల్లలకు అనారోగ్యం పెరిగిపోవడంవల్ల తప్పనిసరిగా పొలంశిస్తుల్లో రెండు వందల రూపాయిలు యీమధ్య వాడుకున్నానని చెప్పాడు వెంకటేశ్వర్లు. పూర్తిగా పొలాల వ్యవహారాలు వెంకటేశ్వర్లుకు తప్పనిసరిగా అప్పగించిన బ్రహ్మయ్యగారుఊకొట్టి మౌనంవహించారు. పండుగనాడు ఎట్లాగైనా యింటికి చేరాలనీ లేకపోతే పిల్లలు బెంగపెట్టుకుంటారనీ తమ్ముడు శివరాం రావచ్చునేమోనని తెలిసినా, ఉండడానికి వీలుపడదనీ, వెంకటేశ్వర్లు కర్కశంగా తిరుగుప్రయాణమైపోయాడు, వేకంగికి.

మధ్యాహ్నం రెండుగంటలు దాటింది. శివరాంరాలేదు. ఇంక మనుమడురాడని బ్రహ్మయ్యగారు పూర్తిగా నిరాశచేసుకున్నారు. లక్ష్మి చాలవరకు దిగాలుపడిపోయింది. దీక్షితులకు నిరుత్సాహం కలిగింది.

సాయంత్రం సుందర్, ఉష, గోంగూర కొమ్మలకు గుడ్డనూనెవత్తులువెలిగించి, గుమ్మంలో నిలుచుని, ఆరిపోయే సమయానికి "దిబ్బు దిబ్బు దీపావళీ! మళ్ళీ వచ్చేది. నాగులచవితీ!" అంటూ నేలమీద గోంగూర కట్టలు బాది వీధిలో విసిరేశారు.

వీధిలో అరుగులమీద మట్టిప్రమిదలనూనెవత్తులు ఒయ్యారంగా గాలిలో కదులుతూ వెలుగుతున్నాయి. అప్పుడే ప్రతి యిల్లు దీపాలతోరణాలతో అలంకరించారు. నిశీథం ఆవరించుకున్న నింగికూడా చుక్కలదీపాలు వెలిగించుకుని తొంగిచూస్తోంది భువిపైకి.

భోజనాలు ముగించుకుని దీక్షితులు పాత్రుడు బాణసంచా కాల్చాలని వీరుల్లా బనీను నిగుతుపంట్లాములు తొడుక్కొని వీధిలోకి వచ్చారు, సూర్యారావు సుందర్ దగ్గర చేరి కాకరపువ్వొత్తులు కాల్పించాడు. విష్ణుచక్రాల్లా వెలుగులు బయటకిరాగా, దీక్షితులు తర్వాత యిద్దరు కూతుళ్ళు చచ్చిపోవడంతో మిగిలిన ఒక్కకూతురు ఉషను ఎంతో అభిమానంగా చూసే కామాక్షమ్మ ఆమె చేత మతాబాలు కాల్పించింది. వెన్నెల ముద్దల్లా వెలుగులు మతాబాలలోంచి క్రిందకు జలజలరాలాయి.

బ్రహ్మయ్యగారు లేనిశక్తి తెచ్చుకొని వీధి అరుగుమీదకు బలవంతంగా వచ్చి తలగడా నడ్డికి ఆన్చుకుని, బాణసంచా కాల్పుల సంబరం చూస్తూకూర్చున్నారు.

దీక్షితులు, పాత్రుడు పందెం వేసుకుంటూ బాణసంచా కాల్చారు.

పిల్లలువెలిగించిన చిచ్చుబుడ్లు వాసాగను చూడంటూ భూమిమీద నృత్యంచేసినట్లు కనిపించాయి. హృదయ కుహరాలు బ్రద్దలు చేస్తూ ఔట్లు పేల్చారు పాత్రుడు. సూర్యారావు సరదా ఆపుకోలేక సీమటపాకాయి కాల్చారు. కామాక్షమ్మ గోటపాకాయలు కలుపుతూ కొట్టి పేల్చింది.

బ్రహ్మయ్యగారు మౌనంగా భూమిమీద వెలుగులు, ఆకాశంలోని వెలుగులు పరిశీలిస్తున్నారు. ప్రశాంతంగా కళ్లుబలహీనమైపోయి పూర్తిగా జ్యోతులు మాత్రమే కనిపిస్తున్నాయి. తోకచుక్కలు రాలినట్లుఆకాశంలోకి పోయిన తారాజువ్వలు వెలుగుచుక్కలు రాలుస్తున్నాయి. ఆకాశంలో ఏదో నక్షత్రం ప్రకాశవంతంగా ఎర్రగా మెరిసింది.

బాణా సంచా కాల్పుల పొగలు బ్రహ్మయ్యగారి ముఖం మీదకు వ్యాపించాయి. నాసికా రంధ్రాలలో దూరిన ఆ పొగలు బ్రహ్మయ్యగారికి దగ్గు తెప్పించాయి. ఖల్లు ఖల్లున గట్టిగా దగ్గారు, దగ్గు ఆపుకోలేక ఆయాసంగా ఒరిగారు. సూర్యారావు కంగారుపడి బ్రహ్మయ్యగారిని పట్టుకున్నారు. బ్రహ్మయ్యగారు నీరసంగా బరువుగా దగ్గుతూ కఫం కాండ్రించారు. తరువాత కక్కుకున్నారు. రక్తం ముద్దలు ముద్దలుగా శరీరాంతర్భాగమంతా ఖాళీ అయినట్లు గొంతులోంచి బయటకి వచ్చేసింది. కళ్ళు తేలవేసి, కాళ్ళు కట్టెల్లా సాచారు బ్రహ్మయ్యగారు.

పరిస్థితి ప్రమాదం గుర్తించి తారాజువ్వల కాల్పులలో నిమగ్నమయిన దీక్షితులను పిల్చి బ్రహ్మయ్యగారిని ఇంట్లో మంచంమీద చేరవేశారు సూర్యారావుగారు. లక్ష్మి కంగారుగా అటు ఇటు బ్రహ్మయ్యగారి మంచం చుట్టు తిరుగుతోంది.

దీక్షితులను పిలిచారు బ్రహ్మయ్యగారు. "అయిపోయింది...ఇంకొక క్షణము...మనుమడు రాలేదు...చెప్పు...పెళ్లి చేసుకొని

---

పెద్దమనిషి: ఒరేయ్! సిగరెట్లు తాగుతున్నావా? వెధవ. ఉండు మీ నాన్నతో చెప్తా.

అబ్బాయి: మరి మానాన్న తాగుతున్నాడుగా?

పెద్దమనిషి: పెద్దవాళ్ళు తాగవచ్చు.

అబ్బాయి: పుస్తకాల్లో పెద్దవారి అడుగుజాడల్లో నడవాలని ఉందిగా. ఎస్. ఎ. హబీబ్.

---

గృహస్థుడు కమ్మని... అది సాధు శాంతి... ఇతర కులంలోని పిల్లనైనా ఫర్వాలేదు... మతం మారుపుకోవద్దను... వస్తాడనుకున్నా. రాలేదు..." బ్రహ్మయ్యగారి కనుగుడ్డులోంచి కన్నీరు కారి వెంట్రుకల దవడల మీద చారలు కట్టింది. లక్ష్మిని దగ్గరకు రమ్మని సంజ్ఞ చేశారు. ఆమె చేతులు గట్టిగా పట్టుకొని ఆఖరి శ్వాస వదిలారు బ్రహ్మయ్యగారు.

లక్ష్మి గొల్లున ఏడ్చింది. ఇల్లంతా దుఃఖసాగరంలో మునిగిపోయింది. ఆకాశంలోకి ఎగిరిన తారాజువ్వల కాంతులు తచ్చాడుతున్నాయి. పరంలోని దేవతల వెలుగుల్లా చిన్న వానజల్లు కురిసింది.

బ్రహ్మయ్యగారి శవాన్ని బయట వీధి అరుగుమీదకు చేర్పించారు సూర్యారావుగారు. రాత్రి అంతా లక్ష్మి, దీక్షితులు నిద్ర మాని రోదిస్తూ కూర్చున్నారు.

బ్రహ్మయ్యగారి దహన క్రియలు తప్పని సరిగా దీక్షితులు జరిపారు. వెంకటేశ్వర్లుకు, శివరాంకు ప్రొద్దునే టెలిగ్రాంలు ఇచ్చాడు పాత్రుడు.

మర్నాడే తన అయిదుగురు పిల్లలను, భార్యను వెంటబెట్టుకొని వెంకటేశ్వర్లు వచ్చాడు. మరో రోజు దాటాక శివరాం కూడా చేరుకున్నాడు. జట్కా దిగగానే ఐదు నిమిషాలు బాధతో కొయ్యబారిపోయి వలవల ఆడదానిలా ఏడ్చేశాడు శివరాం. చితికిన తన జీవితంలో గతి చూపి పెద్ద చేసి, చైతన్యం కలిగించిన తాతయ్య చచ్చిపోయాడు. దీక్షితులు ఓదార్చాడు. అపురూప అభిమానాలు చూసి పార్వతమ్మ మూతి విరుచుకుంది.

గోదావరి లోయలోంచి ప్రవహించిన నీరు పిల్లకాల్వలోకి చేరిందని, ఆ పవిత్ర గంగతోనే బ్రహ్మయ్యగారికి తిలోదకాలు యివ్వవచ్చునని తీర్మానించాడు పురోహితుడు. బ్రహ్మయ్యగారిని భస్మం చేసిన దుబ్బగడ్డ, నేలమీద నుసి ఇంకా ప్రస్ఫుటంగా కనిపించింది శివరాంకు. చితి పేర్చగా మంటలు రేగి, బ్రహ్మయ్యగారి శవం కాలిన వైనం కళ్ళముందు తిరిగింది శివరాంకు. తన కుటుంబంలో భారతీయ విజ్ఞానసంప్రదాయాలు నిర్దుష్టముగా అవలంబించే పురాతన తరము గతించి, పాశ్చాత్య నాగరిక ప్రభావములో పురాతన సంప్రదాయాలతో ఘర్షణ పడుతూ బ్రతుకుతున్న ఆధునిక తరం మిగిలి నిద్రొక్కుకుందని తట్టింది శివరాంకు. ఈ భావాలతో కూడిన చిత్రం సృష్టించాలని బుద్ధి పుట్టింది శివరాంకు.

తాతయ్య చనిపోయేడనే బాధతప్ప, ఆ పల్లెటూరులో శివరాంకు ఎంతో ఆనందం కనిపించింది. నిత్యం తీరుబడి లేకుండా, ఒంటరి జీవితంలో ఆత్మీయతతో పలకరించే ఒక్కమనిషీ దగ్గర లేకుండా, శ్రమతో చికాకుతో బ్రతుకుతున్న తనకు ఆప్యాయత ఆదరణ ఎదురుగా కనిపించడంతో ఉప్పొంగిపోయాడు శివరాం. సుందర్ ఉషలతో ఆడుకునేవాడు కుర్రాడిలా. దీక్షితులతో పొలాల వెంట షికార్లు చేసేవాడు. పాత్రుడుతో విజ్ఞాన విషయాలు చర్చించేవాడు. మరిగి ఆనందమైన బ్రతుకు చూసి పార్వతమ్మ లోలోపల కుత్సితంగా ఏడ్చేది. వెంకటేశ్వర్లు కూడా అదో ముక్తసరిగా కోపంగానే వుంటున్నాడు. బ్రహ్మయ్యగారు వ్రాసిన వీలునామాలో తనకంటె శివరాంకే ఎక్కువ ఆస్తి ముట్టచెప్పాడని వెంకటేశ్వర్లుకు దుగ్ధ కలిగింది. అన్న అయినా ఎకరాల భూమిలో పంపకాల విషయం ఎక్కువ పట్టించుకోలేదు శివరాం. అంత్యక్రియలు కాగానే వెంకటేశ్వర్లు వేలంగికి బయలుదేరాడు కుటుంబ సహితంగా. మరో రెండురోజులు ఉండమని ఎవరూ అతన్ని బలవంతపెట్టలేదు. అన్నగారి అయిదుగురు పిల్లలకు చెరొక రూపాయి యిద్దామని ఆప్యాయంగా శివరాందగ్గరకు వెడితే అదో భయంగా, హేయంగా, పిల్లలు రూపాయి నాణాలు విసిరేశారు తీసుకోకుండా. శివరాం చిన్నబుచ్చుకున్నాడు. తల్లిదండ్రుల గుణాలే పిల్లలకు వస్తాయనుకుంది లక్ష్మి కోపంగా.

అన్నగారి మనస్తత్వం గుర్తించిన శివరాం తనకు తాతయ్య యిచ్చిన ఆస్తిమీద ఏమీ మమకారం లేదనీ, దూరంగా వుంటూండడంవల్ల తనేమీ ఉపయోగించుకోలేననీ, ఆస్తి అంతా తానే నిర్వహించుకుంటూ, కుటుంబానికి ఉపయోగించుకోమని నిస్వార్థంగా చెప్పేశాడు శివరాం. పిల్లలుగల అన్నగారికి, ఒంటరి తమ్ముడుగా ఆమాత్రం సహాయం చెయ్యడం తన విద్యుక్తధర్మమనుకున్నాడు శివరాం. తమ్ముడి మాటలకు తాత్కాలికంగా ఆనందంగా నవ్వి వెంకటేశ్వర్లు కుటుంబంతో కదిలిపోయేడు. కుత్సిత మనుష్యుల బ్రతుకులు ఎంత ఆస్తి ఉన్నా కుములుతూనే బ్రతుకుతాయని శపించింది లక్ష్మి పెద్దన్న ప్రవర్తన చూశాక. శివరాం తేలిగ్గా నవ్వేశాడు.



చిత్రం: సి. రాధ, హైదరాబాదు.

దీక్షితులు బలవంతంమీద శివరాం మరో రెండురోజులు ఆగాడు. చెల్లెలుకు బావగారికి సుందర్ ఉషలకు పాత్రుడికీ తనతో తెచ్చిన క్రొత్తబట్టలు బహుమతులుగా తెచ్చి యిచ్చాడు. సూర్యారావు కూడా శివరాంతో సగౌరవంగా మాట్లాడుతూ బ్రహ్మయ్యగారి మనుమడొచ్చాడని పుకారుతో గుసగుసలాడుకుంటున్న పొరుగింటివారిని పిలిచి, అతన్ని పరిచయంచేసి ఆనందించేవారు.

రాత్రి భోజనాలు చేశాక తీరుబడి సమయాల్లో శివరాం తాను గీసిన చిత్రాలు బావకు చెల్లెలుకు చూపిస్తూ పిల్లలతో నవ్వుతూ ఆనందిస్తోంటే, అద్దెకున్న పంచాయితీబోర్డు గుమాస్తాగారి భార్య లక్ష్మి వదిగి కిటికీలోంచి తన వైపు చూస్తున్న గుమాస్తా భార్య పిల్లికళ్లు మిణుగురు పురుగుల్లా మెరుస్తున్నట్లు కనిపించేవి శివరాంకు. గుమాస్తా భార్య తన భర్తను పిలిచి శివరాం బొమ్మలు చూపించి, తాను పొగిడి, మాటలు కల్పించుకొని శివరాంను పలకరించి సంతృప్తిపడేది. సుందర్ ఉషలు బలవంతంగా లాక్కున్నారు శివరాంనుంచి.

చెల్లెలును, బావను, సికింద్రాబాదు రమ్మని ఆహ్వానించాడు శివరాం. పల్లెటూళ్లోకంటె నగరంలో సర్వసౌఖ్యాలతో పురుడు పోసుకోవచ్చని తొమ్మిదవ నెల రాగానే భర్తతో సికింద్రాబాదు వస్తానంది లక్ష్మి. భార్యను చూసి నవ్వుతూ అంగీకరించాడు దీక్షితులు.

బ్రహ్మయ్యగారు మరణసమయంలో అన్న మాటలు నివేదించింది లక్ష్మి. శివరాం మౌనంగా నవ్వి తలదాచుకున్నాడు.

'కులంలో ఏముంది? కులంకన్న గుణం ప్రధానం!' అంది లక్ష్మి.

పురాతన కట్టుబాట్లలో, సంప్రదాయాలలో క్రమశిక్షణపొందిన బ్రహ్మయ్యగారి మనస్సు తర్కించి తర్కించి చివరకు సద్దుకుని, కుల విభేదాలు విస్మరించి సంబంధ బాంధవ్యాలు ఏర్పరచుకోవచ్చనే నమ్మకం కలిగి, ఆధునిక దృక్పథానికి ఒక అడుగు దగ్గర చేశారు. మానవులంతా ఒకటే అయినప్పుడు, కులంలాంటి మతాలనుకూడా విస్మ

# ఆన్వేషణ

...స్తి వచ్చిన నష్టమేమీ లేదని శివరాం విశ్వసించాడు. బ్రహ్మయ్యగారు మరోవిధంగా కుల మత భేదాలు విస్మరించవచ్చునన్నట్లే భావించాడు శివరాం. చెల్లెలన్న మాటలు కూడా తన భావాల కనుగుణ్యమే అనిపించింది శివరాంకు.

శివరాం జట్కా ఎక్కుతూంటే సూర్యారావుగారి కుటుంబమంతా వీధిలో నిలుచుని, ఆప్యాయంగా వీడ్కోలిచ్చారు. పొరుగింటి అమ్మలక్కలు పెళ్ళికొడుకు హోదాలో ఉన్న శివరాంను పరిశీలించి తొంగిచూశారు. దీక్షితులు బావమరిదిని కూడా స్టేషనుదాకా తీసుకువెళ్ళి రైలు ఎక్కించి పొత్తుకున్న హృదయాలు చీలినట్లు బాధపడుతూ గృహోన్ముఖుడైనాడు.

## 17

రాణి, కామేశ్వరమ్మ యింటిముందు రిక్షాలో దిగారు. వరండాలో చంద్రప్రభ మరో యిద్దరి కాలేజీ అమ్మాయిలతో కూర్చుని కాగితాలు చదువుతోంది బిగ్గరగా అభినయిస్తూ. తల్లిని రాణిని చూసి అల్లరిగా గెంతుతూ ఆగినరిక్షా ఎదుటకు వచ్చింది.

'లతా! నీ గదిలోకి నడు...చిన్న పనుంది!' చంద్రప్రభ స్నేహితులను పిలిచింది.

'ఈమె పద్మ. ఈమె రాజ్యం!' తన స్నేహితులను పరిచయంచేసింది చంద్రప్రభ. పరస్పర అభివందనాలు చేసుకొని నవ్వుకుంటూ రాణిగదిలోకి నడిచారు అంతా.

"లతా!...ఈ వేళ నువ్వు నాకు ప్రేమించడం నేర్పాలి!"

చంద్రప్రభ నవ్వింది.

రాణి ఆశ్చర్యపోయింది.

రాజ్యం, పద్మ నవ్వు పెదాల్లో అదుపుకుంటున్నారు.

'నాకు ప్రేమ అంటే తెలియదు... నేనెవ్వరిని ప్రేమించలేదు!' కోపంగా ముఖం పెట్టింది రాణి.

'పంతులమ్మకు పాఠాలు చెప్పడం సులువేగా!'...

చంద్రప్రభ పకపక నవ్వింది. ఆమె వ్యంగ్యధోరణి అంతం చెయ్యాలనుకొంది రాజ్యం.

"ఏమీ లేదండి!...మా కాలేజీలో ఆడవాళ్ళం నాటకం వేస్తున్నాం ... చంద్రప్రభ రాజకుమార్తె పాత్ర వేస్తుంది ... నేను రాజకుమారుడిగా నటిస్తాను. ఆమె నన్ను ప్రేమిస్తుంది ... విరహంతో తపిస్తుంది. ఇద్దరం కలుసుకుంటాం ఒక ఉద్యానవనములో ... ఆ ఘట్టం ఎలా ఆడాలో కొంచెం చెప్పాలి"

'రాజకుమారుడి స్నేహితుడిగా నాకు ప్రేమ ఘట్టంలో నేను రాయబారిగా ప

చేస్తాను...వారి ప్రేమచూసి నేను ఒంటరిగా ఏదో ఊహాసుందరిని తలుస్తూ తపిస్తాను... నాకు కూడా చెప్పాలి. ఏలా నటించాలో!" పద్మ రాణిదగ్గఱ చేరింది.

'రాజకుమారా...నీ అందం చూస్తూంటే ఒళ్ళు పులకరిస్తోంది...ఆనందానుభూతిలో మైమరచిపోతున్నా...నా హృదయరాజ్యం వశం చేసుకొని ఏలుకో!' చంద్రప్రభ రాజకుమార్తెగా తన మాటలు చదివి రాణిని నటించమంది.

భుజంగరెడ్డికి వచ్చిన ఆకాశరామన్న ఉత్తరాల సంగతి తండ్రి ద్వారా తెలుసుకొని చంద్రప్రభ తన్ను నటన నేర్చుమని పరీక్షగా నిర్బంధిస్తోందేమో అనుకుంది రాణి. ప్రేమ నటించడం కష్టం, అనుభూతి పొంది ఆనందించాలి. అంతే!" నవ్వుతూ ఊరుకొంది రాణి.

'అమ్మతో సభలకు వెళ్ళి ఉపన్యాసాలు నేర్చుకుంటున్న సంగతి నాకు తెలుసు... ప్రత్యేకం చెప్పనక్కర్లేదు...యీ మాటలు నటిస్తూ ఏలా అనాలో చెబుతావా లేదా?' చంద్రప్రభ కోపంగా మూతి ముడుచుకూర్చుంది.

'రాజకుమార్తెకు కోపం తెప్పించకండి!' పద్మ నవ్వింది.

'అవును...నా రాజకుమార్తెకు కోపం వస్తే, నాకేభావం రావాలండీ!' రాజ్యం ప్రశ్నించింది చిలిపిగా.

అందరూ నవ్వారు.

ముఖంతుడుచుకుంటున్న తువ్వాలు మంచంమీద గిరవాటేసింది. రంగస్థలంలో, రాజ్యం, చంద్రప్రభ నిలుచోవలసిన విధం బోధించింది మొదట రాణి. తర్వాత వారిపాత్రల సంభాషణలు చదువుతూ అభినయిస్తూ చూపింది.

ఇద్దరు స్త్రీలు భార్యాభర్తల ధోరణిలో ప్రేమించుకుంటున్న ఘట్టం వాస్తవంగా చూస్తున్న పద్మ అల్లరిగా యీలవేసి కేరింతలు కొట్టింది.

పాత్రల సంభాషణలు సరిగా తాను నటించలేక పోయినట్లు మనస్సులో అసంతృప్తిపడింది రాణి. జీవితంలో నిజమైన అనురాగం, చవిచూడని తనకు ప్రేమానుభూతి ఉవ్వెత్తుగా ఏవిధంగా వస్తుంది?... కాలం గడచినకొలది సంవత్సరాలు మోడైన చెట్టుకొమ్మల్లా బోడిగా జరుగుతున్నాయే గాని, చిగురుటాకుల ప్రేమైక జీవనం ఏర్పడి ఆనందం కలగటం లేదు. జీవితంలో తెలివితక్కువవల్ల చేసిన ఒక్క పొరపాటు జీవితాన్నే నాశనం చేసింది. సంఘర్షణ కలిగించే మనోభావాలతో హృదయమే ఛిద్రమైపోతోంది. ఉబికివచ్చే దుఃఖం ఆపుకోలేక మంచినీళ్ళు త్రాగాలనే నెపంతో వంటింట్లో దొరబడి మనస్ఫూర్తిగా ఏడ్చి, ముఖం కడుక్కొని ముందు గదిలోకి వచ్చింది రాణి.

చంద్రప్రభ, రాజ్యం, పద్మ తమరంగంలో లీనమయి సంభాషణలు చదివేస్తున్నారు తీవ్రంగా. నవ్వుతూ ముందుకువచ్చి చంద్రప్రభ వైపు సొగసుగా చూసింది రాణి.

'రాజకుమార్తెలో పెళ్ళికళ ఏర్పడిందే అప్పుడే!' నవ్వింది రాణి.

తను నాటకానికి తప్పక రమ్మని,రాజ్యం, పద్మ, కామేశ్వరమ్మకు, రాణికి ఆహ్వానమిచ్చి వెళ్ళిపోయారు.

చంద్రప్రభ కాగితాల దొంతరలో ఒక కార్డుబోర్డు ఫైలు తెచ్చింది.

'నేనోక తమాషా చూపించనా?' చంద్రప్రభ నవ్వుతూ ఫైలు చేతులతో వెనక దాచింది.

'ఏమిటిది...కాబోయేభర్తఫోటోగదూ!' నవ్వింది రాణి.

'ఆ!...నీ కెప్పుడూ ఆ ధోరణే!' మూతి ముడుచుకొని ఫైలు తెరచింది చంద్రప్రభ.

వివిధ పత్రికలలో ప్రచురించబడిన శివరాం గీచిన చిత్రాలు, కత్తిరించి వున్నాయి అందులో. అఖిలభారత చిత్రలేఖన ప్రదర్శనలో ప్రథమబహుమతి లభించినపుడు పత్రికలు ప్రకటించిన అతని ఫోటో, జీవిత సంగ్రహం 'పేదస్వరాలు' చిత్రం కూడా కత్తిరించబడి అందులో చేర్చబడ్డాయి.

ఆ పత్రికలన్నీ రాణి చంద్రప్రభ చదువుకున్నా చంద్రప్రభ వాటి నన్నిటినీ కత్తిరించి ప్రత్యేకత ఆపాదిస్తూ ఒక ఫైలు తయారుచెయ్యడంలోని వింత రాణికి అర్థం కాలేదు.

'ఇవన్నీ ఎందుకు సేకరించానో తెలుసా... నేను చిత్రాలు గీస్తున్నాను...ప్రఖ్యాత చిత్రకారుల బొమ్మలు అందుకే కత్తిరించాను' అంటూ చంద్రప్రభ తెల్లకాగితం మీద పెన్సిలుతో ఏదో బొమ్మ గీయడం మొదలుపెట్టింది.

'చిత్రకళలో వున్న గొప్పతనం వర్ణనాతీతం!' అంటూ గీసిన బొమ్మ చూపింది.

ఆ గీసిన బొమ్మలో పందికి, కుక్కకూ ఉన్న పోలికలన్నీ మిళితమైపోయాయి.

'దీని పేరు!' అడిగింది రాణి.

'జంతువు.'

ఇద్దరూ పకపక నవ్వుకున్నారు.

'ఏలా ఉన్నాడీ చిత్రకారుడు......!' అంటూ శివరాం ఫోటోలోని విశాలవదనం మీద పంగనామం పెట్టింది చంద్రప్రభ.

'తప్పు! ఫోటోలను అవమానపరచకూడదు!' నవ్వింది రాణి స్వయం ఉద్రేకాలు అణచుకుంటూ 'చాలా మంచివాడట... ఎన్ని అవమానాలైనా భరించగలడు!'

(46 వ పేజీచూడండి)

"చంద్రా!

నీవు వ్రాసిన వుత్తరం అందినది. నీవూ మీ శ్రీవారు ఆనందంగా వున్నందుకు చాలా సంతోషము. నీవు సంక్రాంతికి తప్పక అమ్మగారింటికి వస్తావనీ, నన్ను కూడా అక్కడే కలుసుకోని మన చిన్ననాటి స్నేహితురాండ్రందరితోనూ సరదాగా కాలక్షేపం చేద్దామని వుందనీ ఎంతో వుత్సాహంగా వ్రాసేవు. కాని చంద్రా! పండుగరోజుల్లో తెలపట్టినప్పటినుంచీ ఎంతో హుషారుగా వుండే నాకు, ఈ సంవత్సరం పండుగకు పుట్టింటికి వెళ్ళకుండా వుంటేనే మంచిదని తోస్తావుంది. కాని తప్పదు. నా వివాహమైన తరువాత ఇదే మొదటి సంక్రాంతి. కనుక వెళ్ళక తప్పదు. కాని మావారికి పండుగ రోజుల్లోనే ఏదో ఆఫీసులో ఇన్స్పెక్షను అంటున్నారు. ఏమి ఆఫీసులో, ఇన్స్పెక్షనులో! నాకు జీవితమే ఒక పరీక్షగా వుంది. మా దాంపత్యంగురించి నేనేమి కలలుగన్నానో అవన్నీ కల్లలుగానే అనిపిస్తున్నవి. ఆరుమాసాల ఈ నా దాంపత్య జీవితంలో నేను తెలుసుకున్నది నీకు వుత్తరాల ద్వారా వ్రాయజాలను. కాని ఒక్కటి మాత్రం నిజం. పైకి నవ్వుగా వున్నదంతా దిగి వూబిలో దించుకుపోయేను. దినదినం నాకొక గండంగా, మనసులో రంపపుకోతగా బ్రతుకుతున్నాను. చంద్రా! నీకు చెప్పవలసిన సంగతులు ఎన్నో వున్నవి. నీ సలహా ఇప్పుడు నాకెంతో అవసరం. నీవు మీ శ్రీవారికి ఈ విషయాలేమీ చెప్పకుండా ఒక్కసారి నన్ను చూడాలని వుందని చెప్పి రావాలి. కూడా మీ చిన్న మరదిని తోడు తెచ్చుకో. ఒకటి రెండు రోజుల్లో వెళ్ళిపోవచ్చు, తప్పక వస్తావుకదూ!

ఇట్లు, నీ కాంతి.

ఈ ఉత్తరం చదువుతున్న చంద్రావతి భారంగా నిట్టూర్పు విడిచి వుత్తరాన్ని మడిచి డ్రాయరులో పెట్టింది. ఆమెకు తన చిన్ననాటి స్నేహితురాలు కాంతిని గూర్చిన కొన్ని మధుర సంఘటనలు మనసులో మెదలజొచ్చాయి.

'చెప్పవే కాంతా! రాత్రి ఏం జరిగిందో మొదటినుంచీ వివరంగా చెప్పవే."

"పోవే! వివరంగా చెప్పాలిట. తొందరపడకు. నీ పెళ్ళి పదిరోజులేగా వుంది."

"అదే నేనూ చెబుతాంట. నీ అనుభవాలు చెప్తే."...

"ఆ! చెప్తే...?"

"నేనూ నేర్చుకుందామని"

కాంతి కిలకిలా నవ్వింది.

"చెప్పవుటే" దీనంగా ముఖం పెట్టి, గోముగా కళ్ళల్లో కళ్ళు కలుపుతూ అడిగింది తాను.

'ఏమని చెప్పమంటావు? నాకు సిగ్గుగా వుందే" గతరాత్రి మధురస్మృతులు మనసులో [illegible] పులకరించిన మేనును ఒకసారి విదిలించుకుని మత్తెక్కిన సోగకన్నులను క్రిందికి దించుకుంది కాంత.

"అంతేనా మరి! నీ అనుభవాలు నాకు, నా అనుభవాలు నీకు చెప్పాలని ఒకరికొకరు చేసుకున్న వాగ్దానం మరచిపోయేవా? మన స్నేహానికి గుర్తుగా, ఎప్పుడూ విడిపోని జంటగా వుండేమనం విడిపోవలసిన రోజు వచ్చేక, ఆరోజున జరిగిన సంఘటనలు ఒకరికొకరు చెప్పుకోవాలని చేసుకున్న వాగ్దానం జ్ఞాపకం తెచ్చుకో! నాకే ముందుగా వివాహం అయివుంటే నా అనుభవాలు నీకు చెప్పివుండేదానినే గా!" నిష్ఠూరంగా అన్నది తాను.

"కోపగించుకోకు చంద్రా! మన ఇద్దరి మధ్య రహస్యాలు లేవు. కాని అన్నీ చెప్పమంటే ఎలా?"

"పోవే! నీవు మరీను. పోనీ నే నే మొదలు పెడతాలే. ఘుమ ఘుమలాడే మైసూరు అగరువత్తులు సువాసనలను నాలుగు వైపులా వెదజల్లుతున్నాయి. మంచం పందిరికి కట్టిన మల్లెదండలు ముసిముసి నవ్వులు చిలకరిస్తున్నాయి. గదిలో చల్లబడిన పన్నీటి వాసన, టేబులుఫాన్ ఇచ్చేగాలిలో కలసి నాసికారంధ్రాలతో దోబూచులాడుతున్నాయి. ముడతలు లేకుండా పట్టెమంచంపై పరచబడిన తెల్లని దుప్పటి మీద ఉన్న తెల్లని మల్లెలు మనసులో మధురమైన కోర్కెలు రేపుతున్నాయి. మా ఇద్దరకూ ఆఖరిసారిగా ఒకరితో మరొకరికి సెంటు వ్రాయించి పేరంటాళ్ళంతా కిలకిల నవ్వులతో గలగల గాజుల చప్పుడుతో బైటికి వచ్చి గదితలుపు బైట గొళ్ళెం పెట్టేరు. తరువాత ఏమైంది?"

"మీరంతా వెళ్ళిపోగానే నా కాళ్ళు భయంతో గజగజ వణికేయి. నీ వన్న మల్లెలు, అత్తరులు మనసులో తీయని కోర్కెలు రేపుతున్నా, భయంతో గుండెలు గంతులు వేసేయి. టేబులుపై నున్న లడ్డూ మిఠాయిలు నన్ను చూచి ఎగతాళి చేస్తున్నట్లు అనిపించేయి. బైట సద్దు అణగిపోగానే మావారు తలుపుదగ్గరగా నిలచిన నా వద్దకు వచ్చేరు. ముఖంవైపు చూడాలని కోరికగా వున్నా భయంవల్ల నాతల పైకి లేవలేదు. అలాగే రెండు మూడు సార్లు వారు కిటికీవద్దకూ, ద్వారం వద్దకూ వచ్చి ఏమేమో చేసేరు.

"అదేలే! ఏమైనా కన్నాలు వున్నవేమో, వాటివద్ద ఎవరైనా వున్నారేమోనని చూచి ఉంటారు: తరువాత?"

"తరువాత నా చేత మాట్లాడించాలని వారుచేసిన ప్రయత్నాలన్నీ వృథా అయ్యేయి. ఇంకేం చేయాలో తోచక కాబోలు 'మీ వూరిలో ఆడవాళ్ళకు కూడా మీసాలు వస్తాయా?' అన్నారు. నా గుండెలు గుభేలు మన్నాయి. ఎందుకంటే నా ఎర్రని ముఖం మీద సెంటు వ్రాసే నెపంతో మసి నాని పూసేరేమోనని వులిక్కిపడి వంచిన తల ఎత్తి వారి ముఖంలోనికి చూచేను. ఆ ఎర్రని గుండ్రని అద్దంలాంటి వారి ముఖంలో, మనసులోని కోరికలు ప్రతిబింబిస్తున్నట్లు తోచింది. నేను చూడగానే వారికళ్ళు మిలమిల మెరసి ఆనందంతో చిందులు త్రొక్కుతున్నట్లు తోచింది. నేను క్రిందికి చూస్తే ఆ కళ్ళలోని ఆనందం తగ్గిపోతుందేమో అన్నట్లుగా, నా చూపుల్ని మళ్ళించుకోలేకపోయేను. అదే




అప



# మూరి హా శెట్టి లు

అదనుగా చూచికొబోలు వారు నావెనుకగా చేతులు వేసి మెమ్మదిగా దగ్గరకు తీసుకుంటూ భయపడుతున్న నాపై, తియ్యని చిరునవ్వును విసిరేరు."

శాంత అంతవరకూ చెప్పి వూరుకుంది. అయితే తాను వూరుకోలేదు.

"తరువాత ?"

"ఆ! తరువాత ?" చిలిపిగా వెక్కిరించి తన నెత్తిపై మృదువుగా మొట్టింది. అయినా తాను విడిచిపెట్టలేదు.

"చెప్పవే! తరువాత ఏంజరిగిందో ను

'ఎలా చెప్పమంటావే! శారీరకంగాను మానసికంగాను కలిగిన అనుభూతుల్ని, మాటల్లోనికి మార్చాలంటే మాటలాకి' అంది శాంత. అప్పుడు తాను కిలకిలా నవ్వింది. ఆపుకోలేక పకపకానవ్వింది. ఆమధురఘట్టం జ్ఞప్తికిరావడంతో ఇప్పుడుకూడ మరోసారి నవ్వలేకుండా వుండలేకపోయింది చంద్రావతి.

"ఏమిటే వదినా! ఒక్కర్తెవూ అలా నవ్వుకుంటున్నావు" అంటూవచ్చేడు ఆమె మరది పొర్తఫారం చదువుతున్న శేఖరం.

"ఏం లేదు లేవోయ్" అంది చంద్రావతి ఇంకా నవ్వుతూనే.

"ఏమీ లేకుండా నవ్వుతారా ఎవరైనా ! చెప్పు వదినా అదేమిటో. నేనుకూడ కొంచెం నవ్వుతాలే"అంటూ హిహిహి అన్నాడు శేఖరం.

"ఏంలేదుగాని, భోజనం పెడతా! రా! మళ్ళీ నువ్వాలుకు టైము అయిపోతుంది."

"అయితే అవుతుంది. నీవెందుకు నవ్వేవో చెప్పాలి..."అన్నాడు.

"పూరికేనే నోయ్"

"వదినా! పూరికే నవ్వేవాళ్లు ఎవరో తెలుసా ?"

"ఎవ్వరు ?"

"పిచ్చివాళ్లు" హి హి హి అని మళ్లీ నవ్వేడు.

"అబ్బబ్బ! చాలేవోయ్! అన్నగారి బుద్ధులు తమ్ముడికి లేకుండావుంటాయా. తమ్ముడివేగా నీవు" అంది చంద్రావతి నవ్వుతూ ;

"మా అన్నలాంటి మంచివాళ్లెవరూ లేరు వదినా."

"కాదని ఎవరన్నారు ?"

"అయితే నేనూ మంచివాడి నేగా""

"చాలు లేవోయ్. లాయర్ లా ప్రశ్నలపై ప్రశ్నలు వేసి నీకు కావలసిన జవాబు రాబట్టుకోవాలని చూస్తావు."

"లాయర్ లా అంటావేమిటే వదినా! నేను కాబోయే లాయర్ని."

"ఔను. మీ అన్న డాక్టరయ్యేరు. నీవు లాయరవ్వు. ఇంట్లో ఒకప్రక్క రోగులు, మరోప్రక్క క్లయింట్లూ వస్తూవుంటారు.

"ఏమిటోయ్ క్లయింట్లుఅంటున్నావ్ ?" అంటూ వచ్చేడు డాక్టరు శంకరం.

అన్నగారిని చూడగానే పిల్లిలా వంటగదిలోనికి జారుకున్నాడు శేఖరం."లాయరుగారూ! వంటగదిలో మీ కేంపని" అంది చంద్రావతి నవ్వుతూ !

'ఎవరూ' అన్నాడు శంకరం.

"మీ తమ్ముడు లాయరవుతాట్ట"

"ఎందుకు కాకూడదూ! వాడికి ఆ వుద్దేశంవుంటే తప్పక అలాగే అవుతాడు" అన్నాడు నవ్వుతూ శంకరం.

"వదినా!" అని శేఖరం పిలవడంతో వంటగదిలోనికి వెళ్ళి అన్నంవడ్డించి మళ్ళీ వచ్చింది చంద్రావతి. ఈ లోపున శంకరం బట్టలు మార్చుకుని ఈజీచెయిర్ లో కూచున్నాడు.

"ఏకుంది"

"ఎందుకండీ"

"అదిగో మొండట్లోనే కళ్లాకోళ్ళం",

"పోనీ చివర అడతాలే"

"చెప్పేది వినరూ"

# లు రహస్యం



# అసలు రహస్యం



"చెబుతారూ"

"నేనువెళ్ళి కాంతను చూచిరావడానికి మీ పర్మిషను కావాలి"

"ఏ కాంతా?"

"మీకు ఇంత మతిమరపు అయితే పేషంట్లకు మందు లెలా ఇస్తున్నారో తెలీదు. కాంత నా చిన్ననాటి స్నేహితురాలనీ, దాని సంగతులు ప్రతిరోజూ మీకు చెబుతూ నేవున్నా. కాంత ఎవరూ అని నన్నడిగితే ఏం చెప్పనుంటారు?"

"ఓహో! మీ కాంతా! అస్తమానూ "మా కాంత, మా కాంత" అనేదానివి ఇప్పుడు వట్టి కాంత అంటే ఎవరో అనుకున్నాలే. అసలు ఆవిడ పేరు 'మాకాంత' అనే నేనిన్నాళ్ళు అనుకున్నాను."

"పోదురూ! పోనీ— మా కాంతను చూడడానికి వెళ్ళాలనివుందండీ."

"వెళ్ళండీ"

"వేళాకోళం కాదు. సీరియస్ గానే సుమా అడుగుతూంట?"

"ఏం! అంత అర్జంటుగా ఎందుకు?"

"ఏమోనండీ! అది చాలా బాధల్లో వున్నట్లుగా తోస్తూవుంది. వివరా లేమీ వ్రాయలేదు. కాని మీ పర్మిషను తీసుకుని నన్ను ఒక్కసారి రమ్మనికోరింది. అక్క చెల్లెళ్లలా పుట్టినప్పటి నుంచి ఒక్కచోట పెరిగాం. ఎందుకో అది ఈనాడు కష్టాల్లో వుందంటే నామనసు బాధగావుంది" అని మనసులోని బాధను ముఖంలో వ్యక్తం చేసింది.

"ఆగు! ఆగు! ఇంకా ఈ సంభాషణ సాగనిస్తే నా ఎదురుగానే ఏడ్చేటట్లుగా వున్నావు" అన్నాడు శంకరం.

"ఔనండి ఏమి చేయమంటారు? మా హృదయాలు అంత దయాపూరితాలు. ఇతరుల బాధను చూస్తే సహించలేవు. మీకు అది వేళాకోళంగా వుంది."

"వేళాకోళం కాదు చంద్రా! నీలాంటి మనసే నాకూ వుంటే ఏమయ్యేదో భగవంతుడా! అనుకుంటున్నాను. అంతే"

"అదేమిటండీ. జాలి మనసు, ఇతరుల బాధలను చూచి సహించలేని మంచిమనసూ వుంటే చెరుపా?"

"నాలాంటివాడికి చెరుపే"

"ఏం?"

"ఈ డాక్టరు వుద్యోగంలో అలాంటి దయాహృదయముంటే ఏమీ జరుగదు. ఆపరేషన్లు చేసేటప్పుడు అరె వీడి పొట్టకోసి వేస్తున్నామే, వాడి కాలు తీసివేస్తున్నామే, అనుకుంటే మేము ఏమిపనులు చేయగలం?"

"అబ్బబ్బ! అలాంటిమాటలు చెప్పకండి' ఇంతకూ మీది చాలా కఠిన హృదయమని మీరు చెబుతున్నారు"

"అది తెలిసిన విషయంలే! ఇంటిలో వున్నప్పుడు నన్ను నీవు మార్చివేస్తున్నావుగా"

"నేను మార్చడమేమిటండోయ్?"

"ఇప్పుడు చూడు. నీ ముఖంలో విచారరేఖలు అలుముకోవడంతోనే నా మనసు కరిగిపోయింది"

"అంటే నేను రాకముందు మీరు చాలా కఠినులన్నమాట"

"కాదులే"

"కాదులే ఏమిటి? నిజమే వదినా. నీవు రాకముందు నన్ను చావగొట్టేవాడుమా అన్నయ్య. నీవు వచ్చాక మనసుమారింది కాబోలును. ఇప్పుడు కొట్టడం లేదులే. టాటా!" అంటూ సైకిలుమీద కూర్చుని మెట్టుపై కాలు ఆని నిలచిన శేఖరం, కాలుతో సైకిలును ఒక్క త్రోపుత్రోసి ముందుకు సాగిపోయేడు.

శంకరం, చంద్రావతి నవ్వుకున్నారు.

* * *

అనుకున్న ప్రకారం శేఖరాన్ని తీసుకుని మిత్రురాలు కాంత ఇంటికివచ్చింది చంద్రావతి. చంద్రావతి వెళ్ళేసరికి కాంత ఈజీ చెయిర్ లో కూర్చుని ఏవో దీర్ఘంగా ఆలోచిస్తున్నట్లు కూర్చునివుంది. రేడియో తగ్గుస్థాయిలో ఏదో హిందీపాటను వినిపిస్తూ వుంది. చంద్రావతిని చూడగానే కాంత హృదయం ఆనందంతో పరవళ్లుత్రొక్కుతున్నట్టుగా ముఖంలో స్పష్టంగా తెలుస్తూవుంది. ఎదురుగావచ్చి గట్టిగా కౌగలించుకుంది

"వచ్చేవా చంద్రా! రావేమో అనుకున్నాను."

"రావని ఎందుకనుకున్నావు?"

"మన ఇష్టం కాదుగా. ఇప్పుడు మనం పరాధీనలం."

"అయినా మీ బావగారు నాయిష్టానికి వ్యతిరేకంగా నడవరులే."

"అదృష్టవంతురాలవు చంద్రా! మతిలేని దాన్ని. నిలబెట్టే మాట్లాడుతున్నాను. రా! కూర్చో. ఈ అబ్బాయి మీ మరది కాదూ."

"ఔను"

"రా నాయనా! కూర్చో. కూల్ డ్రింకు కావాలా?"

"అక్కరలేదండి"

రేడియోట్యూన్ పెద్దదిచేసి, ఫేన్ ఆన్ చేసి లోపలకు వెళ్ళింది కాంత. ఇంటిలో ఎక్కడచూచినా ఖరీదైనవస్తువులు గోచరిస్తున్నాయి. లక్ష్మి తాండవిస్తోందా ఇంటిలో. అయినా కాంతకు మనశ్శాంతి ఎందుకులేదో చంద్రావతికి అర్థంకాలేదు. కాంత చాలా చిక్కిపోయింది. ముఖం పాలిపోయినట్లు వుంది. అయినా దానికి కారణం మరొకటి కూడ కావచ్చు. కాని ఆమె ఎందుకో బాధపడుతున్నట్లు స్పష్టంగా తెలుస్తూనే వుంది. వారి దాంపత్యంలో ఏదో లోపం వుండవచ్చు. ఆ లోపాన్ని ఎలా సరిచేయాలి? కాంత జీవితంలో ఆనందం ఎలా కలిగించాలి? అనే ఆలోచనల్లో మునిగింది చంద్రావతి.

ఒక ట్రేలో రెండుకప్పుల కాఫీ. రెండు వెండిప్లేట్లలో బ్రెడ్, జామ్, బటర్ తీసుకువచ్చి ముందు పెట్టింది కాంత. 'ఇంతత్వరగా కాఫీ ఎలా తయారయింది? మేం వస్తామని కలగని ముందుగానే ఏ ఫ్లాస్కులోనో పోసి వుంచేవా?

"మీరువస్తారని నాకునమ్మకంలేదు. ఎందుకంటే మీ డాక్టరుగారు పర్మిషను ఇవ్వరని నా భయం. ఏదో మనసులో బాధకొలదీ రమ్మని వ్రాసేనేగాని, తీరా వ్రాసేక ఎందుకు వ్రాసేనా అని బాధపడ్డాను. ఇంతకూ కాఫీ ఫ్లాస్కులో పోసింది, వారు వచ్చే వేళ కావస్తోంది. వారికని ఫ్లాస్కులో పోసి వుంచేను."

"మరి రెండు కప్పులు వుందే?"

కాంత సన్నగా నవ్వింది.

"రెండవకప్పు నాకోరకు. వారి ఎదురుగా నేనుకూడ త్రాగితేగాని వారు త్రాగరు."

సిగ్గుతో తలవంచుకుంది. ఆ ముఖంలో ఏవో మధురభావాలు మెలిగి క్షణంలోమాయమైపోయేయి.

"అన్నీ బాగానేవున్నాయి కాని..."

---

ఒక మేష్టారికి ఒకసారి ఒక ఉత్తరం వచ్చింది. తెరచి చూస్తే అందులో ఫూల్ అని వ్రాసివుంది. మరేమి లేదు.

మరునాడు క్లాసులో మేష్టారు ఇలా అన్నారు. "మామూలుగా నాకు తెలిసినంతవరకు కొన్ని ఉత్తరాలలో విషయాలు వ్రాసి సంతకం మర్చిపోతూఉంటారు. కాని నాకు నిన్న ఒక ఉత్తరం వచ్చింది. ఎవడో కుర్రాడు పాపం! విషయాలు వ్రాయటం మర్చిపోయి సంతకంమాత్రం చేసిపంపాడు." ★

ఎస్. ఎ. హబీబ్.

శాంతను వద్దని వాదించింది చంద్రావతి. మరదిని మాపించి. తరువాత మాట్లాడుకో వచ్చునని సంజ్ఞ చేసింది. టిఫిను చేయటంలో నిమగ్నుడైన శేఖరం ఇదేమీ గమనించలేదు. కాఫీ ఫలహారాల అనంతరం శేఖరం బెడ్రూములోనికి వెళ్ళేడు. ఇంతలో మోటార్ సైకిలు ఇంటి ముందు ఆగినచప్పుడయింది.

"ఎవరు?" అంది చంద్రావతి.

"మీ మరదిగారు"

"దానిని ఎప్పుడు కొన్నారు?"

"ఈ మధ్యనే"

"వ్యాపారంలో మంచిలాభాలు వస్తున్నట్లున్నాయి."

"అవునండి. మా శాంతి వచ్చినప్పటినుంచి మాకు మంచిలాభాలు వస్తున్నాయి. మీరు ఎప్పుడు వచ్చేరు?"

నవ్వుతూ ప్రవేశించాడు సత్యదేవ్. చంద్రావతి లేచినుంచుంది శాంతతో బాటు.

'కూర్చోండి. కూర్చోండి. నేనుకూడ కూర్చుంటున్నాను" అంటూ కుర్చీలో కూర్చున్నాడు.

"కూర్చో శాంతా! మీరుకూడ కూర్చోండి" అన్నాడు చంద్రావతి నుద్దేశించి. కాని చంద్రావతి కొంచెం బిడియపడింది.

'మీరు కూర్చోవాలి. లేకపోతే నేను వాకిలిలోనికి వెళ్ళిపోతాను. చదువుకున్న మీరుకూడ సిగ్గుపడితే ఎలా?" చిరునవ్వు నవ్వేడు. చంద్రావతి అతని ముఖంలోనికి ఒకసారిచూచి నవ్వుతూ మరో కుర్చీలో కూర్చుంది.

'ఇప్పుడు చెప్పండి. మా డాక్టరు అన్నగారు వచ్చేరా?"

"లేదండి. వారికి పేషెంట్లతోనే సరిపోతుంది."

"అవునండి, ఏదో వ్యాపకంలో ప్రవేశించక కాళీగా వుంటేను. శాంతకూడ మిమ్మల్ని చూడాలనివుందని ఒక్కసారి తీసుకువెళ్ళమని అడుగుతూనేవుంది. కాని నాకు కాళీలేకపోతోంది. పోనీ తననే వెళ్ళమంటే వెళ్ళదు. రెండురోజులు లక్ష్మిచేత క్యారియరు తెప్పించుకుతింటానంటే వినదు."

శాంతి ఎందుకో నావైపు బాధగాచూచి నవ్వలేక నవ్వింది.

"సరే మీరు ఇప్పుడే వచ్చినట్టున్నారు. విశ్రాంతి తీసుకోండి. శాంతా! నేను స్నానంచేసి క్లబ్బుకు వెళ్ళిపోతాను. మీ ఫ్రెండ్సు ఇద్దరూ సినీమాకు వెళితే వెళ్ళండి" అంటూ కుర్చీలోనుంచి లేచి "లక్ష్మి! స్నానానికి నీళ్ళుపెట్టు" అంటూ గట్టిగా కేకవేసేడు.

"లక్ష్మి ఇంకారాలేదండి! నేనేపెడతా"

# తిరిగి ఆశ్చర్యముగాపూర్తి స్వస్థత చేకూరుతుంది !



పిల్ ఫర్ - ప్రూఫ్ మూతతోను. క్రొత్త ఎఱ్ఱ లేబిల్ తోను యిప్పుడు సరఫరా చేయబడు చున్నది.

వాటర్ బరీస్ కాంపౌండ్ టానిక్కును ప్రపంచములో ఆరోగ్యమును వాంఛించు పిన్నలు పెద్దలు అందరూకూడా ఆరోగ్యము నిచ్చుటలో పాటిలేనిదని పేరొందుటచే విడువక వాడుచున్నారు.

వాటర్ బరీస్ కాంపౌండ్‌లో ముఖ్యమైన పోషక పదార్థములు కలసియుండుటచే సౌఖ్యప్రదమగు జీవితమును ప్రసాదించి మీ కుటుంబమునకు అవసరమైన అదనపు శక్తిని చేకూర్చును

వాటర్ బరీస్ కాంపౌండ్ ఎడతెగని దగ్గు, పడిశములు, శ్వాసకోశపు దుర్బలతలను నివారించును వ్యాధినుండి త్వరితముగా కోలుకొనుటకు డాక్టర్లు దీనిని సిఫారసు చేయుచున్నారు.




ఇప్పుడు వాడుకలో లేని ఎంబిరాపర్

# వాటర్‌బరీస్ కాంపౌండ్

ఆరోగ్యమునకు హితమైన వాడుడు

# అసలు రహస్యం

అంటూ శాంత లేచివెళ్ళి స్నానాలగదిలో నీళ్ళు పెట్టివచ్చింది.

"ఇదివరకే చంద్రా!" అంది తిరిగివచ్చిన శాంత.

చంద్రావతికి అర్థం కాలేదు.

"లక్ష్మి ఎవరూ?"

"పనిపిల్ల! పద్దెనిమిది సంవత్సరాలుంటాయి. ఎర్రగా బొద్దుగా వుంటుంది. దాని బట్టలు మార్చి బీదపిల్ల అనుకోవాలి గాని లేకపోతే గొప్పవాళ్ళ పిల్లలా వుంటుంది. ఆయనకు ప్రతిదీ అదే చేయాలి. ఇప్పుడు చూచేవా! ఎదురుగావున్న నన్ను విడిచి

"లక్ష్మీ! లక్ష్మీ!" అంటూ కేక లేస్తున్నారు."

"ఒకవేళ నిన్ను కష్టపెట్టకూడదనే వుద్దేశంతో అలాచేస్తున్నారేమో"

"నీళ్ళు పెట్టడంకూడ ఒక కష్టమేనా చంద్రా! తన భర్తకు సేవచేయడంకంటే స్త్రీకి కావలసిందేమిటి చెప్పు. ఇదంతా పెద్దగాథ. వీరు క్లబ్బుకు వెళ్ళిపోయిన తరువాత చెబుతా."

ఇంతలో లక్ష్మి వచ్చింది. అంతకుముందు శాంత చెప్పివుండకపోతే నిజంగా ఎవరో పెద్ద కుటుంబీకులపిల్ల అనుకునివుండేది చంద్రావతి. గుండ్రని ఎర్రని ముఖం. నున్నగా దువ్విన నిగనిగలాడే నల్లని జుట్టు. అన్నింటికంటె ముఖ్యంగా చంద్రావతిని ఆకర్షించినవి ఆమె విశాలమైన అందమైన కళ్ళు.

వస్తూనే తొందరపడుతూ "అమ్మగారు! ఆలస్యమైపోయిందండి!" అంది భయంతో.

"ఫరవాలేదులే! అయినా ఈరోజు మాత్రం ఆలస్యంగా వచ్చేవేం. రోజూ అయ్యగారు వచ్చేసరికల్లా తయారయ్యేదానివి?"

"అమ్మకు బాగుండలేదండి వంట్లో"

ఇంతలో సత్యదేవ్ స్నానాలగదిలోనుంచి బైటికివస్తూ "ఎవరికి లక్ష్మీ?" అన్నాడు.

"మా అమ్మకు బాబూ! నాలుగురోజులనుంచి జ్వరం!"

"మరి నాతో ఎందుకు చెప్పలేదు?"

లక్ష్మి మాట్లాడకుండా తలవంచుకు నిలబడింది.

"సరే నేను క్లబ్బుకు వెళ్ళేటప్పుడు అలా వెళ్ళి చూచి అవసరమైతే డాక్టరును తీసుకువెళ్ళి మందు ఇప్పిస్తానులే. నీవేమీ భయపడకు. ఇక్కడ పని త్వరగా ముగించుకుని వెళ్ళు" అంటూ గదిలోకి వెళ్ళిపోయేడు.

ఈ సంభాషణ జరుగుతున్నంతసేపూ శాంత ముఖంలో రకరకాల భావనలు గ్రహించగలిగింది చంద్రావతి. లక్ష్మితో అంత ఆప్యాయంగా మాట్లాడుతున్నారనే ఈర్ష్య, చంద్రావతి ఏమనుకుంటుందోనని సిగ్గు, అంత సిగ్గులేకుండా ఆమెతో తన భర్త మాట్లాడుతున్నందుకు ఆయనపై కోపం. ఇన్ని రకాల భావనలు చంద్రావతి ఆమె ముఖంలో చదువగలిగింది.

ఇంతలో గదిలోనుంచి సత్యదేవ్ కేక "లక్ష్మీ"

"బాబూ."

"ఈ గదిలో ఇంత ధూళివుందేం. ఇంకా వూడవలేదూ?"

"లేదండి. వస్తున్నా"

హడావిడిగా వెళ్ళిపోయింది చీపురు తీసుకుని లక్ష్మి. ఈ తతంగం చూస్తున్న చంద్రావతికి మనస్సులో ఏమో కెలికినట్లయింది.

"శాంతా ఒక్కసారి ఇలా వచ్చి వెళతావా?"

ఏదో ప్రాధేయపడుతున్నట్లు పిలిచేడు సత్యదేవ్. శాంత లేచివెళ్ళింది.

"బీరువాలో నా సిల్కులాల్చీ కనపడడం లేదే.

"ఎందుకు కనబడదు. సరిగా చూడండి. మీకు ఎదురుగావున్న వస్తువే కనిపించదు."

"ఒక్క నువ్వు తప్ప.

"నేనుమాత్రం కనిపిస్తున్నానా?" వెటకారంగా అంది శాంత.

"హనుమంతుడు నిజంగా నేనంటే అంత భక్తిగా వుంటున్నాడా లేక అంతా నటనా? అని ఆ శ్రీరామచంద్రులవారికే ఒకసారి అనుమానం వచ్చి......"

"అదిగో చెప్పడం మొదలు పెట్టేరు చమత్కారపు కథలు."

"అది కాదు వినుమరి! వచ్చి...హనుమంతుడు నిద్రపోతున్న సమయంలో దగ్గరగా వచ్చేడట శ్రీరాముడు. అప్పటికే ఆయనకు రామా...రామా అని వినిపిస్తోందిట. అరే ఆంజనేయుడు నిద్రిస్తున్నాడుగదా ఈ శబ్దం ఎక్కడినుంచి చెప్మా అని శ్రీరాముడు శ్రద్ధగా వింటే ఆంజనేయులవారి శరీరంపై వుండే రోమాలు సైతం 'రామా, రామా' అంటున్నాయట. అప్పుడుగాని శ్రీరామునికి నమ్మకం కలుగలేదట."

"అంచేత ఇప్పుడు మీరు చెప్పేదేమిటి?"

"నేనుకూడా ఆంజనేయులవంటివాడినని"

"ఇక చాలించండి. మీరు నిద్రపోయేటప్పుడు గుర్ గుర్ అన్న గురకతప్ప మరేమీ వుండదు" నవ్వుతూ జవాబిచ్చింది శాంత.

"అందులోనే వుంది తమాషా. పగటివేళ 'శాంత' అనే రెండు అక్షరాలు. రాత్రి పూట మూగభావంలో 'గుర్' అనే రెండు అక్షరాలుగా మారిపోతాయి.'

"ఇక చాలు బాబూ మీతో వాదించి నేను నెగ్గింది ఎప్పుడు? చంద్రావతి ఒక్కర్తె కూచునివుంది, ఇదిగో మీ లాల్చీ — ఇక వెళ్ళండి."

"మరి మీరు ఏ పిక్చరుకు వెళతారు?"

"ఏం? తమరు ఆలస్యంగా ఇంటికి దయచేద్దామనా? మాకు పిక్చరూ అక్కరలేదు. మా స్వంత కథలు చెప్పుకుంటే అవే మాకు పిక్చర్లకన్న బాగుంటాయి."

"సరే నీయిష్టం"

"అయినా మీరు లేకుండా నే నెప్పుడైనా పిక్చరుకు వెళ్ళేనా చెప్పండి?"

"అంటే నీవు లేకుండా నేను వెళ్ళినట్లు"

"అలా అంటానన లేదుగా! కాని ఇద్దరమూ కలిసివెళ్తేనే సినిమా బాగుంటుంది."

"అంటే సినిమాలో నాయికా నాయకులు ఒకరి ముఖాలు మరొకరు ఆశగా చూచుకుంటున్నప్పుడు మనంకూడా..."

"ఇక వద్దు బాబూ, మీతో మాట్లాడితే ఎప్పుడూ విపరీతార్థాలే తీస్తారు" అంది నిష్ఠూరంగా.

"నాతో మాట్లాడడం నిజంగా బాధగా వుందా శాంతా?" ఎంతో జాలిగా అడిగేడు సత్యదేవ్.

"అబ్బే తమాషాకు అన్నానండి. మీతో సరదాగా ఇలా మాట్లాడడం అంటే నాకు ఎంతో ఇష్టం" అంటూ కుర్చీలోనుంచి లేచింది శాంత!

"ఆగు ఆగు! సిల్కులాల్చీ నలిగిపోతుంది"

"నేనేమీ మీదగ్గరికి రావడంలేదు. నా స్నేహితురాలివద్దకు వెళ్ళిపోతున్నాను" అంటూ బైటికివచ్చి ముసి ముసి నవ్వులు నవ్వుతూ వెనక్కి వెళ్ళిపోతున్న చంద్రావతి దగ్గరకు త్వరగా నడిచివెళ్ళి "కొంటెదానా ఇంకా నీకు ఈ బుద్ధులు పోలేదే..." అంటూ వీపుమీద ఒక్కటి చరిచింది. చంద్రావతి పకపకా నవ్వింది.

"అది కాదు శాంత! నీవు పూర్తిగా చెప్పకపోయినా, వచ్చిన ఇంతసేపట్లో నా మీ ఇద్దరి మధ్య కొంచెం అభిప్రాయభేదాలువున్నాయని తెలుసుకుని అసలు మీ సంభాషణ ఎలా సాగుతుందోనని చాటునుంచి విన్నానంతే"

ఇంతలో సత్యదేవ్ బైటికి వెళుతూ, 'శాంతా! నేను వెళుతున్నాను" అని కేక వేసి వెనక్కి తిరిగి ఒక చిరునవ్వు విసిరి ముందుకు సాగిపోయేడు. అంత మధురమూర్తిలా కనిపిస్తున్న అతనిలో ఏమి లోపం శాంతకు గోచరమైనదో తెలుసుకోవడానికి చంద్రావతి ఆతురత పడింది. ★

(మిగతా వచ్చేవారం)

---

టీచరు: ఒరేయ్! ఒక మామిడికాయలో నీవు 2/3 వంతు యిచ్చావనుకో. ఇంక ఎంత భాగము మిగుల్తుంది?

ఒకపిల్లాడు (గబుక్కున లేచి): మామిడి టెంక మిగుల్తుంది సార్. ఎస్. ఎ. హబీబ్.

## ★ తమాషాలు - విశేషాలు ★

### గొరిల్లాల కోపం

అల్లరిచేసే అయిదారేళ్ళపిల్లల్ని 'కోతులుపోగయినారని' తిట్టుకుంటారు ఇంట్లోవాళ్ళు. గొరిల్లాలని పిలువబడే ఒకరకం కోతులు ఆ అయిదారేళ్ళ పిల్లలకన్నా స్వరూపంలో అయిదారురెట్లు పెద్దవి! ఇవి ఆఫ్రికాలో చాలా ఎక్కువ. ఈ కోతులకు కోపం మహాఎక్కువ. వీటికి కోపం వచ్చినపుడు కొన్ని అచ్చం మనుష్యుల్లాగానే కొన్ని పనులు చేస్తాయి. నిట్టనిలువుగా నిలబడి పళ్లు పటపటమనిపిస్తూ, మొహం మటమటలాడిస్తూ గుండెలు బాదుకుంటాయి. బిగ్గరగా ఉగ్రకోపంతో అరుస్తాయి. నరులకీ, వానరులకీ అంతే తేడా!

### నక్కబావ ఫక్కీ

నాగరికత ఎంత వృద్ధిచెందినా నక్కబావ సంఘజీవి కాలేదు! నక్కకు సంఘంలో నమ్మకం లేదు. తుంటరివాడు. అందులో ఒంటరిగాడు. గుంపుల్లో చేరిపోడు. చేరింతర్వాత పారిపోడు.

అడవిమృగాలు సామాన్యంగా తోడునీడగా ఉంటాయి. ఆహారం కనిపిస్తే కలిసి ముందుకు దూకుతాయి. కాని నక్కబావ ఒక్కడే ఒంటరిగా ఈపనిచేస్తాడు. పనిలో, ఫలంలో భాగం పెట్టడు!

### లొట్టిపిట్ట పొట్ట

నవ్వొస్తేనే పొట్ట చెక్కలౌతుందని మనభయం. పట్టుమని మరచెంబునీళ్లు త్రాగలేం. నీళ్లు లేకుండా గట్టిగా గడియుండలేం.

కాని లొట్టిపిట్ట అట్టా కాదు. లొట్టిపిట్ట నీళ్లు త్రాగకుండా వారం రోజులు కూడా ఉంటుంది. దాని పొట్టలో కొన్నాళ్ళకు సరిపడేనీళ్లు నిలవ వుంచుకునే ఏర్పాటువుంది. కడుపులోగల తిత్తిలో దాదాపు 50 గాలన్ల నీరు పడుతుంది! ఏదారినిపోయినా, ఎడారినిపోయినా మంచి నీళ్లకు కించపడనక్కర్లేదు లొట్టిపిట్ట పట్టునుంటే.

## బాల సాహితి

మహాశివరాత్రి యిదె
వచ్చె నిరోజు!
ఆహా! యీ తిరణాల
అంటేనె మోజు !!

ప్రభ యొకటి గట్టి చిన
భండిపై బెట్టాను!
రెండు పొట్టేళ్ళనా
బండికి కట్టాను !!

'చేదుకో కోటయ్య
చేదుకో' అని అంటు
ఉరుకు పరుగులతోడ
తిరణాల కెళ్లాను !!

గుళ్లో దేవుని జూసి
చిల్లికాని వేసి
కోరికలు తీర్చుమని
మరి మరీ మ్రొక్కాను !!

చెంగుచెంగున వెళ్ళి
రంగులా రాట్నంబు
ఎక్కి తిరిగాను నే
నెంతో ఉల్లాసముగ !!

తాతయ్యకని తీపి
తాయమ్ము కొన్నాను!
శివపార్వతుల బొమ్మ
చెల్లెలికి కొన్నాను !!

గిర్రు గిర్రున త్రిప్పు
బుర్రుమను 'బురిపిట్ట',
డమడమాలా బండి
తమ్మునికి కొన్నాను !!

చూశాను చక్కని
వేశాను లాటరీ!
చిలక జోస్యము వింటి
చెఱకు ముక్కలు తింటి !!

స్వామివారల రథము
సాగబోయే వేళ,
తాడూని నే కూడ
దబదబా లాగాను !!

రథమెళ్లి పోయాక
ప్రభబండి కట్టుకొని
చీకటీ పడువేళ
చేరాను యింటికి !! ★

—ఆలపర్తి వెంకటసుబ్బారావు.




(గతసంచిక తరువాయి)

## 3

చిత్తమున కొక కొత్త ఊహ; వి
యత్తలమ్మున కొత్త వెలుగులు!
తుషారపు పరదాలు తొలగి
హుషారపు సరదాలు చెలగి
చురుకు ఎండలు సోకినట్లే
తరకు వేసంగి కదలివచ్చెను.

తలిరుటాకుల మిలమిలలతో
అలరు నవ్వుల కలకలలతో
అడవులే మాడువులుగా సం
దడులతో నిండిపోయెను.

ప్రాగు మంచు మబ్బులు తొలగిపోయినట్లు హేమంతం గడచిపోయింది. ఎండలు కరుగ్గా చురుగ్గా కాస్తున్నాయి. రానున్న వేసవికి రంగు మార్చి షెర్‌వుడ్ కొత్త అందాలు పోతుకుంది. రాబిన్ హుడ్ కూ అతని మిత్రులకూ అది కొత్త ఇల్లులా సరికొత్తగా వుంది.

ఇప్పుడు రాబిన్ జట్టులో చెట్టులాంటి లిటిల్ జాన్ కూడా వున్నాడు. వలహాక్కీ, సంప్రదింపుకీ పెద్దవాడు విల్ స్కాట్లీ ఉన్నాడు. వీరు లందరికీ రోజులు కులాసాలుగా గడచిపోతున్నాయి.

ఓరోజున రాబిన్ జట్టు అడవిలో ఉత్తరంవైపున ఒకచోట బాణాల పోటీ ఏర్పాటు చేసుకున్నారు. సరదాగా పంతంపట్టి పందెంపెట్టి దూరాన చెట్టుకో పుట్టకో గురిపెట్టి బాణాలు వదులుతున్నారు.

లిటిల్ జాన్ వంతు వచ్చింది. "మాస్టర్! నేనూ వదుల్తాను చూడుమరి బాణం. ఆ ఎండిపోయిన ఓక్ చెట్టు ఎడంపక్క అద్దగాగో భలే లేడి. కాస్కో మరి. ఒకటే మాట. ఒకటే బాణం. ఫట్" మంటూ ఇక్కడ అతను బాణం వదలటం, అక్కడ లేడి ప్రాణం వదలటం ఒక్కసారి జరిగింది.

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

శుభశ్రీ

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

రాబిన్ గట్టిగా నవ్వి లిటిల్ జాన్ భుజంపైకొట్టి 'భలేవాడివోయ్ ఉండతగ్గవాడివి. జట్టు పేరు నిలబెట్టావ్. నన్ను సంతోషపెట్టావ్. ఈ చుట్టుపట్ల వంద మైళ్ళ లోపల నిన్ను కొట్టే వీరుడు లేడు. నీసాటి వాడు రాడు.' అని గట్టిగా హుషార్ చేశాడు.

ఇది చూసి 'ఓ యబ్బో' అంటూ ఎద్దేవాగా నవ్వాడు విల్ స్కార్ లెట్. ఇతనూ తక్కువ తిన్నవాడేం కాదు. అయితే లిటిల్ జాన్ అంతటి మేటి కాదు.

'ఏమిటోయ్ నీ కడుపుబ్బరం? ఆ పరిహాసం ఏమిటో సరిగా చెప్పి నవ్వు... లేదా ఒక్కసారి నవ్వి అయినా చెప్పేయ్' అన్నాడు రాబిన్.

'నవ్వేందుకూ చెప్పేందుకూ మరేం లేదు మాస్టర్ నీ పొగడ్త ఎంతవరకు నిజమా అని' అన్నాడు విల్ స్కార్లెట్.

'అయితే పోటీకి రెడీ' అన్నాడు లిటిల్ జాన్ ఏడడుగుల పొడుగునా పౌరుషంతో.

'కానీ నేను కాదుగా' అన్నాడు విల్ స్కార్లెట్.

'మరి ఏం చూసుకుని ఆ పగల బాటు' రాబిన్ హుడ్ కోపంగా అడిగాడు.

"నేను కాకపోవచ్చు. కానీ ఈ మొనగాణ్ణి ఓడించడానికి వంద మైళ్లెందుకు మాస్టర్? ఇలాగే పడి సూటిగా అయిదు మైళ్లు పోతే 'ఫౌంటెన్స్ ఆబే' అనే మఠం వస్తుంది. అందులో ఒక సాధువు ఉన్నాడు. అందరు సాధువుల్లాగా బద్ధకంగా, అదోలా వుండడు. సరదాగా నవ్వుతూ, నవ్విస్తూ ఉంటాడు. విలువిద్యలో అతను అతనే! అతను చాలు మన లిటిల్ జాన్‌ని చిత్తుగా ఓడించడానికి' అని జవాబిచ్చాడు విల్ స్కార్లెట్.

అతనలా అనీ అనటంతోనే



రాబిన్‌హుడ్ గటాలున టోపీ, కత్తి తీసుకుని సిద్ధమయ్యాడు. 'అయితే ఆ సాధువును చూసే వరకూ నేను వచ్చి మంచినీళ్లు ముట్టుకోను—' అంటూ తన ఉక్కుటోపీ పెట్టుకుని బయలుదేరాడు.

'ఫౌంటెన్స్ అబే' అనేది ఒక పెద్ద క్రైస్తవ మఠం. 'ఫౌంటెన్స్ డేల్' అనే లోయలో ఉంది. అది చాలా ప్రాచీనమైందకూడా. అక్కడ ఉంటాడు ఆ క్రైస్తవ సాధువు. ఇప్పుడా సాధువును చూడాలనుకున్నాడు రాబిన్. ఏ మతబోధకోసమో కాదు. అతని విలువిద్యా ప్రావీణ్యం చూడాలని—అతనితో పోటీ పడాలని!

ఈ ఊహాలతో రెక్కలు వచ్చినట్లు చాలాదూరం వచ్చేశాడు రాబిన్.

ఇక కాలు ముందుకు సాగలేదు. దారికడ్డంగా ఒక ఏరు వచ్చింది. దారి తోచలేదు. ఏరు దిగాలి. లోతు తెలీదు. తెలిసినా తెలీకపోయినా దిగాలి. దిగాలంటే నేట ఉడుపులు తడిసిపోతాయి. దిగకుండా కాలు సాగే దారి లేదు. ఎటూ తోచక అటూ ఇటూ చూశాడు.

కాని ఏటి అవతలి ఒడ్డున అలనాడు లిటిల్ జాన్ ఎలా అయితే ఎంత దూరంలో ఎదురుగా కనిపించాడో అలాగే అంతదూరంలో ఒక మనిషి కనిపించాడు. పరకాయించి చూస్తే పరాయివాడిలా లేడు. విల్ స్కార్లెట్ చెప్పిన మాట విని తానింత దూరమూ వచ్చిన ఆ సాధువేనేమో అనిపించింది. క్రైస్తవ మతాన్నే పుట్టించి తోడిగేసుకున్నాడా అనిపించే దుస్తులు వేసుకున్నాడు ఆ సాధువు. పొట్టిగా బొద్దుగా ఉన్నాడు.

అతనుకూడా రాబిన్‌హుడ్‌ను చూశాడు. తను పెట్టుకున్న టోపీ వంటిదే మంచి ఉక్కు టోపీ బోర్లించుకున్నాడు. ఒంటిమీద అవసరమైన కత్తీ, కటార్లు అతనికి ఉన్నాయి. అతను సెలయేటికి అద్దరిని ఒంటరిగా అటూ ఇటూ తిరుగుతూ ఆలోచిస్తున్నాడు. ఆ పక్కనే 'ఫౌంటెన్స్ అబే' మఠం ఉంది.

'ఓహోయ్' అని రాబిన్ ఎలుగెత్తి అద్దరినున్న అతన్ని పిలిచాడు.

"నన్ను ఇట్ రా దబ్బున, ఈ ఏరు దాటించు కాస్త..." అన్నాడు రాబిన్.

"పొవ్రడా వీడు" అనిపించింది అతనికి.

'దాటించకపోతే...' గట్టిగా అడిగాడు.

'ప్రాణాలమీద ఆశ వదులుకోవచ్చు' తాపీగా రాబిన్‌హుడ్ జవాబిచ్చాడు!

ఆ మాటకు కనరాకుండా ఆశ్చర్యపోయి, క్షణం ఆలోచించి సరాసరి రాబిన్ దగ్గరకు వచ్చాడు ఆ మనిషి. రాబిన్‌హుడ్‌ను వీపుమీద

ఉప్పుప్పుగోన ఎక్కించుకొని కమ్మన కుండా ఏరు దాటించాడు. అవతల ఒడ్డుకి క్షేమంగా చేర్చాడు.

వీపు దిగి విలాసంగా ఓరుమీసం దువ్వి ఓర చూపు రువ్వి నవ్వాడు రాబిన్. మెల్లిగా రెండడుగులు వేశాడు.

'ఓహోయ్' వెనకనించి పిలిచాడు మోసుకొచ్చిన మనిషి— 'మెల్లిగా జారుకుంటున్నావ్ భలే వాడివే ... రారా ... నన్ను మళ్ళీ అవతల ఒడ్డుకు మోసుకుపో—నీ పళాన నవ్వు చక్కా పోతే నేనేమై పోతా ననుకున్నావ్?' గద్దించి అడిగాడు.

రాబిన్‌హుడ్‌కు అతని వాలకం అదోరకంగా ఉంది. 'తగ్గవాడల్లేనే వుంది' అనుకున్నాడు.

'అవతల ఒడ్డుకు చేర్చకపోతే నువ్వు చేసేదేమిటో' ధీమాగా అడిగాడు రాబిన్.

'నీ పంచప్రాణాలు పిట్టలై రివ్వున ఎగిరి మన దగ్గరికి వస్తాయ్ అంతే' అని ఒక్క కులుకు కులికాడు ఆ వింతమనిషి!

'సరే అయితే' అంటూ రాబిన్ వెనక్కి తిరిగివచ్చాడు. గుమ్మటంలా వున్న ఆ చిత్రవ్యక్తిని వీపు నెక్కించుకుని ఏరు దాటించాడు. మారుమాట్లాడ లేదు. ఒడ్డున అతన్ని దించగానే పెద్ద బరువు దించినట్లయింది.

దించీ దించడంతోనే ఒక్క ఎగురు ఎగిరి మళ్ళీ అతని వీపు నెక్కాడు రాబిన్. 'పద మళ్ళీ నన్నవతలకు చేర్చు. అప్పటిగాని నీ బాగరు దిగదు. కదలకపోయినావా నీ అంతు తేలుస్తా' అంటూ దున్నపోతును అదిలించినట్లు అదిలించాడు.

నణక్కుండా గొణక్కుండా తొణక్కుండా నింపుకుండల్లే కొండ కదిలినట్లు కదిలాడు మళ్ళీ అతను. అతని బుర్రలో వేడిగా ఆలోచనలు మాత్రం కదుల్తున్నాయి. పెదవులు బిగబట్టినట్టుగా నడిరేవులోకొచ్చాడు. ఒక్కసారి ఎగిరికుదిలించి రాబిన్‌ను నీళ్లల్లో విసిరిపారేశాడు. రాబిన్ బలం అతనిముందు ఆగలేదు. పట్టు జారి పడిపోయాడు.

అలా పారేసీ పారేయగానే బొబ్బరింత పెట్టి బొజ్జనిండ పెద్దగా పగలబడి నవ్వి రాబిన్ వైపు చెయ్యి చూపిస్తూ

"ఉక్కిరిబిక్కిరి పిల్లోడా నీ
దిక్కెక్కడరా పిచ్చోడా
బుద్ధివచ్చెనా లేదా వంటికి
శుద్ధి జరిగినా ఇకనైనా"

అంటూ గేలి చేస్తూ పాడడం మొదలుపెట్టాడు.

టీచరు: ఒరేయ్ రాము! నీవు యెందుకు తెలుగుపద్యం చదువలేదురా?

రాము: మా అమ్మ నన్ను బజారుకి పంపిందిసార్.

టీచరు: నేను కొడతానని మీ అమ్మతో ఎందుకు చెప్పలేదు?

రాము: చెప్పానండి. మరే నాకు ప్రయివేటుగా మిమ్మల్ని పెడతానని చెప్పింది.

నీళ్లలో మునిగి తేలి తెప్పరిల్లుకుని మెల్లిగా ఒడ్డుచేరాడు రాబిన్. ఇది అతనికి రెండోసారి.

సరాసరి విల్లు ఎక్కుపెట్టి నొక్కిపట్టి ఫటాల్‌మని బాణం వదిలాడు రాబిన్‌హుడ్.

కాని ఆ బాణం తనకే తగిలినంత పని అయింది! ఆశ్చర్యపోయాడు.

మళ్లీ మళ్లీ గురిచూసి వదిలాడు బాణాలు. ఆ వింతమనిషి ప్రాణాలు వదల్లేదు. చెక్కు చెదర లేదు. పైగా విరగబడి నవ్వడం సాగించాడు.

ఏదో లోపల బలమైన కవచం ఉండి ఉంటాలని పించింది. దీనికి మందు ఇది కాదని ఒరలోంచి చర్రున కత్తిదూసి పైకి దూమికాడు రాబిన్ - ఆ వింత మనిషీ అదే చేశాడు.

తీవ్రంగా కత్తియుద్ధం సాగింది. కత్తుల ఒరిపిడికి నిప్పురగిలింది. కత్తుల కలయికకు సంగీతం పుట్టింది. ఆ సంగీతం కమ్మగా లేదు. కఠోరంగా ఉంది.

ఆ పెనగులాటలో రాబిన్ క్రింది చేయి అయినాడు. క్రిందపడిపోయాడు.

'నీదే పైచేయి. క్షణం ఆగు' బిగ్గరగా అరచాడు.

'అలారా దారికి' అంటూ ఆగాడు వింతమనిషి.

'ఒక్కవరతు. నేనీ కొమ్ము బూర మూడుసార్లు ఊదాలి. అందాకా ఆగు' అన్నాడు రాబిన్.

ఆలోచించి అదేదో తెలిసినట్లు—సరే కానిమ్మన్నాడు వింతమనిషి.

అలా ఊదినవెంటనే కమ్మకు వచ్చారు రాబిన్ హుడ్ జట్టు. వాళ్ళో యాభైమంది ఉన్నారు.

'ఇంతకూ ఎవరు వీళ్ళంతా' అడిగాడు వింతమనిషి.

'మా వాళ్ళే—ఇహ కాని చెప్తా' అన్నాడు రాబిన్ దర్పంగా.

'అయితే నా కూడా ఒక షరతు' అన్నాడు వింతమనిషి.

'నేను కూడా మూడుసార్లు వేలుతో ఈలవేస్తాను. అందాకా ఆగు.'

షరతుకు 'సరే' అన్నాడు రాబిన్

అలానే చేశాడు వింతమనిషి. ఈలలు గాలిలో అడవంతా వినిపించాయి. చూస్తూండగానే యాభై వేటకుక్కలు వగర్చుకుంటూవచ్చి పడ్డాయి.

'వీళ్ళంతా మా వాళ్ళు. మీ వాడొక్కొక్కడికీ మా వాడొక్కొక్కడు డొక్క చించి డోలుకట్టే స్థోగ్మనేలా మజాగా బజాయిస్తా' వెటకారంగా అన్నాడు వింతమనిషి. క్రూరంగా చూశాడు.

'వీడి అసాధ్యం కూలా' అనుకున్నాడు రాబిన్ హుడ్.

"ఎడ్డెమనిషిలా దారి కడ్డంగా గట్టునమున్యాలా ఉన్నాడే తగ్గితే పౌరుషానికిలోపం. తగ్గకపోతే పరువుకు లోపం. అయినా నిలబడాలి—తలపడాలి' అనుకుని తనవాళ్ళకు కనుసైగ చేశాడు రాబిన్ హుడ్.

వేటగాళ్ళు బాణాలు వేశారు. వేటకుక్కలూ కలబడ్డాయి. కానీ ఈ కుక్కలు మరీ చిత్రమైనవి. వేసే బాణాల్ని వేసినట్లే ఒడుపుగా నోటితో పట్టుకుంటున్నాయి. అరకుడుపులుగా కుక్కలకీ ఒడుపులందించిన వింతమనిషి తీర్పుకు రాబిన్ ఆశ్చర్యపోయాడు. వేటవీరులు ఈటెలు వదలినా ఘూర్ణైన దెబ్బ-టూ తగలకుండా తప్పించుకుంటున్నాయి వేటకుక్కలు! ఇక వాటిని కొట్టడం కష్టమనిపించింది. గెలవడం అసాధ్యమనిపించింది. అవి రాబిన్ ముఠాలో అందర్నీ చెడకరచి వదిలిపెట్టాయి.

"ఆగు—ఆపుకో—వెనక్కి పిలు నీ వేటకుక్కల్ని. నువ్వెవరో ఇప్పటికి తెలిసింది. ముందు నీకుక్కల్ని పట్టుకో" అన్నాడు రాబిన్.

వింతమనిషి వేసిన ఈలకు ఆగిపోయాయి వేటకుక్కలు. ఆగిపోయాయి వీరుల బాణాలు.

రాబిన్ హుడ్ రెండడుగులు ముందుకునడిచి వింతమనిషి చేతులు రెండూ పట్టుకుని "నువ్వు తప్పకుండా నేననుకున్న వీరుడివే అయివుండాలి. 'ఫౌంటెన్స్' మఠానికి చెందిన సాధువు నువ్వే కదూ" అన్నాడు.

"అవును. సందేహమేముంది? నేనే. నా పేరు 'ఫ్రయర్ టక్' అంటారు" అన్నాడు సాధువు ప్రాణం లేచివచ్చినట్లు.

"భలేవాడివి...నీ కోసమే నేను ఇంతదూరం వచ్చింది. ముఖ్యానికి మా-రిచయం మరపురానిది. చూడు...నువ్వు నా మనసొచ్చిన వీరుడివి. నచ్చినవాడివి. నీతో నేస్తంకట్టాలని సరదాగా ఉంది" అన్నాడు రాబిన్.

"బలే బలే...అలా చెప్తే అయితే ఆ షెర్వుడ్‌లో ఉంటూ ఈ పరగణానంతా ఒకఊపు ఊపుతున్న మొనగాడివి నువ్వేనన్నమాట! దొరల్లో దొంగల్ని కొట్టే దొంగల్లో దొరా—జోహార్' అంటూ తలవంచి మెచ్చాడు తలవంచని ఫ్రయర్ టక్!

'ఇదుగో నబ్బాయ్ నా సంగతి విను. ఇవాల్టించి రాబిన్ హుడ్, ఫ్రయర్ టక్-విడివిడిగా కనిపించినా ఒక్కటిగా ఉంటారు. శరీరాలు వేరైనా మనస్సులొకటే!' అంటూ రాబిన్ హుడ్‌ను గట్టిగా ఆలింగనం చేసుకున్నాడు ఫ్రయర్ టక్.

దాంతో ఆ వింతమనిషి రాబిన్‌కు సొంతమనిషి అయిపోయాడు. న్యాయశాసనానికి అందకుండా, అందికుందకుండా తానూ షెర్వుడ్‌లోకి వచ్చేశాడు.

హాస్యగాడు, వీరుడూ, పండితుడు అయిన ఫ్రయర్ టక్ రాబిన్‌కు ముఖ్య సహచరుడయినాడు. రాబిన్ ముఠాకు అతడు మతగురువుకూడా అయినాడు.

ఆరోజునించీ బైబిల్ పాఠాలు చదివివినిపించీ, భక్తిగీతాలు పాడివినిపించీ, ఫ్రయర్ టక్ అందరికీ ఆనందం కలిగించేవాడు. కొవ్వెక్కినజింకల్ని కొట్టి, మజాగా మాంసం వండిపెట్టేవాడు. రాబిన్‌కు వాళ్లందరూ ఒక ఎత్తూ ఫ్రయర్ టక్ ఒక్కడూ ఒక ఎత్తు.

షెర్వుడ్‌లో వేసవితో పాటు అతనిరాకతో వేడి, వాడి ఎక్కువైనాయి కులాసా ఖిలాసా కలిగింది. రెండుసార్లు పరాజయం పొంది రెండు విజయాలు సాధించాడు రాబిన్ హుడ్! లిటిల్ జాన్, ఫ్రయర్ టక్ అనే సిరులను సంపాదించుకున్నాడు. ఆ యిద్దరి రాకతో అతనికి వేయిఏనుగుల బలం వచ్చింది. ★

# రాశిఫలాలు

★ దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి ★

**24-2-1960 బుధవారం మొదలు**

**1-3-1960 మంగళవారం వరకు.**

## మేషం:

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

ప్రస్తుతం పేరు ప్రతిష్ఠలకు లోపం లేక పోయినా, ఇతరుల సలహావల్ల ధనసంబంధమైన బాధలు అధికం కాగల సూచన లున్నవి. మనస్సులో ఆందోళన పెరుగుతూ ఉంటుంది. కార్యభారం కూడా మితిమించటంవల్ల కొన్ని సమయాలలో అనారోగ్యం చేయవచ్చు. బంధుమిత్రుల శుభకార్యాలలో పాల్గొంటారు. మిత్రుల కార్యక్రమాలు మీరు బాధ్యత వహించి జరుపవలసిన అవసరం కలుగుతుంది. అధికారులవంటి వారితో ఇంతకుముందున్నటువంటి అభిప్రాయభేదాలు తొలగిపోయి మీ ముఖ్య కార్యక్రమాలకు మార్గం లభిస్తుంది. తీర్థయాత్రలు మొదలయిన పుణ్యకార్యాలు మీరు అనుకున్న ప్రకారం సక్రమంగా జరుగగలవు. వారం రెండవభాగంలో వ్యవహార రంగంలో అనుకూల వార్తలు తెలుస్తవి. 24, 25 లలో అసౌఖ్యం, శ్రమవల్ల కార్యసిద్ధి, కలహాలు.

* * *

## వృషభం:

(కృత్తిక 2, 3, 4, పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)

మీ మనస్సులో బాధను అణచుకుంటు పైకిమాత్రం ఆడంబరాన్ని ప్రదర్శించుకో వలసిన సమయం. ఇతరులు మిమ్మల్ని గురించి చాలా గొప్పగాను, గౌరవభావంతోను మెలగుతూ ఉండటంవల్ల శ్రమపడి మీ హోదాను నిలుపుకోవలసిన అవసరం కలుగుతుంది. కుటుంబంలోనివారి అనారోగ్యంవల్ల ఖర్చులు పెరుగుతవి. ప్రయాణాలు చెయ్యవలయునని అనుకుని నిలుపుకోవలసివస్తుంది. దైవానుగ్రహంవల్ల అత్యవసరమైన సమయంలో అకస్మాత్తుగా ధనసహాయం లభించటంవల్ల మాట దక్కించుకో గలుగుతారు. వృత్తి ఉద్యోగాలలో మంచి పేరు సంపాదించుకో గలుగుతారు. కాని పోటీదారుపోటీ అధికం అవుతుంది. అధికంగా డబ్బు పెట్టుబడిపెట్టి జరుపవలసిన గొప్ప గొప్ప పనులు ప్రారంభించవలయు ననే కోరికలు, ప్రయత్నాలు ఆరంభం కాగల సూచన లున్నవి. కుటుంబంలో శుభకార్యాలు జరుగుతవి. 26, 27 తేదులలో కార్యసిద్ధి, అధికారుల పరిచయం, కారణం లేని భయం.

* * *

## మిధునం:

(మృగశిర 3, 4 పా. ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

మీరు ఎవరి సహాయముకోరుదామని అనుకుంటారో వారే మిమ్మల్ని సహాయం అడగటంవల్ల ఏవిధంగాను తప్పుకో లేని పరిస్థితి ఏర్పడుతుంది. ఈ సమయంలో దైవికంగా మీ కార్యక్రమాలు నెరవేరుతవి.

> **గ్రహస్థితి**
>
> కన్యలో రాహువు; ధనుస్సులో గురు శనులు, మకరంలో కుజశుక్రులు, కుంభంలో సూర్యబుధులు; మీనంలో కేతువు, మకర కుంభ మీన మేషాలలో చంద్రుడు.

మిత్రుల సహాయాలు పైకి అనుకూలంగా యున్నట్లే కనిపించినా, కార్యరంగంలో దిగిన తరువాత ప్రతి చిన్న విషయంలోను ముందుకు పోగల శక్తిగాని వెనుకకు రావడానికి తగిన అవకాశాలు లేకుండా చిక్కుకునే పరిస్థితి కలుగుతుంది. సాధ్యమైనంతవరకు జాగ్రత్తగా ఉండటం అవసరం. బంధుమిత్రులతో ధనసంబంధమైన లావాదేవీలు పెట్టుకోవలసి వస్తుంది. అందువల్ల ముందు ముందు విపరీతాలు రాకుండా చూచుకోవటం అవసరం. ఆదాయంమాత్రం బాగుంటుంది. వస్త్రాభరణాలు మొదలయిన విలువగల వస్తువులు కొంటారు. నౌకరులు మొదలయినవారితో కలహాలు వస్తవి. కోర్టు కచేరీలలో ఆలస్యం, ఖర్చులుమాత్రం అధికంగా కనుపిస్తవి. 25. 26 లలో మానసిక ఆందోళన త్రిప్పట, అధికారులతో కలహ ప్రసంగాలు.

* * *

## కర్కాటకం:

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష)

అంతా భగవంతుని అనుగ్రహం. ఈ సమయంలో ముందు జరుగవలసిన కార్యక్రమాలు ఆలస్యంగాను, నిదానంగా జరుగవలసిన పనులు శీఘ్రంగాను జరుగుతూ ఉండటంవల్ల మనస్సులో కంగారుతోస్తుంది. కాని చివరకు ఆలోచిస్తే అంతా మన మేలుకే అనే విషయం తెలుసుకుంటారు. ఆదాయం బాగుంటుంది. వృత్తి వ్యాపారాలలో అసాధ్యమనుకున్న పనులుకూడా సుఖంగా నెరవేరుతవి. కుటుంబ సంబంధమైన పనులలో మాత్రం అసంతృప్తి కనుపించి నివృత్తి అవుతుంది. సంతానంయొక్క ఆరోగ్యం సరిగా ఉండదు. దూరమందున్న స్నేహితులవద్ద నుంచి రావలసిన ధనం సకాలంలో చేతికి వస్తుంది. శుభవర్తమానాలు తెలుస్తవి. ఇతరుల ప్రోత్సాహంతో ధర్మకార్యాలు నెరవేర్చ గలుగుతారు. 28, 29 లో ఇతరులతో పోటీ, వృత్తులలో అభివృద్ధి ధనలాభం.

* * *

## సింహం:

(మఘ, పుబ్బ, ఉత్తర 1 వ పాదం)

మీ శక్తి సామర్థ్యాలు చక్కగా వినియోగించుకుని సంఘంలో ఉన్నతస్థితిని పొందగలుగుతారు. మనోధైర్యంతో ఆటంకాలను ఎదుర్కొ గలుగుతారు. మధ్య మనుష్యులవల్ల మిత్రులతో అభిప్రాయ భేదాలు వచ్చినా నిదానంగా యథార్థం తెలుస్తుంది. అయితే ఇతరుల కార్యబాధ్యత ఎంతమాత్రం పైన పెట్టుకోవటం మంచిది కాదు. మిత్రులవద్ద నుంచి శుభవార్తలు వస్తవి. వ్యవహార పత్రములు మొదలయినవి వ్రాయవలసిన సమయాలలో పొరపాట్లు రాకుండా చూచుకోవటం అవసరం. కుటుంబంలో సుఖసౌఖ్యాలు లభిస్తవి. మీ మాటను అందరు గౌరవభావంతో పాటిస్తారు. వారం మధ్యలో మీ ఆరోగ్యం కొంత భంగం అయ్యే అవకాశాలున్నవి. కాని, అందువల్ల మీ కార్యక్రమాలకు వచ్చే చిక్కు ఏమీ వుండదు. యంత్రాలు, ఆయుధాలు మొదలయినవాటిని వుపయోగించే సమయాలలో జాగ్రత్త అవసరం. 24, 25 తేదీలలో ఉపయోగం లేని కార్యక్రమాలు, ధనవ్యయం, పొరపాట్లుచేసి సవరించుకోవటం.

* * *

## కన్య:

(ఉత్తర 2, 3, 4 పా, హస్త, చిత్త 1, 2 పా.)

ప్రతిపని ముఖ్యంగానే తోస్తూవుంటుంది. ప్రస్తుతం మీకుగల అవకాశాలు కొంతవరకు మాత్రమే కావటంవల్ల ఏ పని ముందు జరపటం, ఏ పని మానటం అనే సమస్య ఎదు

ముగా కనుపిస్తుంది. అయితే చివరకు మీ ప్రయత్నంతో నిమిత్తం లేకుండా అవతలి వారు పని సాగించుకుని ముందుకు పోవటం వల్ల మీ ఆందోళన తీరిపోతుంది. ధనాదాయం మాత్రం సంతృప్తికరంగానే ఉంటుంది. పుణ్యకార్యాలు నిరాటంకంగా నెరవేరుతవి. ఉత్తర దిక్కునుంచి శుభవార్తలు తెలుస్తవి. ప్రయాణాలు చేయవలసి వస్తుంది. కాని సుఖంగా మాత్రం ఉండకపోవచ్చు. కొన్ని సమయాలలో మీ శక్తిసామర్థ్యాలను గురించి ఇతరులు జ్ఞాపకం చేసేవరకూ మీరు తెలుసుకోలేకపోతారు. అందువల్ల మీ కార్యక్రమాలలో నిదానం కనుపిస్తుంది. పండితులు మొదలయినవారి పరిచయం లభిస్తుంది. 28, 29 లలో విలాస వినోదాలు, ధనప్రాప్తి, అకస్మాత్తుగా ఉద్రేకం.

* * *

## తుల :

(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)

ఏపని అయినా ఆరంభించటం మాత్రం సులభంగానే కనిపిస్తుంది. తీరా అందులో దిగిన తరువాత సమర్థించుకోనటానికి అవకాశాలు సక్రమంగా లేకపోవటంవల్లను, విరమించుకోనటానికి వీలు కాకపోవటంతో మానసికంగాను శారీరకంగాకూడా ఎంతో బాధపడతారు. అన్నిటికంటే. ముందు మీరు చెప్పినమాటను నిలబెట్టుకోనటం చిక్కు సమస్యగా తయారవుతుంది. మీవల్ల పని గడుపుకోనటానికి మాత్రం మిమ్మలను స్తోత్రంచేస్తు దగ్గర చేరతారు, గాని మీకు సహాయం చేయవలసి వచ్చిన సమయంలో తెల్లగా మాటలు చెప్పి జారుకోంటూ ఉంటారు. వృత్తి వ్యాపారాలలో విఘ్నాలు అధికంగా కనపిస్తు ఉంటవి. కుటుంబంలోనివారి ఆరోగ్యంగురించి జాగ్రత్తగా ఉండవలసిన సమయం. వారం రెండవభాగంలో కొంచెం అనుకూల వాతావరణం కనుపించగల అవకాశా లున్నవి. ధనాదాయం పెరుగుతుంది. వ్యవహార రంగంలో అనుకూల వార్తలు తెలుస్తవి. 26, 27 పెద్దమనుష్యుల స్నేహం, అకస్మాద్ధనలాభం, వృత్తిలో శ్రమ.

* * *

## వృశ్చికం:

(విశాఖ4 వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ).

ఏ సందర్భంలోనైనా ధైర్యము, పట్టుదల అవసరం. తాత్కాలికంగా కొంచెం శ్రమ కనుపిస్తుంది. కాని ఈ సమయంలో జరిగే ప్రతిపని ముందు ముందు అన్నివిధాలా లాభదాయకంగా ఉంటుంది. మనశ్శాంతి లభిస్తుంది. ఇంతకు ముందు జరిగిన పొరపాట్లు క్రమంగా సర్దుబాటు అవుతవి. అయితే ఇతరులు మిమ్మలను గౌరవించినట్లు మాటాడినంత మాత్రాన వారి మాటలను నమ్మి కార్యభారం పైన పెట్టుకోవద్దు. మీ ఆరోగ్యం కుటుంబంలోనివారి ఆరోగ్యంకూడా బాగుంటుంది. కుటుంబంలో సుఖసౌఖ్యాలు లభిస్తవి. క్రమక్రమంగా ఆదాయంకూడా పెరగగలఅవకాశా లున్నవి. కాని, ఖర్చులు విపరీతంగా పెరగటంవల్ల ధన విషయంలో అసంతృప్తి తప్పకపోవచ్చు. ఇతరుల వ్యవహారాలలో మధ్యవర్తిత్వం చేస్తారు. 28, 29 లలో బంధువిరోధం. పుణ్యకార్యాలకు ఆటంకాలు.

* * *

## ధనుస్సు:

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

మీ ఆలోచనలు వెంటవెంటనే కార్యరూపం పొందుతూఉండటంవల్ల ఎంత భారంగాఉన్నా ఉత్సాహంతో సమర్థించుకోగలుగుతారు. సహాయం చేస్తామన్న మనుష్యులు తప్పుకుంటారు. కాని అందువల్ల చిక్కు మీకుండదు. పిల్లలకు అనారోగ్యం చేయగల అవకాశాలున్నాయి. శుభకార్య ప్రయత్నాలు ఫలిస్తవి. అన్ని విషయాలలోను బంధుమిత్రులు మిమ్మలను సమర్థించి గౌరవిస్తారు. మీవల్ల లోగడ ఉపకారం పొందినవ్యక్తులు ఒకరిద్దరు మీ మీద అపవాదులు ప్రచారంచేయటానికి పూనుకుంటారు. కాని అందువల్ల ఆందోళన చెందవలసిన అవసరంలేదు. చివరకు వారే అందరిచేత అవమానపడటం జరుగుతుంది. వారాంతంలో మీ ఆరోగ్యంగురించి జాగ్రత్తగాయుండటం అవసరం. పుణ్యకార్యాలలో పాల్గొంటారు. వృత్తి ఉద్యోగాలలో సంతృప్తి, పైవారివల్ల ఆదరాభిమానాలు లభిస్తవి. 27. 28 లలో కష్టవార్తలు దుబారాఖర్చులు, వ్యవహారవిషయాలలో శ్రమ.

* * *

## మకరం :

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)

మీరు ఎంత శక్తివంతులైనా వినియోగించుకునే సమయంలో పరిస్థితులు తారుమారుఅవుతూ ఉండటంవల్ల ఏపనిచేయలేకపోతారు. అందుకుతోడు డబ్బుకుకూడా ఇబ్బందిపడవలసి వస్తుంది. విశేషంగా ధనం వినియోగించి చేయతగిన వ్యాపారాదులవంటి వాటికై ప్రయత్నాలుచేస్తారు. అందుకు ఇతరుల మాట సహాయం బాగా ఉపయోగిస్తుంది. కాని సమయంలో ధనసహాయం లభించకపోవటంవల్ల శ్రమమాత్రమే మిగులుతుంది. ప్రతిదీ అయ్యేటట్లు కనిపించినా నమ్మి అశ్రద్ధగా ఉండవలసిన సమయంకాదు. త్రిప్పట అధికంకావటంవల్ల ఆరోగ్యం కొంతవరకు లోపించగల అవకాశాలున్నవి. బంధుమిత్రులవద్దనుంచి అనుకూలవార్తలు తెలుస్తవి. వృత్తివ్యాపారాలలో ప్రతికూలతఅంటు ఉండదుకాని ప్రయోజనం మాత్రం సాధారణంగా ఉంటుంది. 26. 27 లలో కుటుంబ ఖర్చులు అధికం, ప్రారంభం, చిన్నపనులు జరుగవేమోననే ఆందోళన.

* * *

## కుంభం :

(ధనిష్ఠ 3, 4 పా శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా)

ఈ వారంలో మీరు మనస్సులో ఊహించుకునేదానికి ప్రత్యక్షంలో జరిగేదానికి సంబంధం ఉండదు. ముఖ్యంగా వృత్తిలో పైవారివల్ల మాటరాకుండా కాపాడుకోనటం అవసరం. ముందుగా ఒక నిర్ణయంఅంటూ లేకుండా అప్పటికప్పుడు తోచినప్రకారం పనులు జరుపుకోంటు ఉంటారు. అందువల్ల అకస్మాత్తుగా ఖర్చులు వచ్చిపడే అవకాశాలున్నవి. ప్రతివక్కరి సలహాను అనుసరించవలసి వస్తుఉంటుంది. అందువల్ల మనలో చిక్కుసమస్యలు ప్రారంభమై బాధపడవలసి వస్తుంది. ప్రయాణసూచనలున్నవి ఆదాయం బాగానే ఉంటుంది. కాని ఖర్చులకు తగినంతగా లభించకపోవచ్చు. బంధుమిత్రులకు వ్రాసే ఉత్తరాలలో అవతలివారి మనస్సును నొప్పించేమాటలు లేకుండా చూచుకోనటం అవసరం. వారాంతంలో నీచులతో కలహాలు రాకుండా చూచుకోనండి. వాహనాలు ఎక్కటం. యంత్రకార్యాలు మొదలయిన సందర్భాలలో జాగ్రత్తగాఉండండి. 24, 25 లో దండుగఖర్చులు, దేహబాధలు, కార్యభంగం.

* * *

## మీనం :

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి)

ప్రస్తుతం కొంత అనుకూలవాతావరణం కనుపించగల సమయం. సంఘంలో గౌరవం పెరుగుతుంది. ఇతరులకు సహాయం చేయగలుగుతారు. ఆదాయంకూడా బాగానే ఉంటుంది. ఆత్మీయుల వద్దనుంచి కష్టవార్తలు తెలుస్తవి. ఖర్చుచేయు సమయంలో వెనుకముందులు చూచుకుని ప్రవర్తించటం అవసరం. శుభకార్యాలలో పాల్గొంటారు. కుటుంబంలో సుఖసౌఖ్యాలు లభిస్తవి. విలువగల వస్తువులుకోను ప్రయత్నాలలో కొద్దిగా ఆలస్యం కనుపించినా పనులు సుఖంగా జరుగుతవి. ఒక సమయంలో ఎంతో ఉత్సాహంగా ఉంటుంది. అన్నిపనులు జరుగుతున్నట్లు, ఫలితం అందుతున్నట్లే తోస్తుంది. కాని వెంటనే నిరుత్సాహం భయము తోసు ఉంటవి. మనస్సుకు ఈ ఆందోళనతో కాలం జరిగిపోతుంది. కాని ప్రత్యక్షంగా జరిగే అపకారంగాని, ఉపకారంగాని ఏమీ ఉండదు. పిల్లలమూలంగా సుఖసంతోషాలు లభిస్తవి. 26, 27 లలో కారణంలేనిభయం ప్రయాణసూచనలు పెద్దమనుష్యుల పరిచయం.





# అన్వేషణ



(31-వ పేజీ తరువాయి)

చంద్రప్రభ పకపకా నవ్వింది.

రాణి ఒకక్షణం తీవ్రంగా ఆలోచించింది. అతని ఫోటో తెచ్చి చూపించడంలో, ఏమైనా అంతరార్థముందేమో అని భయపడింది. శివరాంతో మరేవిధంగానైనా తనకు ముందు పరిచయమున్నట్లు చంద్రప్రభకు తెలిసిందేమో అని అనుమానపడింది.

ప్రసాద్ పుస్తకం చదువుకుంటున్నాడు దీక్షగా.

కామేశ్వరమ్మ ఒళ్ళు ఊపుకుంటూ రాణి గదిలోకి వచ్చింది.

"రేపు...మనం కల్పనగరంలోని ఆస్పత్రులు తిరగాలి. బెంగుళూరు నుంచి మహిళా సంఘ కార్యదర్శి వచ్చిందిగా...ఆమె యిక్కడ స్త్రీలకు చికిత్సా సౌకర్యాలు ఏ విధంగా ఉన్నాయో పరిశీలించాలనుకుంటోంది...' కామేశ్వరమ్మ పెద్దనాయకురాలిలా ఉపన్యసించింది.

'చంద్రప్రభకు త్వరలో ఏమైనా చికిత్స చేయించండి...చదువు మాన్పించి!' రాణి హేళన చేసింది.

'ఎందుకు?' కామేశ్వరమ్మ ఆశ్చర్యంగా ముఖం పెట్టింది.

'ఎందుకా...పిచ్చెక్కింది... చంపేస్తా.. నేనెవరనుకున్నావురా...నువ్వెవరవు?..మనిషివా, జంతువా...! ఏమిటిదంతా!' పిచ్చిదానిలా నటించింది చంద్రప్రభ.

'ఇదంతా నటనలెండి...నాటకాలు వేస్తున్నారు కాలేజీలో!' నవ్వింది రాణి.

'నయం నిజంగా...పిచ్చెక్కిందేమో అని భయపడా! తీరిగ్గా శ్వాస పీల్చింది కామేశ్వరమ్మ. "పెళ్ళి కావలసిన దానవు... ఏమిటా ఆగంతాలు!" ఉరిమింది కూతురు వైపు చూసి ఆమె.

'అందుకే త్వరగా పెళ్ళి చికిత్స చేయించమంటున్నా!'

రాణి కామేశ్వరమ్మతో రహస్యం చెప్పినట్లు దగ్గరగా వెళ్ళింది.

'చేయిస్తా...ఈ యేడు ఎం.ఏ....పూర్తి కాగానే ఏ పల్లెటూరి వ్యవసాయదారుడితో పట్టికట్టేస్తా...అప్పుడు దీనికి బాగా లికి కట్టే పొలం దున్నిస్తాడు అల్లుడు!' నవ్వింది. కామేశ్వరమ్మ.

'పొలం దున్నడం ఎంత సరదాగా ఉంటుందో నీకేం తెల్సు...సభల్లో ఊరికే కబుర్లు చెప్పి ఉపన్యాసాలివ్వడమనుకున్నావా?' తల్లిని హేళన చేసింది చంద్రప్రభ.

'నమస్కారం అమ్మగారూ!' ప్రసాద్ వచ్చి భక్తుడిలా నమస్కరించాడు తల్లికి హాస్యంగా.

'ఏవరం కావాలి?' కామేశ్వరమ్మ కామేశ్వరీ దేవిలా అభయహస్తం చూపింది.

'నాకేవరూ వద్దు తల్లీ... నాన్నగారు వచ్చారు...!'

కామేశ్వరమ్మ హడావుడిగా లోపలికి నడిచింది భర్తదగ్గరకు. ప్రసాద్ తల్లిని అనుసరించాడు.

కురంగేశ్వరరావుగారి చెవిలో భుజంగరెడ్డి తత్వంగురించి ఒక వాక్యం పడేయ్యాలని రాణి ప్రయత్నిస్తోంది. ఆమాట జారడం తన భావిజీవితానికి కొంతరక్షణ కలిగిస్తుందని ఆశపడింది రాణి.

'ప్రభూ!...ఆడది ఒంటరిగా అనాథగా బ్రతకడం సంఘంలో ముప్పుకదూ, దీనంగా విచారంగా ముఖం పెట్టింది రాణి.

తమయింట్లో ఏదైనా కష్టం కలిగిందేమో అని చంద్రప్రభ కంగారు పడింది.

'ఆమాటఎందుకంటున్నావు...నీకేమైనా కష్టం కలిగిందా!' ముఖంమీద అడిగేసింది చంద్రప్రభ.

'ఎంతమాట!...మీ యింట్లో నాకు జరుగుతున్న సౌకర్యాలు మునుపు ఎక్కడా జరుగలేదు....కాని బడిలో...మా పాఠశాల కార్యదర్శిగుణం మంచిదిగా కనిపించడం లేదు!' రాణి దుఃఖంతో ముఖం చిట్లించింది.

'ఏంజరిగింది?' చంద్రప్రభ ఆత్రుతగా అడిగింది.

భుజంగరెడ్డి తన్నేకమారు నిజాం సాగర్ ఆహ్వానించడం తాను తిరస్కరించడం చెప్పేసింది రాణి.

'అతడు నన్ను ఏదైనా ప్రమాదంలో దించుతాడేమో అని భయంగా ఉంది!' వణికింది.

'నాన్నగారితో చెప్పుదాం!' అంది చంద్రప్రభ.

'తప్పు! ఇటువంటి విషయాలు ఆయనకు తెలియకూడదు!' ముఖం దించుకుంది రాణి బాధగా.

ఈ విషయం చంద్రప్రభ ద్వారా ఆమె తండ్రికి తెలియాలనే రాణి అంతర్గతభావం.

చంద్రప్రభ కొద్దిసేపు మౌనంగా ఆలోచనలో మునిగింది.

కురంగేశ్వరరావుగారు నాంపల్లి పాఠశాల కార్యవర్గ సమావేశానికి మధ్యాహ్నం హాజరయ్యారు. భుజంగరెడ్డి తనకు రాణి గురించి వచ్చిన ఆకాశరామన్న ఉత్తరాలు కార్యవర్గం ముందుపెట్టి, యిటువంటి కులటను ఆడపిల్లల బడిలో పంతులమ్మగా ఉంచడం శ్రేయస్కరం కాదన్నాడు. కురంగేశ్వరరావు దిగ్భ్రాంతి చెందాడు. ఉత్తరాలు చదివి నిర్ఘాంతపోయాడు. రాణి కులట అనే విషయం ఆయన నమ్మలేక పోయాడు. రాణిని ఉద్యోగంలో చేర్పించిన ఆయన పరువుప్రతిష్ఠలే భగ్నమయినట్లు కనిపించింది. తన గౌరవం కాపాడుకోడానికే నా మొదట ఆకాశరామన్న ఉత్తరాలు త్రోసిపుచ్చాలని ప్రయత్నించారు. ఋజువులేక ఏవో ఉత్తరాలు ఆధారంగా ఒక స్త్రీ శీలం శంకించలేమన్నారు. తనగౌరవం ప్రాతిపదికగా రాణి అటువంటి మనిషి కాదని వాదించారు. చర్చ చెలరేగింది.

విషయం మరొక కార్యవర్గసమావేశంలో చర్చించడానికి వాయిదా పడింది.

కురంగేశ్వరరావుగారి మనస్సులోని చికాకు పెరిగిపోయింది. పరిస్థితి అశాంతికరంగా పరిణమించిందనుకున్నారు. రాణి ప్రవర్తనలో ఏవిధంగానూ కులటా లక్షణాలు ఉన్నట్లు కురంగేశ్వరరావుగారికి కనిపించలేదు. రాణి ముఖంలో అమాయకత్వం, సంసారలక్షణాలు గల ఆడదానిలా మాత్రమే తెలియజేస్తున్నాదని నమ్మారు కురంగేశ్వరరావుగారు. అయినా విషయం పరిశోధించనిదే ఒక నిర్ణయానికి రాకూడదనుకుని, రాణి విషయంలో మునుపటిలాగే కొంత కాలం ప్రవర్తించాలనుకున్నారు. మనస్సులోని చికాకు దాచుకోడానికి రాత్రి భోజనంచేసి ఒంటరిగా పోయి అలిసిపోయినట్లు మంచంమీద ఒరిగారు ముభావంగా కురంగేశ్వరరావుగారు.

చంద్రప్రభ భోజనం సమయంలో కామేశ్వరమ్మ రాణి అన్న సంగతి చెప్పేసింది. కామేశ్వరమ్మ రెడ్డిమీద కోపం తెచ్చుకుంది. కామేశ్వరమ్మ పడకగదిలో భర్త సౌమ్యంగా ఉన్నప్పుడు రెడ్డి ప్రవర్తన గురించి కామేశ్వరమ్మ చెప్పేసింది. కురంగేశ్వరరావుగారు సమస్యపునః పరిశీలన చేశారు. ఆకాశరామన్న ఉత్తరాలు రెడ్డి పన్నిన పన్నాగమై ఉండవచ్చునని శంకించారు. తాతెరిగిన పెద్దపోలీసు ఉద్యోగితో యీ ఆకాశరామన్న ఉత్తరాలు పోలీసులకు దర్యాప్తుకుపంపమన్నారు కురంగేశ్వరరావుగారు. తనకేమి ఉత్తరాలతో జోక్యం లేనందున పోలీసుల పరిశోధనతో కురంగేశ్వరరావు, రాణికూడా అప్రతిష పాలవ్వగలరని ఆశించి రెడ్డి ఆకాశరామన్న ఉత్తరాలు పోలీసులకు అందిచ్చాడు.

కామేశ్వరమ్మ మర్నాడు రాణిని తీసుకుని సాయంత్రంవేళ వెంగుళూరు మహిళా కార్యదర్శితో మరికొందరు కార్యవర్గ సభ్యులతో ఆస్పత్రులు పరిశీలించడానికి బయలుదేరింది తమ స్వంతకారులో. కార్యదర్శినిగా కామేశ్వరమ్మ వివిధ ఆస్పత్రి అధికారులకు ఉత్తరాలు వ్రాయడంచే అధికారులు యీ మహిళాబృందానికి స్వాగతమిచ్చి, ఆస్పత్రిలోని రోగిష్ఠులైన మహిళలను చూపించారు. జ్వరాలతో, అంగవైకల్యాలతో, కడుపుబాధలతో, ప్రసవాలతో ఆస్పత్రిలో ఉన్న స్త్రీ జనాన్ని వెంగుళూరు మహిళా కార్యదర్శిని పలకరించి ఆస్పత్రిలోని చికిత్సా సౌకర్యాలు ప్రశ్నించింది. స్త్రీల బాధల పురాణం సగం విని, సగం వినక, కాలయాపన చెయ్యకుండా తన పర్యటన ముగించుకోవాలనుకుంటూ గబగబ స్త్రీ రోగుల మంచాల చుట్టు తిరిగేసింది వెంగుళూరు కార్యదర్శి. బయటికివచ్చి స్త్రీజన సంక్షేమంగురించి మహిళలందరూ నడుంకట్టి ముందుకు రావాలంటూ ఉద్బోధించింది. అనాథ బాలికల శరణాలయం, క్షయరోగుల ఆస్పత్రి, పిచ్చివాళ్ళ వైద్యాలయం కూడ సందర్శించి, స్త్రీల స్థితిగతులు పరీక్షించిందామె. కుష్ఠరోగుల ఆస్పత్రిలోకి కారునడిపించింది.

(ఇంకావుంది)★






# మాటలో - మనుగడలో
# ఆడవారి ఆడంబరం

భైరవభట్ల లీలాసీతారామ్

ఏమమ్మా! ఎక్కడుంటున్నారేమిటి? చాలాకాలానికి చూశాం. మరీ అలా చిక్కిపోయావేం? పిల్లలెందరు?

అంటూ ఎడతెరిపిలేకుండా ప్రశ్నలవర్షం కురిపించింది మహాలక్ష్మమ్మ పిన్ని. పబ్లిక్ గార్డెన్సులో నిలవేసి.

ఆవిడను చూసేసరికి నా గుండెల్లో రాయి పడింది. ఒకపట్టాన ఈవిడ వదిలిపెట్టదు. ఇక సంభాషణలో దిగిందంటే గంటలకొద్దీ.

ఆ! ఏడాదినుండి ఇక్కడే ఉంటున్నాము. ఇవాళ ఈ పబ్లిక్ గార్డెన్సు చూద్దామని ఇలా వచ్చాము.

అల్లాగా! అయితే ఇదే మొదటిసారి చూడటమా! మరి ఈ ఊరువచ్చి ఏడాది అయిందంటున్నావు. ఈపాటికి ఊరంతా చూసెయ్యద్దూ! మేం వచ్చిన వారం రోజుల్లో ఊరంతా చూసేశాము. ఇంకా చాలా ఉన్నాయన్నమాట చూసేవి. ఏమైనా సినిమాలకి వెళ్ళారా? ఈ ఊరు వచ్చాక మేమెన్ని చూశామో లెక్కలేదు. అసలు మీరు ఏమేం సినిమాలు చూశారు.

పిన్నిగారి డాబుసరి కబుర్లు నాకు తెలుసుగా. ఆ! ఏమిటో పిన్నిగారూ! ఇల్లు కదలాలంటే ఈ పిల్లలతో ఎంతకష్టమో చూడండి.! ఎన్ని సరుకంటే అవుతుంది. తీరా కదిలామా ఈ ఊళ్ళో కొత్త కొత్త దూరాలా! బస్సుకోసం నిలబడేసరికి భగవంతుడు జ్ఞాపకానికి వస్తాడు. చూడండి! ప్రొద్దుటినుండీ చకచకా పనిచేసుకుని తయారయ్యేవేళకి మూడుగంటలయింది. ఇహ ఈ పిల్లల్ని పెట్టుకుని బస్సుకోసం నిలబడి చేరుకునేవేళకి ఐదుగంటలు. ఇక పిల్లలవిడుపు మొదలు. మళ్ళీ ఆ దగ్గిరలో ఉండే ఏ హోటలుకో వెళ్ళి కొత్త కాఫీ త్రాగి అలసట తీర్చుకుని ఇలా తిరిగి మళ్ళీ ఇల్లు చేరుకునేవేళకి అంటే ఈలోగా మధ్యే మధ్యే పానీయం అన్నట్టుగా బిస్కట్లో ఇంటిదగ్గరనుండి చేసి తీసికెళ్ళిన ఫలహారమో పెట్టినాసరే! ఇంటికెళ్ళే వేళకి మళ్ళీ విడుపు మొదలు. ఇహ అప్పుడు మనకి విసుగే తిరిగి తిరిగి కాళ్ళునొప్పి. ఆయనగారి విసుగంతా నామీదకే తిరుగుతుంది. అందుకని ఈ బాధంతా పడలేక ఇంట్లో కూర్చుండటమే హాయి అనిపిస్తుంది. ఇల్లు కదలాలంటే పెద్ద గండం. అన్నా నవ్వుతూ!

ఇంకా ఆవిడ ఏదో మాట్లాడబోయింది. పిల్లలకోసం పండ్లు కొనుక్కురావటానికి వెళ్ళిన మావారు తిరిగిరావటంతో మహాలక్ష్మమ్మ పిన్ని సంభాషణకి బ్రేక్ పడింది. ఇక తప్పనిసరిగా సెలవు తీసుకోవాల్సి వచ్చింది. భగవాన్! ఇప్పటితో నాపై దయ తల్చావనుకున్నాను.

అసలు మాలక్ష్మమ్మ పిన్నిగారు "మింగ మెతుకులేకపోయినా మీసాలకు సంపెంగినూనె" అనేవాళ్ళలో ఫస్టు. వాళ్లు మేము మద్రాసులో ఉన్నప్పుడు ప్రక్కయింట్లో ఉండేవాళ్ళు. ఇహ ఈవిడగారికి క్రొత్తసినిమావస్తే ఇంట్లో కాలునిల్చేది గాదు. మొగుణ్ణిసాధించి ఏడ్పి రాగాలు పెట్టి సినిమా కెళ్ళితీరాల్సిందే. ఆయనచేత చివాట్లు చెప్పుదెబ్బలు తిన్నాసరే తన పంతం నెరవేర్చుకునేది. లేకపోతే ఇల్లంతా నానాగోల ఇక ఆ మానవుడు అసలే మెత్తనివాడు. క్రొత్తలో అడ్డుపెట్టినా ఈవిడ గోల ఇరుగుపొరుగులకి తెలిసి తన మర్యాద కూడా, పోతుందన్న భయంతో ఏమీ అనేవాడు కాదు. సరే! ఇంక ఈవిడ ఇష్టం. పిల్లల్ని ఇంట్లోపడేసి తాళంవేసి టింగురంగామని తిప్పుకుంటూ సినిమాకి వెళ్ళిపోయేది. ఇహ ఆ పిల్లలు ఏడ్చి ఏడ్చి నిద్రపోవాలిసిందే! ఇలా మొగుణ్ణి పిల్లల్ని బాధించి సినిమాకెళ్ళి ఏం బావుకుంటుందో. మళ్లీ ఈవిడ చెప్పుకునే గొప్పలు ఇంతా అంతా కాదు. డబ్బంతా సినిమాలకి. ఇంట్లో ఏపూట బియ్యం ఆపూట ఏపూట పప్పు ఆపూట తెచ్చుకోవాలి. ఆయనకి రెండువందల రూపాయలొచ్చే వస్తుందిగాని ఏంలాభం. బీదవాళ్ళకంటే బీదగా వుంటుంది ఇంట్లో సంసారం చూడబోతే! ఈవిడఖర్చు ఇలా! ఈవిడ స్నేహాలన్నీ డబ్బున్నవాళ్ళతోనే బీదవాళ్లు తగరు. వాళ్ళందర్నీ పిల్చి అప్పుచేసి పప్పుకూడు పెట్టేరకం. పాపం! ఆయన పడే కష్టం అంతా ఇంతా కాదు.

మధ్యరకం సంసారాల్లో ఇలాటివన్నీ పెద్ద ఖర్చులే! అందులో ఇలాటి పెద్దపట్నాలలో సినిమాలకి వెళ్లాలంటే ఒక చిన్న సంసారా

## సరళ సలహా...

ప్రాచ్యం; అంటే చరిత్రకారుల మాపుల కందనివాడు కూడా ఇంట్లో ఉమ్మడి, దొడ్లో గుమ్మడి మన వాళ్ళకు ఉంటూనే ఉన్నాయి. కలిసికట్టుగా ఉండటంకన్న కలిమి, కలుపుగోలుతనంకన్న కళ-మనవాళ్లకు ఏనాడు లేవు. ఏ యింటో పిల్లల్ని చూసినా 'దోసతోట వోలె దోగాడుచుందురా నిండుగన్న కనుల పండువన్న' అని కవులు పాడుకున్నారు.

ఈనాడు మనకి ఇంతప్పటినించీ వ్యక్తియాభిప్రాయాలున్నాయి! వాటి అమలుకు స్వేచ్ఛ కావాలి. అటువంటి ఉమ్మడికుటుంబాలలో సమష్టిశ్రేయస్సేగాని వ్యష్టి చింత లేదు.

సమష్టికోసం వ్యష్టిగా మనం త్యాగాలు చేయడం నేర్చుకుంటే ఉమ్మడి నిండు ఇప్పుడూ ఉంటుంది.

నికి కనీసం పది రూపాయలు. ఇక నానా అగచాట్లూపడి బస్సుకోసం నిరీక్షించి నిల్చి చచ్చి చెడి పడి సినిమాహాల్లో చేరుకునే వేళకి ఈపిల్లలు "మంచినీళ్లు" అంటూ మొదటి రాగం. ఇహ మరీ మా రెండవవాడు మందరస్థాయిలో మొదలుపెట్టి, హెచ్చుస్థాయివరకూ గొంతువిప్పి ఏడుపు రాగాలాపన మొదలుపెట్టాడంటే హాల్లో వాళ్ళందరూ పారిపోవాలి. లేకపోతే మమ్మల్నే తరుమాలి. అంతపని చేయించుకోటం ఎందుకని మర్యాదాగా బయటికివెళ్ళి వాడి ఏడుపు మాన్పించడానికి సతమతమై వాడికేమైనా దాహం పెట్టి మంచినీళ్లిచ్చి హాలులోకి వచ్చేసరికి సగం ఆట అయిపోతుంది. పోనీ అని మనసు తృప్తిచేసుకుని కూచునేసరికి మళ్ళీ మొదలు పెడిరాగం "నిద్రవస్తోంది" అంటూ. ఇహ నాబాధ ఎలా వర్ణించాలో! వాడు ఏడవకూడదు. ఆట అయిపోయేవరకూ ఒళ్ళో పడుకునేసరికి కాలంతా తిమ్మిరెక్కిపోతుంది. ఇహ అప్పుడైనా వాడు పడుకుంటాడా అంటే అది లేదు. "పక్క వేసూలీ" అనో "చెమటపోస్తోంది" అనో గొణుగుతూనే ఉంటాడు. సరే! ఎలాగో సినిమాపూర్తయి ఇల్లుచేరే వేళకి పదకొండో పన్నెండుగంటలో. అప్పుడు భోజనాలు. మావాడి రాగాలాపన. ఆయనగారి విసుగు. వంటవాడు పాలకి ఏడుపు. అప్పుడుంటుంది ఇల్లు ప్రక్కవారిని మేల్కొలుపుతూ!

అసలు వెళ్ళేటప్పుడు ఉషారు వచ్చేటప్పటికి నీరసించి, అటు సినిమా చూసినట్లూ కాదు, హాయిగా ఇంట్లో పడుకోటమూ కాదు. ఒకటే తలనొప్పి! ఇక జన్మలో సినిమా చూడకూడదు అనిపించేస్తుంది.

నిజానికి పది రూపాయలుపోసి ఏం ఆనందం కొనుక్కున్నట్లు. ఆ డబ్బే ఉంటే ఇంట్లో ఏమైనా సామాను ఏర్పరచుకోవచ్చు. "సెబ్బాపోయె కనిపట్టై" అన్నట్లు ఇంటికి వచ్చాక కూడా ఆనందం లేకపోగా తలనొప్పి విసుగు చికాకులూ.

చాలామంది సినిమాచూస్తే ఆనందం అనుకుంటారు. ముఖ్యంగా మా లక్ష్మమ్మ పిన్నిగారులాంటివాళ్ళెంతమందో! ఈ పిచ్చి చాలామంది మగవాళ్ళల్లోకూడా ఉంటుంది. ఇంట్లో కావలసిన సామాను ఒక్కటి తేరు. ఇక డబ్బంతా సినిమాలకి వాళ్ళ డాబు సర్దుకి సరిపోతుంది. ఇక ఆ భార్య బిడ్డలు పడే అగచాట్లు అంతా ఇంతా కాదు. తిన్నవాడు తిండం లేనివాడు పడుకోటం. భర్త అడిగితే చావగొడ్తాడు. "ఇంట్లో ఈగ మోత—బయట పల్లకి మోత" అన్నట్లు తను మహారాజులా పహోటల్లోనో తిని హాయిగా సినిమాలు చూస్తూ ఇంట్లో భార్యాబిడ్డల్ని ఏడ్పించి ఏం సుఖం పొందుతారో అటువంటి మగ మహానుభావులు!!

ముఖ్యంగా విద్యార్థుల్లో కూడా ఈ

(53వ పేజీ చూడుము)

## అనూరాధ డైరీ

'ఒక్క నిజంచెప్పు నీవు అబద్ధం అవుతావు' అన్నాడు ఒక ప్రసిద్ధ తత్వవేత్త. మన తత్వవేత్తలందరికీ ఇది అనుభవమే!

'నిజం నిష్ఠూర్యంరా నాయనా' అంటుంది మూడుకాళ్ళ ముత్తవ తల్లి సైతం!

'నిజం చెబితే నిప్పు పుట్టవు తల్లీ' అంటారు వ్యవహారదక్షులు.

'నిజం చెబితే దేవుడు అనుగ్రహిస్తాడు'—ప్రవక్తలంటారు!

అయితే అది అప్రస్తుతం. కనిపించని దేవుడికన్నా కళ్లో కూడా కనుపించే జీవుడు ముఖ్యుడు. వీడు నిజం చెబితే ఆగ్రహిస్తాడు. అబద్ధం చెబితే అవమానిస్తాడు. వాడికి నిజానిజాలు కాదు కావలసింది. సందర్భానుకూలమైన 'ఇజాలు'!

నేను అమ్మమ్మల మాటలు నమ్మేదానమ్మని! నాకన్న వాళ్లు అనుభవజ్ఞులు అనే జ్ఞానమే ఈ 'అ' జ్ఞానానికి కారణమేమో! అమ్మమ్మ చెప్పేది 'ఏకటైన నిప్పంటే అదే కాల్తుంది పిచ్చిదానా' అని.

అయితే నిజంచెబితే నిష్ఠూరపడే వాళ్ళకి ఒక్కటే ప్రశ్న. నిజం చెబితే అంత నిష్ఠూర్యపడిపోవడం ఎందుకు? అంత భరించలేని నిజాలకు మనం బాధ్యులం కావడం మనతప్పు కాదా? మన లోపతాపాలే మన విలువలు నిర్ణయిస్తాయి కాదా?

ఇంతకీ నేను తోచని టైంలో డైరీ రాసుకుంటూ మొదలెట్టాను. ఇదివరకు ఇంటిఖర్చుల వివరాలూ అవీ, యివీ, ఏవో రాసుకునేదాన్ని. వచ్చి వచ్చి యీనాటికి నేనూ లంపటంలోకి దిగాను.

మధ్యతరగతి కుటుంబాలలో—అందులోను ఉమ్మడి కుటుంబాలు ఒక్కొక్కటి విడిపోతున్న సందర్భంలో సంసార సుఖం ఎండమావులై పోతున్న పరిస్థితుల్లో...విపరీత పరిణామాలు ఎన్నెన్నో పుట్టుకొస్తున్నాయి; పుట్టి కుదుపులౌతున్నాయి.

ఆ క్రితంవరకు పాలూ నీరూ అయిన వారే కోపాలూ కన్నీరూ అవుతున్నారు. అంతులేని అహంభావాలు పెచ్చురేగి ద్వేషం, కావేషం మితిమీరిపోతున్నది. ఐకమత్యం భంగం కాగానే ఎన్నెన్ని దుమారాలు రేగుతాయో విచ్ఛిన్నమైపోతున్న ఉమ్మడి కుటుంబాల వల్ల తేలుతుంది. దీనికి అన్నాయ్ డైరీకి నానకలు మచ్చుతునక! కాకపోతే పూర్వాపరాలు తెలీని చిన్నవాళ్ళ తిరుగుబాటుకు దర్పణం! అంతేకాదు. చిన్నవాళ్ళ ప్రలాపాలకు వాస్తున్న అన్నీ తెలిసిన పెద్దవాళ్ళ మనస్తత్వానికి గీటురాయి!! అభిప్రాయభేదాలు ఆసరాగా తీసుకుని ఆయింటి పిల్లను చేసుకునో, ఆ యింటివారి నేస్తం చూసుకునో ఈ ద్వేషాగ్నిలో ఆజ్యంపోస్తున్న పెద్దమనుషుల దురంతాలకు ప్రతిబింబం! ఉమ్మడికుటుంబాల 'ఒథెల్లో' నాటకంలో ఈ 'అయాగోల' మనస్తత్వాన్ని ఆవిష్కరించి వారికుబుద్ధినీ, కుచ్చితాన్ని బహిష్కరించే కార్యక్రమానికి నాంది ప్రస్తావన. మధ్యతరగతి కుటుంబాల్లో అవతరించిన మిథ్యావాదానికీ, నిస్పృహకీ, ఇది అంతిమగీతం.

నాకు తెలుసు నేని డైరీ వ్రాస్తే నావాళ్ళకే కోపంవస్తుందని. అవును కోపమేరాకపోతే వాళ్ళు మధ్యతరగతి వాళ్లు కానేకారు. కోపమే రాకపోతే, అహంభావమే కాకపోతే వాళ్లకు తర్వాత పట్టరాని ఆనందం, ప్రేమరానేరావు!

నేను నా చుట్టుపట్ల సంఘాన్ని చూస్తున్నాను. నా ఆత్మనిరంతరం నాకు ప్రత్యక్ష వ్యాఖ్యానం చెబుతోంది. యథాతథంగా నాలో విన్నదంతా రాసుకున్నాను.

ఇక ఈ డైరీ నేనింతటితో ఆపినా నా ఆత్మ వ్యాఖ్యానం మానదు.

నా డైరీయే చలనచిత్రమై నాకళ్ళ ముందు సంఘంగా ఎప్పుడూ కనిపిస్తూనే ఉంటుంది.

అత్తలు—కోడళ్లని, కోడళ్లు అత్తలనీ, రాను రాను అన్నాయ్‌లు బాబాయ్‌లనీ, చెల్లాయ్‌లు వదినెలనీ అదేపనిగా ఇదేజన్మగా వ్యాఖ్యానం చేయడం మానేవరకు ఈ డైరీ కలంతో కాకపోయినా కాలంతో సాగుతుంది.

అనూరాధ అపరాధ పరిశోధకురాలు కాదు. అపరాధశిక్షలు చూసి ఏంచేయలేకుండిపోయే విషాదగాథ! ఆయన పాదసేవలో అమ్మలాగే జీవితం ఎలా గడుపుకోవడమా అని ఆలోచించుకునే ఆత్మపరిశోధకురాలు.

తనకుమించిన ఆలోచనలూ, తలకుమించిన సూచనలూ చేయని మధ్యతరగతి మగువ.

మొట్టమొదటి, చిట్టచివరి తెగింపూ అంతకు ముగింపూ కూడా ఇదే.

ఇట్లు

అనూరాధ

# ఉమ్మడి కుటుంబాలు

సాధ్యమైనంత దీర్ఘకాలం పొరపొచ్చాలు లేకుండా మన కుటుంబాలు ఉమ్మడిగా జీవించాలని మన పెద్దల ఆశయం. కొంతవరకు అట్లాగే జీవించే ఆచారంకూడా మనలో అనాదిగా వస్తోంది. దంపతుల పరస్పరానురాగం వారికి తమ కన్నబిడ్డలమీద గాఢమైన ప్రేమ కని పెంచిన తలిదండ్రుల మీద బిడ్డలకు సహజంగా కలిగే విశ్వాసం మానవజాతిలో వీరిని ఒక కుటుంబముగా బంధించి కొంతకాలం ఉంచుతై. పశుపక్ష్యాదులలో కూడా ఈ కుటుంబ బంధం కొంతవరకు గోచరిస్తునే ఉంటుంది. మానలకు రెక్కలొచ్చి స్వతంత్రంగా జీవించే తాహతు వచ్చేవరకు మాత్రమే వాటిలో ఈ కుటుంబ సంబంధం కనబడుతుంది. తిరువాత దేనిత్రోవ దానిదే. కాని మనుష్య కుటుంబములో మాత్రం ఈ అనుబంధం అంత తేలికగా సడలదు.

మనుష్యుడు ఉత్తమ సృష్టి కావడంచేత అతనిలో ఈ బాంధవ్యం సాధ్యమైనంత దీర్ఘకాలం కొనసాగుతుంది. ఈ ప్రేమబంధమే సంతానోత్పత్తికి దాని అభివృద్ధికి కారణమౌతుంది. ఇదిమనలో ఇప్పటికంటె పూర్వం అనగా కొంతకాలం క్రింద ఎక్కువగా వుండేదేమో! కుమాళ్లు, మనుమలు, మునిమనుమలు కూడ కలిసిమెలిసి ఏక కుటుంబంగా కాపురం చేస్తూ వుండడము అక్కడక్కడ ఇప్పటికీ మనం చూడవచ్చు.

## గృహనీతి

మనుష్యులలో కుటుంబం సాధ్యమైనంత దీర్ఘకాలం ఉమ్మడిగా వర్ధిల్లడానికి వారి కున్న వివేచన, దూరదృష్టి కారణం. కుటుంబ క్షేమానికి వారు కొన్ని కట్టుబాట్లు చేసుకున్నారు. ఈ కట్టుబాట్లు సాంప్రదాయముగా వారు పాటిస్తూవచ్చారు. రాజకుటుంబాలలో జ్యేష్ఠ కుమారుడు రాజ్యార్హుడౌతూ వచ్చాడు. సామాన్య సంసారంలో తండ్రి తిరువాత తండ్రంతవాడుగా పెద్దకుమారుడు కుటుంబ యాజమాన్యం వహిస్తూ వచ్చాడు. కుటుంబంలో ఇతరసభ్యులంతా ఈ మర్యాదను పాటిస్తూ, పెద్దవారియెడ ఉచిత గౌరవం చూపుతూ కుటుంబంలో మెలగుతూ వచ్చారు. ఈ ఉమ్మడి కుటుంబాలలో కూతుళ్ళు కొడుకులూ మనుమలు మనుమరాళ్లూ మునిమనుమలూ కూడ వారి వారి స్థానాలను బట్టి వారి అర్హతను గుర్తించి సామరస్యముతో మెలగుతూ వచ్చేవారు. కుటుంబం సుభిక్షంగా సాఫీగా సాగిపోతూ ఉండేది. ఈ సామరస్యానికి ఎప్పుడు వ్యాఘాతం కలిగితే అప్పుడు ఆకుటుంబం విచ్ఛిన్నమయేది. ఒక పెద్దకుటుంబం ఎక్కువకాలం ఉమ్మడిగా ఉండడం ఆ కుటుంబ యోగ్యతకు తార్కాణంగా భావించబడుతూ వుండేది.

మన భారత రామాయణాది పురాణ గ్రంథాలు మనదేశములో పూర్వం జీవించిన ఉమ్మడి కుటుంబాల ఉదంతాలే! మన ధర్మశాస్త్రాలు ఉమ్మడికుటుంబ సాంప్రదాయం మీద ఆధారపడ్డవే. ఉమ్మడి కుటుంబంలో కౌరవ పాండవులు ఎలా పుట్టి పెరిగారో, వారిలో రానురాను స్పర్ధలెట్లా ఏర్పడ్డాయో



అందులో కొందరికి స్నేహమెట్లా పెంపొందిందో భారతం చక్కగా వివరించింది. శ్రీరాముడు ఉమ్మడి కుటుంబంలో సవతి తల్లి కోర్కె తీర్చి తండ్రిమాటను దక్కించడానికి ఎంత త్యాగం చేశాడో అతడు అతడి సవతి తమ్ములయిన లక్ష్మణాదులు పరస్పరం ఎంత అనుకూలంగా ప్రవర్తించారో, రామాయణం కర్ణపేయంగా వర్ణిస్తోంది. మొత్తం మీద మన పురాణేతిహాసాలు ధర్మశాస్త్రాలు పూర్వం మన ఉమ్మడి కుటుంబాలలో వుండే వ్యక్తులను వారి మనస్తత్వాల వైవిధ్యాన్ని వాటి సంఘర్షణవల్ల ఉత్పన్నమయ్యే సమస్యలను వాటి పరిష్కార ప్రయత్నాలను వర్ణించేవి అని ఒక విధంగా చెప్పవచ్చునేమో!

## ఉమ్మడి—గుమ్మడి

ఉమ్మడి కుటుంబం గుమ్మడితీగ వంటిది. విస్తరించి పెరిగినప్పుడది ఏపుగ పెరిగి గుబురొత్తిన గుమ్మడి తీగవలె ఉంటుంది. గుమ్మడి మొక్క సాగుకొని తీగలు వారి వ్యాపించి రెమ్మరెమ్మకు భూమిలో నాటుకొని వేళ్లు నాటించి ఎక్కడికక్కడే ఆహారాన్ని కూర్చుకొని బలపడి పచ్చని పూలతోను పిందెలతోను కాయలతోను కొంతకాలం ఎంతో చూడ ముచ్చటగా ఉంటుంది. అట్లాగే ఉమ్మడి కుటుంబం కూడాను. పూసిన పూలు కాసిన కాయలు అన్నీ ఒక్కతీరుగా ఉండవు. ఉమ్మడి కుటుంబ సభ్యులలో కూడ అనేక తీరు తెన్నులుంటాయి. గుమ్మడితీగ పెంపు ముఖ్యంగా తల్లి మొదలుమీద ఆధారపడ్డా సాగిన తీగలు ఎక్కడికక్కడ భూమిలో వేళ్లను దించుకొని కొంతవరకు స్వయం పోషకమైనట్టే ఒక పెద్ద ఉమ్మడి కుటుంబంలోనూ కలిసి కాపురంచేసే చిన్న చిన్న సంసారాలు తమ చిల్లర అవసరాలకన్నిటికీ కుటుంబ యజమానిమీదనే ఆధారపడక అతడి సమ్మతితోనే కొంతవరకు స్వయం పోషకంగా ఉంటాయి. కాని అంతటా కేంద్రాధిపత్యానికి లొంగి దానివల్లనే పుష్టిని పొందుతూ కుటుంబానికి సంబంధించిన అన్ని విషయాలలోను దానిమీదనే ఆధారపడి దానికనుగుణ్యంగానే ప్రవర్తిస్తూ ఉంటాయి.

గుమ్మడి పూతలోను కాపులోను వైవిధ్యమున్నట్లు ఉమ్మడి కుటుంబ సభ్యులలోకూడ వేర్వేరు తీరులుంటాయి. కొందరువిద్యాధికులుంటారు. కొందరు కాయకష్టంఎక్కువగా చేయగలవారుంటారు. కొందరు ఎక్కువ ప్రయోజకులై ఆర్జనపరులుగా ఉంటారు మరికొందరువృద్ధాప్యం చేతనో పుట్టుకచేతనో అశక్తులుగా ఉంటారు. అందరూ ఒక్కతీరుగా ఉండరు. వేరు వేరు కుటుంబాలలో పుట్టి పెరిగి వేరు వేరు స్వభావాలు గల కోడళ్లు ఉమ్మడి కుటుంబంలో సభ్యులుగా వస్తారు. ఉమ్మడికుటుంబసభ్యులంతా ఎదటివారి మనస్సును కనిపెట్టి వారి వారి వ్యవహారాలను యథాశక్తిని నిర్వహిస్తూ తమ తమ అవసరాన్నిబట్టి ప్రయోజనం పొందుతూ కలిసికట్టుగా ఏ పొరపూ లేకుండా మెలకువతో మెలగాలి. ప్రతివ్యక్తి ఇట్లా నడుచుకున్నంతకాలమే సమిష్టి కుటుంబం సవ్యంగా సాఫీగా సాగుతుంది. లేకపోతే కలతలపాలై పోతుంది.

## గృహం—రాష్ట్రం

ఉమ్మడి కుటుంబాన్ని ఒక ఫెడరల్ ప్రజాస్వామ్య వ్యవస్థకు పోల్చవచ్చు. ఫెడరల్ ప్రజాస్వామ్యంలో రాష్ట్రాలు కేంద్రాధిపత్యానికి లొంగి పరిమితమైన స్వతంత్రాన్ని అనుభవించినట్లు ఉమ్మడి కుటుంబంలోని చిన్న చిన్న సంసారాలన్నీ కేంద్ర యాజమాన్యానికి లొంగి కొన్ని హద్దులలో తమ తమ భార్యాబిడ్డల బాగోగులను కేంద్రాధికారానికిగాని పాటి సంసా



ఉమ్మడికుటుంబాలు కొత్తకోడళ్లకు గుణ'పాఠశాల'లు

రాల క్షేమానికి గాని భంగం లేకుండా చూచుకుంటూ ఉంటాయి. ఈ చిన్న సంసారాల సమ్మతితో ఉమ్మడి కుటుంబానికి పెద్ద అయిన తండ్రో పెద్దకుమారుడో కేంద్రాధిపత్యం వహిస్తాడు. అతడు తండ్రి అయితే తన కుమాళ్లతోను జ్యేష్ఠకుమారుడైతే తన తమ్ముళ్లతోను ముఖ్యంగా సంప్రదిస్తూ ఉమ్మడి కుటుంబ వ్యవహారాలు నడుపుతూ ఉంటాడు. యాజమాన్యం పెద్దకొడుకుమీద పడ్డప్పుడు అతని భార్య అయిన పెద్దకోడలు కూడ అతనితోపాటు కొన్ని బాధ్యతలు నిర్వహిస్తుంది. ఆ నిర్వాహంలో ఏ లోపం వచ్చినా అందరూ ఆమెను దూయబడతారు. అందుకే 'ఆచేయి ఈచేయి అద్దగోడకీ, అమాటాయీమాట పెద్దకోడలికీ' అనే సామెత పుట్టింది. బాధ్యత నిర్వహించే వాళ్ళకేగా ఏమాటవచ్చినా! ఇతడు ఉమ్మడి కుటుంబపు సమష్టి క్షేమానికీగాని అందులో భాగాలయిన చిన్న సంసారాల న్యాయమైన వ్యష్టి స్వాతంత్ర్యానికీగాని భంగం లేకుండా ప్రత్యేక శ్రద్ధ వహిస్తాడు. కుటుంబపు ఉమ్మడిసొత్తు పెంపొందినా దాన్ని ఉమ్మడి అవసరాలకు తగినట్లు తన సలహాదార్ల సంప్రదింపుతో నడుపుకుంటూ ఉంటాడు. ఉమ్మడిసొత్తుమీద వచ్చే ఆదాయం, కుటుంబసభ్యుల ఉమ్మడి సంపాదన, నిల్వ చేసి కుటుంబానికి అవసరమైన అన్నవస్త్రాలకయ్యే ఉమ్మడి ఖర్చులకు వినియోగించి మిగిలినదానిని ఉమ్మడి ఆస్తి పెంపొందించడానికీ కార్యక్రమాలు మొదలైన ఉమ్మడి అవసరపు ఖర్చులకీ వినియోగిస్తాడు. చిన్న సంసారాలవారు ప్రత్యేకంగా సంపాదించుకొన్న సొమ్ములో వారి వారి సంపాదననుబట్టి ఏ కొద్దిభాగమో యజమాని సమ్మతిమీద తమ చిల్లర అవసరాలకు ఉంచుకొని మిగిలిన మొత్తాన్ని కుటుంబయజమానికిస్తారు. ఫెడరల్ రాజ్యాంగంలో రాష్ట్రాలకు కేంద్రానికి వేరు వేరు ఆదాయాలు అధికారాలు ఉన్నట్లే ఉమ్మడి సంసారంలో కూడా వున్నవి. ఉమ్మడి ఆస్తిమీద ఉమ్మడి ఆర్జనమీద వచ్చేరాబడి కేంద్రానికి చెందుతుంది. చిన్న సంసారసభ్యులు కార్యక్రమాలలోను వారి ప్రత్యేక ప్రజ్ఞచేత గెలుచుకొన్న కట్నకానుకలు వ్యక్తిగతమైన పెట్టుబళ్లు మొదలైనవి చిన్న సంసారాలే ఉంచుకోవచ్చు. అవసరాన్ని బట్టి ఈ ఆదాయాలను సమ్మతిమీద సర్దుకుంటూ వుంటారు. అధికారాలుకూడ ప్రత్యేకంగా ఎవరివి వారికున్నాయి. ఉమ్మడిగా కూడా కొన్ని ఉంటాయి. సామరస్యంతో సర్దుకుపోతూ ఉంటారు.

## గుణపాఠశాల

సమష్టికుటుంబం సక్రమంగా సాగితే ఆ కుటుంబానికీ అందులో సభ్యులకు మాత్రమేగాక మొత్తంమీద సంఘానికికూడ కొన్ని ప్రయోజనాలు దానివల్ల ఉన్నాయి. పదిమందిలో పుట్టి పెరిగిన వాళ్లకు ఒంటెట్టు రాములింగాయమతం ఉండదు. 'చిన్నినా పొట్టకు శ్రీరామరక్ష' అనే స్వార్థపరత అంతగా వాళ్లలో ఉండదు. సహనం, సహకారం, సంఘీభావం సేవాధర్మం, పొదుపు, సాటివాళ్లలో మెలిగే నేర్పు, అణకువ ఓర్పు మొదలైన అనేక సద్గుణాలు పదిమందిగల కుటుంబంలో సామాన్యంగా ఉండే క్రమశిక్షణవల్ల అలవడడానికి ఎక్కువ అవకాశం ఉంటుంది. కొత్తగా పుట్టినింటి నుండి అత్తవారింటికి కాపురానికి వచ్చే కోడళ్ళు మొదట్లో కొంతకాలమైనా సమష్టి కుటుంబంలో మెలగడం ఎంతో అవసరం. ఉమ్మడి కుటుంబంలో కొత్తకోడలు ఎంతో అనుభవం సంపాదించవచ్చు. అత్తవారింట్లో కొత్తకోడలి బ్రతుకు మొదటిరోజులలో అసిధారావ్రతంగా ఉంటుంది. కొన్ని ఉమ్మడికుటుంబాలలో, ఏ సందర్భంలో ఎట్లా ప్రవర్తించాలో తెలియదు. వడసారం ఇరవైఏళ్ళయినా ఉండేదికాదాయె! ఏ




## ★ ఉమ్మడి కుటుంబాలు ★

మాట అనాలో, అనకూడదో, ఏమంటే తప్పో, ఏమనకపోతే తప్పో—అంతా ఒక అయోమయం—అవధానం—అసిధారా వ్రతం! అంతో ఇంతో కోడరికానికి ఒగ్గుకొని అత్తగారిచేతికింద మెలిగిన కోడలు గృహకృత్యాలలో రాటుదేలుతుంది. కొత్త కోడలికి అత్తింటి కాపురం కొన్నాళ్ళయినా చాలా అవసరం. ఈ అవసరం కాపురానికి రాగానే పోరుగూళ్లో వేరింటి కాపురం పెట్టిన ఒంటరిదంపతులకు బాగా తెలిసివస్తుంది. కాపురానికి వచ్చేరావడంతోనే వేరింటి కాపురం పెట్టిన పడుచుల పాట్లూ పెట్లూ వేరు. 'పడుచుల కాపురం చితుకులమంట' అంటారుగదా! కనుక కొత్తకోడళ్ళకు ఉమ్మడి సంసారంలో అత్తగారి చేతికింద హీనపక్షం కొన్ని నెలలైనా తర్ఫీదు అవసరం.

### ఉమ్మడి సంస్థానం

నేను కొంతకాలం క్రిందట ఒక ఊళ్లో ఒక పెదకుటుంబం ఉమ్మడిగా కాపురం చేస్తూవుండడం చూశాను. ఆ కుటుంబాన్ని చూచినప్పుడు నాకు సంభ్రమాశ్చర్యాలు కలిగినాయి. ఇదరు వృద్ధదంపతులు. వారికి ఆరుగురు కుమాళ్ళు. నలుగురు కుమార్తెలు. అంతా పెద్దవాళ్లయి కాపురాలు చేస్తున్నారు. ఒక కుమార్తెది బీదసంసారం కావడంచేత ఆమె భర్తతోను బిడ్డలతోను పుట్టింటనే ఉంటోంది. ఆమెభర్త బావమరదులతో కలిసి వ్యాపారం చేసికొంటూ ఆకుటుంబంలోనే ఉంటున్నాడు. వృద్ధదంపతుల ఆర్గురు కుమాళ్ళు సంతానవంతులే. వారి పిల్లలంతా కూడా సంతానవంతులైనారు. అంతాకలిసి ఉమ్మడిగా ఒక ఇంటిలోనే ఉంటున్నారు. అనగా వృద్ధదంపతుల మనుమళ్లే. మనుములు మునిమనుములు కూడా ఆ ఇంటిలో కాపురం చేస్తున్నారన్నమాట! అది ఒక పెద్దభవంతి. ముందొక పెద్దవసారా. అందులో పెద్ద అరుగులు. భవంతిలో ప్రవేశించగానే మధ్యగా ఒక పొడవైన దీర్ఘచతురస్రాకారపునడవ. దాని కిరుప్రక్కలా పెద్ద పెద్ద గదులు. ఒక్కొక్క కుటుంబానికి ఒక్కొక్క గది ప్రత్యేకంగా. ఇంటివెనుక విశాలమైనదొడ్డి. దొడ్డిలో ఒక పెద్దబావి. స్త్రీలకు పురుషులకు స్నానపానాదులకు ప్రత్యేకమైన వసతులు. అందరికి ఉమ్మడి వంట ఇల్లు, భోజనశాల. మొత్తంమీద కొందరు అప్పుడప్పుడు గ్రామాంతరాలకు పోయినా ఎప్పుడు చూచినా ఆ ఇంటిలో తీయకుండా పదిహేను మంది దంపతులైనా ఉంటారేమో అనిపించింది. ఇక పిల్లలకు లెఖ్ఖే లేదు! ధృతరాష్ట్ర సంతానం! ఆ యింటిలో మొత్తం జనాభా కూన గుజ్జూ కలిసి షుమారు ఒక వందవరకు ఉంటారేమో! ఇక వచ్చేపోయే చుట్టాలమాట చెప్పనక్కరలేదు! ఆ కుటుంబంలో అంతా అజ్ఞానపరులే; చదువుకొనే చిన్నపిల్లలు తప్ప. ఒక కుమారునికి కిరసనాయిలు ఏజెన్సీ, ఒకరికి సిమెంటు సాపరాయి వ్యాపారం. ఇంకొకరికి సరాబు కొట్టు, ఒకరికి బట్టలకొట్టు మరొకరికి ఫాన్సీ షాపు. ఇంకొకరికి చిల్లర కొట్టు. మిగిలిన కొందరికి వ్యవసాయం. అంతా అన్ని పనులూ చేస్తూ ఆర్జిస్తూ ఉండేవారే. మొత్తం మీద ఆ కుటుంబం మూడు పూలు ఆరు కాయలుగా సాగుతూ ఉండేది. ఆ యింటి కులవృద్ధు నన్నా యింటికి పిలిచి సగర్వంగా అందరిని చూపించాడు. ఇంతమంది ఆయింట్లో పొరపొచ్చాలు లేకుండా కాపురం చేస్తూ ఉండడం నాకు వింతగా తోచింది. ఆయింటిలో ఏ శుభకార్యంవచ్చినా ఎంతో శోభగా జరిగేది. అంగబలం అర్థబలం ఉంది. అందరూ తలోపనీ కలిసికట్టుగా ఆడవాళ్లూ మగవాళ్లు అందుకొనేవాళ్లు. ఇట్లా కొంతకాలం గడిచింది. ఆ వృద్ధదంపతు లిప్పుడు లేరు. వారు కన్నుమూయడంతో ఆసంసారంవిచ్ఛిన్నమై ఆ కుటుంబ సభ్యులు ఎవరికి వారే యమునాతీరే అన్నట్లు అయినారు. వృద్ధ దంపతులున్నంతకాలం ఆ కుటుంబం నిండుగా గుంభనగా ఏ వెలితి కనబడకుండా జరిగింది. పెద్దవాళ్ల నిష్క్రమణతో గుమ్మడికాయ భిన్నమన్నట్లు కుటుంబం విచ్ఛిన్నమై ఋణాపణాదులు వెల్లడై ఉన్న బండారం బయట పడ్డది. వెయ్యేళ్లకైనా వేరుపడక తప్పదనుకోండి! అంతకాలం ఉమ్మడిగా ఆ పెద్ద సంసారాన్ని ఒక్క త్రాటిమీద నడపడమే ఒక విశేషం. ఆ నేర్పు పోయిన పెద్దవాళ్లదే కాదూ! వాళ్లతో సహకరించిన చిన్నవాళ్ళలో కూడా కొంత ఉండదని ఎట్లా చెప్పగలం! ఇది పది సంవత్సరాల క్రిందటిమాట.

### ఉపేక్ష

ఇప్పుడు కాలం శీఘ్రగతిని మారిపోతోంది. అటువంటి ఉమ్మడి సంసారాలిప్పుడు మచ్చుకైనా కనబడవేమో! వాటిమీద మోజు సన్నగిల్లుతోంది రాను రాను. ఇప్పటి మగవాళ్ళకు ఆడవాళ్ళకుకూడా పెళ్లయి ఒకరిద్దరు పిల్లలు పుట్టక పూర్వమే వేరు కాపురం పెట్టాలనే ఊహలు పుడుతున్నాయి.

పెద్ద వాళ్ళకే ఇప్పుడిటువంటి ఆలోచనలు కలుగుతూంటే చిన్నవాళ్ళకు కలగడంలో ఆశ్చర్యమేముంది! పూర్వం తల్లిదండ్రులు కుమార్తెను పెళ్ళి సంబంధం విచారించేటప్పుడు ఆస్తిపాస్తుల మాట ఎట్లావున్నా పదిమంది గల సంసారంలో పడనిక్కి పిల్లనిద్దామని వెతికేవాళ్ళు. ఇప్పుడు ఒకరిద్దరు తోబుట్టువులుండి ఆస్తి బాగావుండే కొద్ది కుటుంబంలో వరుడికోసం గాలిస్తున్నారు! ఇప్పుడు ఇంగ్లీషు విద్య నభ్యసించే కుటుంబాలలో—అంత ఆచగువులకే దిగుతున్నారనుకోండి—చదువుకనో ఉద్యోగాలకనో ఆడపిల్లలూ మగపిల్లలూ కూడా తలోచోట వేరు వేరుగా ఉండి పోవలసివస్తోంది. దీనితో చాలవరకు ఉమ్మడి కుటుంబ సమస్య తీరిపోతూంది! దీనికి తగ్గట్టు కుమారుడు ప్రయోజకుడు కాగానే అతడికి వివాహంచేసి అతడికివ్వవలసిన ఆస్తిని పంచి ఇచ్చి వేరే ఉండమని తండ్రే కొన్ని కొన్ని సందర్భాలలో చెప్ప వలసి వస్తోంది ప్రస్తుత రాజకీయ సాంఘిక అవసరాలను బట్టి.

ఎక్కువ మంది బిడ్డలను కన్న ఇల్లాలిని కడిపెడు సంతానాన్ని కన్నదని కష్టసుఖాలెరిగినదని సంఘంలో గౌరవించేవారు పూర్వం. ఇప్పుడట్లా కాదు, అసలు బిడ్డలు లేని స్త్రీని చిన్నచూపు చూచినట్లే ఎక్కువ సంతానాన్ని కన్న ఇల్లాలిని కూడ ఏవగింపుతో చూడడం సాగుతుందేమో ఇక ముందు! మితంగా నల్గురైదుగురుకంటె ఎక్కువ కాకుండా కన్న ఇల్లాలే మర్యాదతో చెలామణీ అవుతుందేమో ముందుముందు! అందులో మగపిల్లలైతే మరీ విశేషం! కుటుంబనియంత్రణ రోజులాయె ఇవి! మితాహార విహారాదులతో పాటు మిత సంతానంకూడా అవసరమే అవుతుంది.

ఏ కుటుంబాన్ని తీసికొన్నా అది మొట్టమొదట ఇద్దరు దంపతులతో ప్రారంభమౌతుంది. ఇద్దరు ముగ్గురౌతారు. ముగ్గురు నల్గురు. ఇట్లా ఆ కుటుంబం చిన్నదిగానో పెద్దదిగానో కొంతవరకు పెరిగినతరువాత ఆ పెంపు నిలచిపోతుంది. ఆ కుటుంబంలో మళ్లీ ఒక్కొక్కరు పెద్దగా దంపతులై మళ్లీ ఒక్కొక్క కుటుంబానికి కారకులౌతారు. సాధారణంగా రెండుమూడు తరాలవారు కొద్దిమందైతే ఒక ఉమ్మడి కుటుంబంగా కలిసి కొంతకాలం కాపురం చేయవచ్చు. కుటుంబం అంతకంతకు పెరిగినకొద్దీ జీవితావసరాలనుబట్టి స్థలాంతరాలకు వలసపోయి ఒక తరంవారు ఇంకొకతరంవారికి దూరమౌతారు. మొదట ఒక కంచంలో తిని ఒక మంచంమీద పండుకొన్న ఏకోదరులే పెరిగి పెద్దవారై భార్యలొచ్చి బిడ్డలకన్న తరువాత ఎవరి భార్యాబిడ్డలను వారు చూచుకొంటూ ఒకరికొకరు దూరమౌతారు. ఇక వారి బిడ్డలు ఆ బిడ్డలబిడ్డలు ఒకరికొకరు ఎంత దూరులౌతారో మన కందరికీ అనుభవమే! ఇప్పటి ఈ విశాల ప్రపంచంలో బ్రతుకుబాటను వెతుక్కుంటూ తలో త్రోవపట్టి స్థలాంతరములలో వేర్వేరు వేషభాషల నలవరచుకొని ఒకరినొకరు గుర్తించలేనంతగా మారిపోతారు. ఇక నీ జ్ఞాతులమధ్య ఆస్తి సంబంధమైన పేచీ లేమైనా ఉంటె ఇక చెప్పనే అక్కరలేదు! జ్ఞాతివైరి నిప్పువంటిదంటారు. అది ఒక్కొక్కప్పుడు తీవ్రమై అటూ ఇటూ కూడ దహిస్తుంది. 'జ్ఞాతిశ్చే దనలేన కిం' అన్నాడు భర్తృహరి.

## అపేక్ష

బాగా ఆలోచిస్తే మనమంతా ఆదిదంపతులైన శివకేశవుల బిడ్డలమని తేలుతుంది. మొట్టమొదట మనమంతా తల్లిదండ్రులతో కలిసి ఉమ్మడి కుటుంబంగానే ఉండి ఉండాలి. రాను రాను అంతకంతకు మనం అసంఖ్యాకులంగా పెరిగి ఉమ్మడి కుటుంబంలోంచి చీలి బ్రతుకు తెరువు వెదుక్కుంటూ వేరు వేరు త్రోవలుతొక్కి ఒకరికొకరు దూరమై మొత్తంమీద భూతలమంతా వ్యాపించాం. మనం నివాసంగా ఏర్పరచుకొన్న ప్రదేశపు శీతోష్ణాగులను బట్టి జాతిమత వర్ణభేదాలకు లోనై పూర్వస్మృతిలేక ఒకరినొకరు గుర్తించడానికి వీలులేనంతగా మారిపోయినాము. స్వార్థపరులమై అసూయా ద్వేషాలనే అడ్డుగోడలు కట్టుకొని సంకుచితదృష్టితో 'నన్ను ముట్టుకోవద్దు నామాలకాకి' అనే ధోరణిలో సాటి మానవుని బహిష్కరించి ఉమ్మడి సొత్తైన ప్రకృతిసంపదను వీలైనంత వరకు దౌర్జన్యంతోను మాయోపాయాలతోను ఒకరితోనొకరు పోటీపడి ఆకట్టుకొని ప్రపంచాధిపత్యానికి అంగలారుస్తున్నాం. మానవజాతిని నిర్మూలించగల మారణాస్త్రాలను నిర్మించుకొన్నాం. ఒకరిమీదనొకరు వాటిని ప్రయోగించడానికి సంసిద్ధులమై కూర్చున్నాం. ఇదంతా ఒక కుటుంబానికి చెందిన మన మానవజాతిలో పుట్టిన ముసలం, దీనివల్ల ఒకరిమీద ఇంకొకరికి అనుమానం! అపనమ్మకం కలిగి మనస్సులలో కలవరం, భయం, ఆందోళన ప్రబలినాయి. అవినీతి అశాంతి హెచ్చినై. ఈ మానవకుటుంబం సర్వనాశనం కాకుండానిలచి శాంతి సౌఖ్యాలతో బ్రతకాలంటె అంతా ఏకమై భేదభావాలనువదలి ప్రపంచ ప్రజాస్వామ్యాన్ని ఏర్పరచుకొని సామరస్యంతో మెలగాలి. ఈ అవసరాన్ని అందరూ చాలవరకు గుర్తించారిప్పటికే. ప్రపంచపు అగ్రనాయకులు కూడ ఈ సత్యాన్ని గుర్తించి ఉమ్మడి కుటుంబ వ్యవస్థను ప్రపంచంలో నిర్మించాలని ఇప్పుడిప్పుడే కలలు కంటున్నారు. ఇది శుభసూచకం. ఆ ఉమ్మడి కుటుంబమే మానవజాతి ఆశయం. ఆ కుటుంబంలో ప్రతివ్యక్తి మొత్తం కుటుంబం కోసం కుటుంబమంతా ప్రతివ్యక్తికోసం జీవించాలి. అప్పుడే అదిఅసలైన ఉమ్మడి కుటుంబం. ★

# ఆడవారి ఆడంబరం

(49 పేజీ వ తరువాయి)

జబ్బు ఉంటుంది. ఇంట్లో ఏ ఫ్రెండు ఇంటికి చదువుకుంటానికనో లేకపోతే ప్రైవేటుక్లాసు ఉందనో చెప్పి పెద్దవాళ్ళను మోసపుచ్చి సినిమాలకి వెళ్ళటం. చాలామంది ఇలా చేస్తూనే ఉంటారు. కానీ, నష్టము తమకేనని తెలుసుకోలేరు. నేడు సినిమాకోసం అబద్ధం ఆడి వెళ్లాల్సిన అగత్యం ఏమొచ్చిందో!

అంతకంటే హాయిగా పొద్దుటే పని ముగించుకుని ఏ చక్కని పుస్తక పఠనంతోనైనా కాలం గడిపెయ్యవచ్చు. నవ్వు పుట్టించే హాస్యరచనలయినా చదువుకోవచ్చు. శృంగారానికి ప్రబంధాలలాటివి. భక్తికి భాగవతం లాటివి. చదువుకుంటూ నవ్వుకుంటూ అనుభవించవచ్చునే!

భర్త, భార్యా కలిసి సరదాగా పుస్తకాలు (ప్రబంధాలులాంటివి) చదువుతూ నవ్వుకుంటూ అంతులేని ఆనందాన్ని అనుభవిస్తూ పొందేసుఖము సినిమా చూస్తే వస్తుందా?

ఇంగ్లీషులోనూ, తెలుగులోనూ మంచి పుస్తకాలు చదువుతూంటే ఎంతో భాషాభివృద్ధి ఎన్నో సంగతులు మనకు తెలియనివి తెలుసుకోవచ్చు. నయా పైసా ఖర్చు లేకుండా సినిమాలతో టైము వృథా గాకుండా జీవితం ఆనందమయం చేసుకోటం భార్యాభర్తలిద్దరిలోనూ ఉంటుందకదూ.

అలాగని అసలు సినిమాలు చూడవద్దని అనటంలేదు సుమండీ! ★





 

# ఉత్తరాలు



(2-వ పేజీ తరువాయి)

ఆంధ్ర వాఙ్మయములో నేను చెప్పుకోతగ్గ వ్యక్తి శ్రీ తల్లావఝ్ఝలవారని తెలిసినప్పటినుంచీ ఆ మహామూర్తిని తెలుసుకోవాలన్న వాంఛ కలిగింది. ఆ వాంఛ మీ సంచిక (10-2-'60) ద్వారా తీరినది. ఇది ఎంతైనా కొనియాడదగినది.

ఎస్. నారాయణరావు,
ఎమ్. రామస్వామి, హైదరాబాద్.

* * *

3-2-60 సంచికలోని "నుడికట్టు—14" లో "20" నిలువుకు జవాబు "కుతూహలం" "27" అడ్డము జవాబు "అకళంకం" గదా! మీరు అలా ఇచ్చారు ఒకదానికొకటి పొత్తు కుదరటంలేదు. "20" నిలువు "కుతూహళం" అయినా, "27" అడ్డము "అకలంకం" అయినా వస్తుంది. ఈ రెండిటిలో ఏదైనా సాహిత్యరీత్యా తప్పని నా ఉద్దేశం.

చిక్కాల గుణనాథరావు, వాల్తేరు.

* నిలువుకు జవాబు కుతూహలం అని వస్తుంది. కనుక అడ్డం జవాబు అకలంకం అని రావాలిగాని అకళంకం అని రాదు. అకలంకం, అకళంకం రెండూ రైటే.

* * *

వారపత్రిక (10-2-60) లోని నుడికట్టులో 10 నిలువుకు మీరివ్వకుండా వదలివేసిన ఆధారము నేనిస్తున్నాను. "హారం ప్రారంభంలో మీరు చివర కలిపి చేయి తుడుచుకోండి" (జవాబు "గుమాల")

వై. రామమోహన్, వాల్తేరు.

* * *

గిరీశం ఉపన్యాసాలు సినిమాభాగానికి ఒక ప్రత్యేక ఆకర్షణ.

టి. యస్. మునిరామయ్య, కదిరి.

* * *

నాకు వారపత్రికల్లో కథలను చదవటం అంటే తలనొప్పిగా ఉండేది. కాని నా స్నేహితుడొకాయనకు మీ వారపత్రిక చదవటం అలవాటు. ఒక శుక్రవారం నాడు నేను నా స్నేహితునితో బజారుకెళ్ళాను. ఆయన పత్రిక ఏజెంటువద్దకువెళ్ళి పత్రిక వచ్చిందా యని ప్రశ్నించారు. ఏజెంటు రేపు వస్తుందని జవాబిచ్చాడు. మరునాడు ఆఫీసులో సాయంత్రం 6 గంటలవరకు ఉన్నాం. 6 గంటలు అవటంతోనే నా స్నేహితుడు ఒక్కసారి లేచి నేను యింక పనిచేయలేను, వారపత్రిక కొనటానికి బజారుకెళ్ళాలని నన్నుకూడా తనతో తీసుకెళ్ళాడు. వారపత్రికనుకొని రోడ్డుమీద నడుస్తూ చదవటం ప్రారంభించాడు. ఇంకా యిలు చేరానందువల్ల ప్రక్కనే ఉన్న పార్కులో కెళ్ళి పుస్తకంఅంతా ఒకసారి తిరగేశాను. వారపత్రికలో ఏదో ఆకర్షణ ఉందని తలంచి నేనుకూడ ఒకవారం పత్రిక చదివాను. అప్పటినుంచి నేనుకూడా వారపత్రిక ఎప్పుడొస్తుందని ఎదురుచూస్తున్నాను.

మొత్తంమీద మీ వారపత్రిక రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక, వినోద, విజ్ఞాన, విషయాల నెన్నింటినో ఆంధ్రప్రజల కందజేయుచున్నందుకు కృతజ్ఞులము.

జి. వీరభద్రరావు, కర్నూల్.

* * *

## నేటి పెళ్ళిసమస్యలు

10-2-60 పత్రికలో సోదరి 'సన్నా' గారు వ్రాసిన "నేటి పెళ్ళిసమస్యలు" అనే వ్యాసము నాకెంతో నచ్చింది. కట్నాల దాహంకల నేటి పెద్దలకు గుణపాఠం నేర్పే వ్యాసము వ్రాసిన సోదరికి నా హృదయపూర్వక అభినందనలు. అటువంటి దానిని ప్రచురించినందుకు ఆంధ్రపత్రికకు నా అభివందనములు.

కె. లీలావతి హిందూపురం.

* * *

అతిశయోక్తి ఏమీ లేకుండా ఉన్నది ఉన్నట్టుగా వ్రాశారు.

"ఆరువేలు" యిస్తామంటున్నారు. ఈ కాస్తా "ఎమ్. బి. బి. ఎస్" అయిపోతే మరి ప్రాక్టీస్ పెట్టాలా! వద్దా! మరి ఈ ఖర్చులన్నీ వాడి తలమీదెగా సంపాదించాలి అంటే ఎంతలేదన్నా వాడికో 'పదిహేను వేలైనా' ఇచ్చే సంబంధం దొరకాలి...' అనే పేరా చదివి ఎంతో బాధకలిగింది. ఈ మనుష్యులు కట్నాల కోసమేనా తమ కొడుకుల్ని చదివించటం... ఆ కట్నంతోనే తమ సంసారం జరగాలని అంచనా వేస్తారు కాబోలు అనిపిస్తుంది ... రచయిత్రికి ఆ పత్రిక ద్వారా నా అభివందనలు తెలియజేసుకొంటాను...

—టి. పారిజాత, గుత్తి.

## చదరంగం

17 వ సమస్యకు పరిష్కారం

మ—శ 1

## పాతచింతకాయ పచ్చడి

లలిత గారి "ఏది అందం" చాలా బాగుంది. ఆమె అన్నట్లు 'ఏది అందమో' ఇదమిత్థంగా చెప్పడం కష్టమే. ఇక పోతే పాత చింతకాయ పచ్చడిలాగ యీ పెళ్ళి సమస్యలపై వ్యాసాలు వదలడం లేదు. సాధ్యమైనంత తొందరలో వదిలిస్తే సంతోషం.

—కె. హేమాద్రి, గొల్లప్రోలు.

* * *

నేటి పెళ్ళి సమస్య రచయిత "కున్నా" గారికి నా అభినందనములు. "కున్నా" గారు చెప్పినట్లు కట్నాలు పిచ్చి వరుడుకన్నా వాళ్ళ తలిదండ్రులకే ఎక్కువ. వరుడు తలిదండ్రులే ఒక వైపు ఎక్కువ కట్నాలు అడుగుతూ, ఇంకొకవైపు తమ కూతుళ్ళకు కట్నాలు వరుడువైపువాళ్ళు ఎక్కువగా అడిగేస్తున్నారని గోల పెడతారు. ఇటి దిక్కుని వ్యాసం వ్రాసిన "కున్నా" గారికి ఈ పత్రికమూలముగా నా అభినందనములు తెలుపుకున్నాను.

—శంకరరావు, సోంపేట.

"అత్తలూ—కోడళ్ళూ" వ్యాసం వ్రాసిన "వింజమూరి లక్ష్మి" గారికి అభినందనలు. మాకు తెలిసిన ఒక అమ్మాయివుంది. బి. ఎ. ప్యాసైంది. భర్తకు కొంచెం పెద్ద ఉద్యోగమే. కొడుకుని చూసి పదిరోజులుండిపోదామని వాళ్ళ అత్తగారు, ఆడబిడ్డ వచ్చారట. వాళ్ళు వచ్చిరాగానే ఈవిడ పెట్టె బెడ్డింగ్ సర్దుకుంది. 'ఎక్కడికమ్మా ప్రయాణం' అని అత్తగారు అడిగితే 'కొన్నాళ్ళు వుండాలి. తప్పితే మీరయినా వుండాలి. మా పుట్టింటికి పోతున్నా'నన్నదట. 'ఎప్పటికైనా వుండాల్సినదానివి నీవే కదా. మేము వచ్చామని మా గురించి నీవెందుకెళ్ళాలి. మేమే పోతాం లేమ్మా' అని ఆ తెల్లవారే అత్తగారు, ఆడబిడ్డ చక్కా వెళ్ళిపోయారట. అదే చూడండి. తనవైపువాళ్ళు వచ్చినప్పుడు భర్త కఠినంగా ప్రవర్తిస్తే తన హృదయం ఎంత బాధపడుతుందో. అలాగే కదా ఎదుటివాళ్ళయినా అని గుర్తించాలి.

వి. వెంకటశేషమ్మ, బుచ్చిరెడ్డిపాలెం.

# చలనచిత్ర కళాకారులకు విచిత్ర బహుమానాలు

ఈ క్రింద పేర్కొన్న సినిమా ప్రముఖులకు ఆయా బహుమతులిస్తే సమంజసంగా ఉంటుందని నా సూచన:—

సత్యజిత్ రాయ్: రాక్ అండ్ రోల్ పాటలతో కూడిన కథలు (పథేర్ పాంచాలీవంటి కళాఖండాలకు మన దేశంలో డబ్బు రాదు.)

శాంతారాం: కత్తులుఅమర్చిన సూటు (కత్తులది ఆయన 'నవరంగ్'లో వాడేశారు.)

తెలుగు దర్శకులు: ముడిఫిల్ము (18,000 అడుగులన్నా లేకపోతే ఎట్లా?)

గురుదత్: "A Star is Born" చిత్రం కాపీ (ఒరిజినల్ చిత్రంయొక్క కాపీలు ఉండటం మంచిది.)

దిలీప్‌కుమార్: మంచి కత్తెర (సంవత్సరానికి ఒకసారైనా వాడే పనుంటుంది)

శివాజీగణేశన్: డైలాగు రిహార్సల్సుకు గాను రెండు టేపు రికార్డరులు (ఒకటైతే ఒక డైలాగుకైనా చాలదు.)

ఏ. నాగేశ్వరరావు: ??? (ఉన్న బిరుదులే మోయలేక పోతున్నారుగదా.)

తెలుగు హీరోయిన్: వెయింగ్ మిషన్ (ప్రస్తుతం అది చాలా అవసరం.)

ఓ. పి. నయ్యర్: పాత రికార్డుల సెట్టు (అప్పటికైనా కొన్ని కొత్త ట్యూన్సు చేసే అవకాశమొస్తుంది.)

శంకర్—జైకిషన్: ఎకార్డియన్ (అది లేందే క్రొత్త వరస కుదరదు.)

ముఖేష్: శంకర్—జైకిషన్ ("వారు లేందే నేను పాటకి ఎక్కడుండేవాడినో!")

తెలుగు సంగీత దర్శకుడు: హిందీ రికార్డుల సెట్టు ... (చాలా ఉపయోగం)

నిర్మాతలకి: బాక్సాఫీసు సూత్రాల పెద్దబాలశిక్ష.

ప్రేక్షకులకు: మంచి చిత్రం.

—"శేఖర్" (ఏలూరు)

# అదీ ఇదీ

## బహుపతివ్రత

బ్రెన్నర్ అనే అమెరికన్ డిస్ట్రాయర్ నౌకమీద ఇద్దరు నావికులు కూర్చుని అవీ ఇవీ చెప్పుకుంటున్నారు. వాళ్ళ భార్యలను గూర్చి మాట్లాడుకుంటూ, ఆ భార్యల పేర్లు సరిగ్గా ఒకటేనని తెలుసుకుని ఆశ్చర్యపడ్డారు. 'మా ఆవిడ ఫోటో చూడు' అంటే 'మా ఆవిడ ఫోటో చూడు' అని ఇద్దరూ చెరొక ఫోటో తీశారు, తీరా చూస్తే రెండూ ఒక స్త్రీ ఫోటోలే. ఆశ్చర్యం కొద్దీ ఆగ్రహంగా మారి ఒక నావికుడు కిందటి డిసెంబర్‌లోనూ, రెండో నావికుడు ఇటీవలనూ తమ తమ వివాహాలు రద్దు చేసుకున్నారు. ఇది కాలిఫోర్నియా, లాంగ్ బీచ్‌లో జరిగిన సంఘటన.

## గజదొంగలు

దక్షిణ మలయాలోని సెగింబాన్ అనే చోట రెండు గున్న ఏనుగులు న్యాయస్థానంలోకి ప్రవేశించి విచారణ కార్యక్రమానికి అడ్డం వచ్చాయి. ఒక ఏనుగు సింగపూర్ మాజీ ముఖ్యమంత్రి, లాయరు అయిన డేవిడ్ మార్షల్ జేబులో డబ్బు, ఒక సిగరెట్ లైటర్ దొంగిలించింది. ఈ ఏనుగులు నెగ్రి సెంబిలాన్ రాష్ట్రపరిపాలకునికి చెందినవి. వీటిని రాజనగరునుంచి షికారుకు తీసుకు వచ్చినప్పుడు ఈ పని చేశాయి.

## ఖయిదీల స్వాగతం

కేంద్ర హోం శాఖలో మంత్రి శ్రీ బి. ఎన్. దతార్ న్యూఢిల్లీలోని సెంట్రల్ జైల్‌లో నేరనిరోధక వారం ప్రారంభం చేయటానికి వెళ్ళినపుడు అక్కడి ఖయిదీలు "మీకు హృదయపూర్వక స్వాగతం!" అని ఆహ్వానించారు. ఆయన నవ్వుతూ "ఇక్కడికా? స్వాగతమా? వద్దు వద్దు. ఇది ఆహ్వానింపబడవలసిన ప్రదేశం కాదు" అన్నారు.

## ఆకాశరామన్న

పశ్చిమ రాజ్యాల రక్షణస్థావరాల రహస్యాలను ఫోటోలుతీసి మాస్కోకు అందజేయగల ఎలక్ట్రానిక్ టెలివిజన్ ఒకదాన్ని ఆకాశంలోకి పంపించటానికి రష్యావారు ప్రయత్నిస్తున్నారని "న్యూస్ వీక్" పత్రిక వ్రాసింది. ఈ టెలివిజన్ యంత్రాన్ని ఒక పెద్ద స్పుత్నిక్‌లో పెడతారట. ఆ స్పుత్నిక్ భూమికి వెయ్యినుంచి మూడు వేల మైళ్ళదాకా ఎత్తుదాకా అలా పరిభ్రమిస్తూ ఉంటుందట.



# ఆటలలో తారల అభిరుచి

అది దేశవిభజనకు ముందురోజులు. మత కలహాలతో దేశం అట్టుడుకి పోతున్న కాలం. కలకత్తాలో హుగ్లీనది నెత్తురుతో ఎర్రబారింది. రక్తపు చారలతో గోష్ఠ రూపమే మారిపోయింది. ఒక పేటలో ఒక ముస్లిం. మరో పేటలో ఒక హిందువు గూండాల గుంపులమధ్య చిక్కుకొన్నారు. గూండాలు బాకుతీసి బలంతో గుండెలో పొడవబోయారు. ఆ పిమ్మట క్షణంలోని ఉత్కంఠ సమయంలో వారు సినిమా నటులని తెలుసుకొన్నారు. అభిమానం పొంగింది. మతోన్మాదం నశించింది. సినిమా నటులను వధించక క్షేమంగా వారి ఇళ్ళలో దిగబెట్టి వచ్చారు. నాడు మృత్యువాతనుంచి తప్పించుకొన్న ముస్లిం నటుడు న్యూథియేటర్స్ నవాబ్; హిందూనటుడు బొంబే టాకీసు అశోక కుమార్. కర్కశ హృదయులకు కూడా వెండితెర ప్రముఖులపై అభిమానం అటువంటిది, ఆ రోజులలో ఈ సంఘటన గురించి వేలంవెర్రిగా చెప్పుకొనేవారు. ఈ రోజు కూడా జనసామాన్యం తారలకు సంబంధించిన సంఘటనలంటే చేతిలో పని "సినిమాటిక్" గా వదలి చెవి నిక్కపొడిచి వింటారు.

తారల జీవితం గులాబీపువ్వుల పరుపువంటిదని జనసామాన్యం అనుకొంటూ వుంటే గులాబీముళ్ళవంటిదని ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసు గుర్తుకువచ్చిన తారలంటే అదొక పెద్దవార్త. క్రికెట్ మ్యాచీకంటె మ్యాచీకి వచ్చిన తారలగురించి (మ్యాచి అనంతరం) ప్రజలు చెప్పుకొంటారు. జాతీయ క్రికెట్ పోటీలకంటె తారామణుల క్రికెట్ పోటీకి జనాకర్షణ అధికం. అత్యధికం. సినిమా రంగంలో పెళ్ళిళ్ళు, తారల రజతోత్సవాలు నటీనటుల సరదాలు, సంరంభాలు. వీటి విశేషాలు శబ్దవేగంతో దేశంలో వ్యాపించిపోతవి. ఒక్కమారు వెండితెర వెనుక జీవితానికి దృష్టి మరల్పుదాము.

## వెండితెర వెనుక....

నిన్నటికంటె నేడు ఫిలిం ప్రముఖులకు క్రీడారంగంపై ఆసక్తి హెచ్చుగా కన్పిస్తున్నది. కుస్తీపోటీలు, టెన్నిస్ టోర్నమెంటులు, క్రికెట్ టెస్టులు, కడకు బాల్ బాడ్మింటన్ పెద్దమ్యాచీలు కూడా సినిమాకళాకారుల హాజరుతో కలకలలాడుతున్నవి.

భారత్ లో సినిమా కళాకారులకు క్రీడలు సరదాగా మాత్రమే నిలచివున్నవి. అక్కడ అమెరికాలో చలనచిత్రకళాకారులకు వ్యాయామంవారి (సినిమా) వృత్తికి ప్రధానాంగమైనది.

హాలీవుడ్ నటులు శరీరం దృఢంగానూ "ట్రిమ్" గానూ వుంచేందుకు కసరత్తు చేసి, విశ్రాంతి విహారాలకు ప్రాధాన్యమిచ్చి ఒలర్జిత ఆహారాన్ని నియమంగా స్వీకరించి తద్వారా తాము ధరించేపాత్రలకు న్యాయం కలుగజేస్తారు. కార్నల్ వైల్డ్ (ది గ్రేటెస్ట్ షో ఆన్ ఎర్త్, హాట్ బ్లడ్ నాయకుడు), విలియమ్ హోల్డెన్ (పిక్నిక్ నాయకుడు), యూల్ బ్రిన్నర్ (ది టెన్ కమాండ్‌మెంట్స్ నటుడు), రాక్ హడ్సన్ (ది జయింట్ నాయకుడు), మార్లన్ బ్రాండో (ఎ స్ట్రీట్ కార్ నేమ్డ్ డిజైర్, ఆన్ ది వాటర్ ఫ్రంట్ నాయకుడు) వంటివారు తక్కువ చిత్రాలలో నటిస్తూ నియమంగా వ్యాయామం చెయ్యకలుగుతున్నందునే వంపుసొంపు కండలతో హీరోలుగా రాణించ కలుగుతున్నారు. టార్జాన్ చిత్రాలకు హాలీవుడ్ మొదటి నుంచీ ఎథ్లెట్లనే తీసుకొంటూ వున్నది. 1947 ప్రాంతాల ప్రపంచపు పెద్దమనిషిగా (మిస్టర్ యూనివర్స్) ఎన్నికైన అమెరికన్ స్టీవ్ రీవ్స్ ఒకటి రెండు సంవత్సరాల క్రితం ఇటాలియనులు నిర్మించిన "హెర్క్యులస్" లో భీమబలుని పాత్రధరించి తన కండలతో ప్రపంచాన్నే వెర్రెత్తించారు. అమెరికా నటీమణులు కూడా తేలిక వ్యాయామం చేసి, ఆహారనియమాలు పాటించి శరీర వ్యాప్తిని అదుపులో వుంచుకొంటారు. ఒక చిత్రంలో ఒక అగ్రనటి "బుక్" అయ్యేటప్పటికి తూకం, కొలతలు తీసుకొని చిత్రనిర్మాణం ముగిసేలోగా అంతకు ఒకటి రెండు అంగుళాలూ, ఏడెనిమిది పౌనులూ మించి స్థూల్యం రానివ్వకూడదనే బండ షరతు విధిస్తారు. ఆ షరతు పాటించేందుకే తేలిక కసరత్తు, ఆహార నియమాలు అనుసరిస్తారు. చిత్రనిర్మాణం "పంచవర్ష ప్రణాళిక" కాకుండా వీలైనంత తక్కువ వ్యవధిలో ముగించాలనే షరతును తారలు విధించడం కూడా కద్దు.

భారతఫిలింరంగం ఇంకా ఇంత ముందుకు పోలేదు. కొందరు నటీనటులు నిత్యనియమంగా కాకపోయినా ఉత్సాహంకోసం, వినోదంకోసం, సరదాకు విశ్రాంతి దొరికినప్పుడల్లా, ఆటలలో నిమగ్నులౌతారు. మరికొందరు క్రీడలపట్ల అభిరుచి సంపాదించుకొని వాటిని తిలకించడంద్వారా ఉత్సాహవంతులౌతారు. ఇంకొందరు [illegible]మైనా ఉంచుకొనేందుకు కనీసం ఆహార విహారాది నియమాలైనా పాటిస్తారు. ఆటలలో అంతో ఇంతో ప్రావీణ్యం గడించినవారు కూడా వున్నారు. క్రీడావేత్తలను ఆహ్వానించి సత్కరించడం మరికొందరి "హాబీ".



రవుతూవారి "నిత్యకల్యాణం పచ్చతోరణం" లో కృష్ణకుమారి, చలం.

## తెలుగుతారల సరదాలు

క్రికెట్ క్రీడావేత్తలను ఇంటికి ఆహ్వానించి ముచ్చటించి సన్మానించడంలో అందరికంటె ముందు పోటీపడేది సావిత్రి, "జెమిని" గణేశన్‌లు. క్రికెట్ ప్రవీణుల పౌరసన్మానాలకు సయితం హాజరయ్యే తార జానకి. విదేశీయులు పాల్గొనే టెన్నిస్ పోటీలకు ముందు రిజర్వేషన్‌లో ఈమెతో పోటీకి ఎవ్వరూ నిలువలేరు. జమున క్రికెట్ మ్యాచికి బయలుదేరారంటే వెంటవచ్చే సరంజామా కాస్తకాదు. పోర్టబుల్ రేడియో, స్కోరుకార్డు, క్రికెట్ సావనీర్‌లు ఇంకా ఎన్నో. కుస్తీపోటీలను జి. వరలక్ష్మి, పద్మిని సాధారణంగా వదలరు.

మద్రాసులో క్రికెట్ టెస్ట్ జరిగినన్ని రోజులూ అక్కినేని నాగేశ్వరరావుగారిని పట్టుకోవాలంటే స్టేడియమ్‌లో పెవిలియన్ పైకెక్కి కలవవలసిందే. ఒక్కొక్కప్పుడు సినిమా ఫ్లోర్‌లో లేని ఉత్సాహం స్టేడియమ్‌లో ఈయన చూపుతూ వుంటారు. ఎస్. వి. రంగారావు యమునిపాత్ర ధరించి దున్నపోతుపై ఎక్కుతూ "బ్రదర్, క్రికెట్ స్కోరెంత?" అని ప్రక్కవారిని అడిగి కాని నిమ్మితపడరు. శ్రీ ముదిగొండ లింగమూర్తి హాజరుకాని పెద్దపోటీలు వుండవు. క్రికెట్, కుస్తీ, టెన్నిస్ మూడింటిపట్ల ఆయనకు సమానాభిమానమే.

శ్రీయుతులు కె.వి. రెడ్డి, ఎల్.వి. ప్రసాద్, పి.ఎస్. రెడ్డి, చక్రపాణి విశేషించి టెన్నిస్ అభిమానులు. కోవెలమూడి భాస్కరరావు, డి.ఎల్. నారాయణ, చెంగయ్య, టి. ఎన్. ఆర్. టెన్నిస్ క్రికెట్లంటే చెవి కోసుకుంటారు. గుర్రపు పందాల పేరుచెప్పి పర్సులు కోసుకొంటున్న వారి సంఖ్య చాలా అధికం. తాపీ చాణక్య ఈత, హాకీపోటీలు చూస్తూ తనను తానె మరచిపోతారు. గుమ్మడికి బాల్ బాడ్మింటన్ వంటి పూర్తి తెలుగు ఆటలు. రమణమూర్తికి చతురంగం. కృష్ణకుమారికి క్యారమ్స్ అంటె అభిమానం.

## హిందీ తారల అభిరుచులు

వ్యాయామంతో దేహపుష్టి పెంచుకొన్న హిందితారలు ఒకరిద్దరి నూతన్‌కు అగ్రస్థానమివ్వవచ్చు. ఈత అభ్యసించి, వ్యాయామంగా యెంచి శరీరపుష్టిని సాధించిందీమె. "హంలోగ్" నూతన్‌కు "అనాడీ" నూతన్‌కు ఎంత భేదం వున్నదో గమనించవచ్చు. టేబుల్ టెన్నిస్‌లో కూడా ఈమె నేర్పరి.

సినిమాలో జోకర్ రాజ్‌కపూర్‌కు చీట్లపేక అంటే చాలా సరదా. విషాద పాత్రలు ధరించే దిలీప్‌కుమార్‌కు ఏకాంతంలో, దాదాపు చీకటిలో ఏకాంతంగా వుండి ఆలోచించుకొంటూ వుండడం చాలా ఇష్టం. బీనా బృందావన్ గార్డెన్స్ జలయంత్రంలా ఉత్సాహం ఎగజిమ్ముతున్నప్పుడు వాలీబాల్ ఆడి ఎనిమిది అడుగుల ఎత్తున ఒక అడుగు మించి ఎగిరి "స్పైక్" చేస్తూ వుంటారు.

మాలా సిన్హా షటిల్ బాడ్మింటన్ కోర్టు స్వంతంగా ఇంటిలో ఏర్పాటుచేసుకొని షటిల్ బాడ్మింటన్ నియమంగా ఆడి శరీరవ్యాప్తి అదుపులోకి వచ్చిందో లేదో రోజుకి రెండుసార్లు పరీక్షించుకొంటున్నది.

"మేము సినిమా వాళ్ళం. స్పోర్ట్స్‌తో సంబంధం లేదు" అని ఒకనాడు అన్న ఈతరం భారతసినిమా ప్రముఖులలో నేడు క్రీడలలో, వ్యాయామంలో ఆసక్తి పెంపొందడమనేది విశేషమే. అయితే ఇది మొదటి మెట్టు మాత్రమే. ఇక రెండవ మెట్టు హాలీవుడ్‌లో వలె భారతదేశంలో కూడా నటీనటులు శరీర సౌష్ఠవం వృద్ధిచేసుకోవడంకేమి, శరీరం ఎబ్బెట్టుగా పెరిగిపోకుండా అదుపులో వుంచుకోవడంకేమి కృషి జరగడం. ఈ రెండవ మెట్టు ఎక్కడానికి కొత్త తరం సినిమావారైనా కృషిచేయవచ్చు. వెండితెర వెనుక సరదాలలో ఇదే వారికి ప్రధానం కావాలి.

—బొమ్మకంటి సుబ్బారావు



వీనస్ పిక్చర్స్ వారి "పెళ్లికానుక" లో బి. సరోజాదేవి.

## రెండు కొత్త సినిమాలు:

# హాస్యభరిత చిత్రం:

# హృదయాన్ని కదలించే చిత్రం

సంపూర్ణ హాస్య చిత్రాలు నిర్మించడంలో మద్రాసు, బెంగాల్, బొంబాయి రంగాలను మహారాష్ట్ర మించుతున్నది. కొద్ది రోజుల క్రితమే విడుదలైన మరాఠీ చిత్రం "పైసా పావూస్" (ధన ధారలు) ఈ సంప్రదాయానికి చెందినది. జీవితంలో సుఖము వేద హోదాలు, స్థలాలు మార్చుకొన్నందువల్ల రాదని, ఉన్న దానిలోనే వీలైనంత ఎక్కువ సుఖం పొందడానికి ప్రయత్నించడంలోనే నిజమైన సుఖం వున్నదని ఈ చిత్రం 'నీతి' చెబుతుంది.

కథ యిది. ఒకడు అసలే గుమాస్తా. అందులో భార్యపోరు చెప్పవీలులేదు. పోనీ ఆఫీసులో అయినా సుఖం వున్నదా అంటే మేనేజర్ కర్కోటకుడు. చిన్న తప్పుకు ఉద్యోగం పోతుంది. ఇంటికి పోతే భార్య శాస్తి చేస్తుందని పట్టణానికి పారిపోతాడు. అక్కడ భోగవిలాసాలలో నిమగ్నుడై వున్న ఒక అగ్ర చలనచిత్రనటుని చూచి భ్రాంతి చెందుతాడు. ఆయనకు సరిగా తన పోలికలే వున్నవి. ఇద్దరూ కవలపిల్లలవలె వున్నారు. సినిమా నటుడూ ఈ గుమాస్తా పరస్పరం చూచుకొని తమలో ఇంత పోలికలు వున్నందుకు ఆశ్చర్యచకితులై పోతారు.

సినిమా నటునికి ధనమైతే కుంభవృష్టిగా పడుతుంది కాని జీవితంలో సుఖం లేదు. అతి మూత్రవ్యాధి వుంది. ఏది పడితే అది తినడానికి వీలు లేదు. మందులు మాకులు తెగతినాలి. సూదిమందులతో బాధ ఇంతంత కాదు. మార్చుకోవటం ఇద్దరూ స్థానాలు హోదాలూ మార్చుకొంటారు. గుమాస్తా సినిమా ఫ్లోర్ లకు "అగ్రనటుని"గా పోతాడు. అగ్రనటుడు ఈ గుమాస్తా గ్రామానికి వెడుతాడు. గుమాస్తాకు సినిమా జీవితమయితే బాగానే వుంది కాని రాత్రింబగళ్ళు పనిచేయలేక పోతాడు. పైగా ఇంజక్షన్‌ల బాధ. రుచీపచీలేని తిండికి అసలే నిలవలేక పోతాడు. అక్కడ గుమాస్తాగా గ్రామం పోయిన అసలు సినిమా అగ్రనటుడు ఊరికే వుండక ఒక యువతిని ప్రేమిస్తాడు. అసలు గుమాస్తా భార్య, ఆమె అన్న చూచి "గుమాస్తాను" కొరడాతో శాస్తి చెబుతారు. పోనీ ప్రేమించిన పిల్ల అయినా దక్కుతుందేమో అంటే అసలు గుమాస్తాను బర్తరఫ్ చేసిన కర్కోటకుడు మేనేజరుతో ఆ పిల్లకు సంబంధం నిశ్చయమౌతుంది. పెళ్ళిలో అసలు గుమాస్తా, అసలు అగ్రనటుడు కలుస్తారు. హోదామార్పిడి వల్ల సుఖం లేదని చెప్పుకొంటారు. ఇంతలోకే వీళ్ళ నిజవృత్తాంతం పెళ్ళి సమయంలో బైటపడగా అంతా కల్లోలమే. హాస్యరస చిత్రం కాబట్టి సుఖాంతంగా కథ అంతమౌతుంది. కథను సృష్టించింది కలేకర్, దర్శకుడు అనంతమాన్. రాజగోపాల్ ఇటు గుమాస్తాగాను, అటు సినిమా అగ్రనటునిగాను ద్విపాత్రాభినయం చేశారు.

## వెన్నవంటిగుండె కల "గూండా"

వెండితెరకు కొన్ని క్రొత్తలు వేసినా పూర్వ సంప్రదాయాన్ని అంటిపెట్టుకొని వీలైనంత వరకు వాస్తవికతకు న్యాయం కలుగజేస్తూ చిత్రాలు తీసేవారు గురు నిర్మాతలలో ఒకరు మినర్వా మువిటోన్ అధిపతి సొహ్రాబ్ మోడీ. ఈయన ఇటీవల నిర్మించిన హృదయాన్ని కదలించే "దో-గుండే" (ఇద్దరు గూండాలు) మద్రాసులో విడుదలైంది. ప్రవర్తనబట్టి ఎవ్వరినీ గూండాలుగా నిర్ణయించరాదని, ఆ ప్రవర్తన వెనుక దాగివున్న సత్తిమహృదయాన్ని గుర్తించాలని ఈ హిందీ చిత్రం చెబుతుంది. పైకి పెద్దమనిషిగావుండి తెరచాటులతో గొంతుకలు కోసేవారే అసలు గూండాలని నిరూపిస్తుంది.

ఇతివృత్తం అయితే గొప్పదికాని ఈ సందేశాన్ని యిప్పించడానికై అల్లినకథ తీరు పూర్తిగా సంతృప్తికరంగా లేదు. ఒక గ్రామంలో ఇద్దరు (రాజ్ కుమార్, అజిత్) గూండాలుగా చెలామణి అవుతారు కాని నిజానికి వీరు న్యాయంకోసం పోరాడే వీరులు. రాజ్ కుమార్ వివాహంతో ఇద్దరి మధ్య అపార్థాలు వస్తవి. గ్రామంలోని మోతుబరి (ప్రాణ్) ఈ అగ్నికి సమిధ వేస్తాడు. రాజకుమార్ తన తప్పు తెలుసుకొని ప్రాయశ్చిత్తంగా చేయి తెగగోసుకొంటాడు. మరణించేముందు తన భార్యను, బిడ్డను అజిత్ చేతిలో పెట్టి కాపాడమంటాడు. అజిత్ తన వివాహంకూడా వాయిదా వేసి ఈ యిద్దరి అభ్యుదయానికి అహరహం శ్రమిస్తాడు. రాజ్ కుమార్ భార్య శీలాన్ని భంగపరిచేందుకై వచ్చిన మోతుబరి (ప్రాణ్) కాలు విరగగొడతాడు. రాజకుమార్ కూతురు, మోతుబరి కొడుకు పెద్దవాడై ప్రేమించుకొంటారు. వారిద్దరికి వివాహం చేయడం అజిత్ జీవిత లక్ష్యమైవున్నది. ఈలక్ష్యానికి మోతుబరి అడ్డుతగులుతాడు. తన (ప్రాణ్) కాలు విరగ



చంద్రికావారి 'శ్రీ కృష్ణరాయబారం'లో దుర్యోధనుడు రాజనాల, అర్జునుడు కాంతారావు, కృష్ణుడు రఘురామయ్య.



వాహినీవారి "రాజమకుటం"లో రామారావు, రాజసులోచన.

# చిత్రలోక సంచారం

నకిలీ తెలుగు కాళిదాసు ఒకటి రానున్నది. బొంబాయిలో సింధూ ఫిలిమ్స్ వారు హిందీలో నిర్మించిన "కవి కాళిదాసు"ను తెలుగులో డబ్ చేస్తున్నారు. అందులో కాళిదాసుగా భరత్ భూషణ్ నటించారు. అసలు సిసలు తెలుగు "కాళిదాసు"ను సారథీ వారు పూర్తిచేసి వేస్తున్నారు. నిర్మాత నాగమణి. జూనియర్ శ్రీరంజని, నాగేశ్వరరావు, ఎస్. వి. రంగారావు, ముదిగొండ లింగమూర్తి మున్నగువారు నటించిన ఈ చిత్రానికి గోఖలే కళాదర్శకుడు. కాళిదాస పాత్రచిత్రణే పండితులను, పామరులను ఆశ్చర్య చకితులను చేసి వేస్తున్నది. కవి శ్రీ పింగళి నాగేంద్రరావు, చిత్రదర్శకుడు కమలాకర కామేశ్వరరావు.

బి. ఎ. సుబ్బారావు ప్రొడక్షన్స్ వారు శరవేగంపై నిర్మిస్తున్న తెలుగు జానపద చిత్రం 14 రీళ్ళకు పైగా తయారైంది. బహుశా ఏప్రిల్ లో విడుదల కావచ్చు. ఎన్. టి. రామారావు, గుమ్మడి, రేలంగి, సి. ఎస్. ఆర్. బాలకృష్ణ, అంజలి. సంధ్య నటిస్తున్న ఈ చిత్రానికి శ్రీ బి. ఎ. సుబ్బారావు దర్శకులు. సంగీత దర్శకుడు రాజేశ్వరరావు, కెమెరా- నాగేశ్వరరావు. ఆర్టు- వాలి. సంభాషణలు - సదాశివబ్రహ్మం. పాటలు-కొసరాజు, ఆరుద్ర.

సారథి ఫిలిమ్స్ వారు "ఏక్ హీ రాస్తా" హిందీ చిత్రం ఆధారంగా తెలుగు తమిళ భాషలలో హైదరాబాద్ స్వంత స్టుడియోస్ లో శీఘ్రగతిని చిత్రనిర్మాణం సాగిస్తున్నారు. సావిత్రి, జగ్గయ్యలతో తెలుగుచిత్రభాగాలు, సావిత్రి, జెమినీ గణేశ్ లతో తమిళ చిత్రభాగాలు ఇప్పుడే చిత్రీకరించబడినవి. ఇంకా తెలుగుచిత్రంలో బాలయ్య, రేలంగి, ఎమ్. సరోజ, సీతారాం మున్నగువారు నటిస్తున్నారు. శ్రీ నరసరాజు సంభాషణలు సమకూర్చారు. పాటలు- కొసరాజు, ఆరుద్ర రచించారు. సంగీత దర్శకుడు వేణు. చిత్ర దర్శకుడు తాపీ చాణక్య.

వరలక్ష్మీ పిక్చర్స్ వారి "ధర్మమే జయం" రీరికార్డింగ్ దశలో పడింది. చెన్న నగరంలో ఫోర్ ప్రాంతంలో కల యుద్ధవీరుల స్మారక మందిర ప్రాంతంలో యువతీయువకుల సైకిల్ పోటీపందాలు అమోఘం చిత్రీకరించారు.

గొట్టినందుకు శాస్త్రిగా అజిత్ అనే కాలు విరగగొట్టకుంటేనే ఈ పెళ్లి జరుగుతుందంటాడు. అజిత్ అందుకు సిద్ధపడి గొడ్డలి ఎత్తబోతాడు కాని దైవికంగా ఒక సంఘటన జరిగి దుష్టుడైన మేనత్త రెండవ కాలు కూడా విరుగుతుంది. జరగవలసిన పెళ్లి జరుగుతుంది. ఇదీ కథ.

స్నేహితుడు సైయ్యద్ సుకోడను, మోతుబరి కాలు బలి కోరడమూ చాలా అసహజంగా వుంది. ఇది తప్పితే చిత్రం యావత్తూ గ్రామీణ వాతావరణంలో ఉత్తమ అభినయస్థాయిలో సాగింది. ఛాయాగ్రహణం, సంగీతం కూడా మెచ్చదగినవి. హంసం ముఖ్యనటి. సాధారణ తారాగణంతో ఈ మాత్రపు ఉత్తమ చిత్రం తీయగలగడం ఎంతో మెచ్చదగినది. దర్శకుడు వి. ఎమ్. వ్యాస్.



వరలక్ష్మివారి "ధర్మమేజయం"లో జగ్గయ్య, జమున.

కన్నాంబ, జమున, జగ్గయ్య, రేలంగి, రమణారెడ్డి, మిక్కిలినేని రాధాకృష్ణ మున్నగువారు నటించిన ఈ చిత్రం నిర్మాణ నిర్వాహకులు కడారు వెంకటేశ్వరరావు. దర్శకులు కడారు నాగభూషణం.

"పక్కయింటి అమ్మాయి"లో నాయకుడుగా అంజలిని ఆగా చెరువుల నీరు తాగించిన రేలంగి తిరిగి హీరోగా "మామకు తగ్గ అల్లుడు"లో నటించి రమణారెడ్డి ముక్కు పిండుతున్నారు. ఈ "హ్యూమర్ స్కోప్" చిత్రంలో పాటలు పెట్టుపై షూటింగ్ పూర్తికావడంతో దాదాపు 14 రీళ్లు సిద్ధమైనట్లు. శ్రీ ప్రకాష్ సంగీత దర్శకత్వము, శ్రీ వేదాంతం రాఘవయ్య చిత్ర దర్శకత్వము వహిస్తున్న ఈ చిత్రంలో రంగారావు మరొక చిరస్మరణీయమైన పాత్ర ధరిస్తున్నారు. సావిత్రి నాయిక. రమణారెడ్డి, బాలకృష్ణ వినోదపుటంచులను చూపిస్తారు.

అంజలీ పిక్చర్స్‌వారు "పక్కయింటి అమ్మాయి"ని తమిళంలో "అడుత్తువీట్టు పెన్"గా రూపొందించి తమిళనాడులో విడుదలచేశారు. అంజలి, తంగవేలు, టి.ఆర్. రామచంద్రన్ పరివారంతో తారాగణంలో గల ఈ చిత్ర నిర్మాత శ్రీ ఆదినారాయణరావు, దర్శకుడు వేదాంతం రాఘవయ్య.

'ఫిరంగ్ కహానీ' 'హిస్నకి హీని'' 'చార్ దిల్ చార్ రాహే' "ఖైదీ నెం. 911" వలె మరొక హిందీ చిత్రం 'సట్టాబజార్' తెలుగులో రానున్నది. రాజశ్రీ పిక్చర్స్ వారు ఆ హిందీ చిత్రం తెలుగు, తమిళ హక్కులు క్రయం చేశారు. హిందీ చిత్రం కథకుడు సంభాషణకర్త శ్రీ మోహన్‌లాల్ గోపాల్ జి. నిర్మాత శ్రీ రవీంద్రదావే.

ముద్దుకృష్ణ కలంచిందులతో, సైలెన్‌బోస్ ఛాయా చిత్ర శిల్పంతో సుబ్బయ్యనాయుడు మధుర సంగీతంతో ముచ్చటగా "మరకతం" రూపొందుతున్నది. ఇప్పటికి 11 రీళ్ళు తయారైంది. రామారావు, రంగారావు, రేలంగి కుమ్మడి, రమణారెడ్డి, సావిత్రి, సంధ్య నటిస్తున్న ఈ పక్షిరాజా చిత్రానికి "సెంచరీ మేకర్" శ్రీ శ్రీరాములునాయుడు నిర్మాణ బృంద నాయకుడు.

అంజలిదేవి, నాగేశ్వరరావు బాలయ్య, బాలాజి నటించిన అసోసియేటెడ్ ప్రొడ్యూసర్స్ తమిళచిత్రం "ఎంగల్ సెల్వి" మార్చిలో విడుదల కాబోతున్నది. దర్శకుడు యోగానంద్.

## "నమ్మినబంటు"

పూర్తి వ్యవసాయిక చిత్రం, నిర్మాతలు శంభూఫిలిమ్స్‌వారు ఎన్నో కష్టనష్టాలకు ఓర్చి పెక్కు అవుట్‌డోర్ దృశ్యాలతో తీసిన చిత్రం "నమ్మినబంటు" వండితెర నవల వెలువడింది. పాటలు, మాటలు, అనేక చిత్రాలే కాక 28 పేజీలు వ్యవసాయానుబంధం కూడా ఇందులో వుంది. మొత్తం 152 పేజీలలో ఈ నవల కూర్చినది శ్రీ పిచ్చేశ్వరరావు. ప్రచురణకర్త శ్రీ యార్లగడ్డ వెంకన్న చౌదరి. వెల 60 నయాపైసలు. ప్రతులు విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ-2 అన్న చిరునామావద్ద లభించగలవు.

## మద్రాసులో మార్చి

"డెస్పరేట్ అవర్స్", "డాక్టర్ జెకిల్ అండ్ మిస్టర్ హైడ్", "డెత్ ఆఫ్ ఏ సేల్స్‌మన్", "లే మిజరబ్లా", "మిడిల్ ఆఫ్ ది నైట్" వంటి హాలీవుడ్ చిత్రాలలో విశిష్టంగా నటించి, రెండుసార్లు ఉత్తమ నటనకు ఆస్కార్ అవార్డులు పొందిన ఫ్రెడరిక్ మార్చి (వయసు 62) బొంబాయి, ఢిల్లీ, జయపూర్, కలకత్తా, సందర్శించి 11 వ తేదీన మద్రాసు వచ్చారు. ఇప్పటికి 68 చిత్రాలలో నటించిన శ్రీ మార్చి 1898 ఆగస్టు 31 వ తేదీన వైకాన్సిన్‌లోని రాసైన్‌లో జన్మించారు. 1920 లో పట్టభద్రుడైనాడు. తర్వాత బ్యాంకు ఉద్యోగంలో చేరి, నాటకరంగంలో ప్రవేశించి బాగా రాణించాక 1928లో సినిమారంగంలో ప్రవేశించారు. "ది డమ్మీ" The Dummy ఆయన తొలి చిత్రం. ఇందులో చిన్న పాత్రను మాత్రమే ధరించారు. ఈయన వాల్గవ చిత్రం "ది రాయల్ ఫ్యామిలి ఆఫ్ బ్రాడ్వే"లో మొట్టమొదటిసారి ముఖ్య పాత్ర ధరించారు. భిన్న రస పాత్రలు నిర్వహించగల ప్రతిభాశాలి ఈయన. నవప్రేమికునిగా, క్రూరునిగా, దయామయునిగా, ధీరోదాత్తునిగా, కాలంతో కలసి పరుగిడలేకపోయిన అసమర్థునిగా ముఖ్య పాత్రలను వివిధ చిత్రాలలో నిర్వహించి వున్నారు.



## రాలిన తార

బొంబాయి హిందీ ఫిలింరంగంలో "వ్యాంప్" పాత్రలకు ప్రసిద్ధికెక్కిన కుల్దీప్ కౌర్ (వయసు 36 సంవత్సరాలు) జనవరి నాల్గవ తేదీన మరణించింది. షోరీ ఆర్ట్ ప్రొడక్షన్స్‌వారి "ముఖ" హిందీచిత్రంతో పరిచయమై దాదాపు పదకొండేళ్ళలో నూటికి పైగా నటించిన ఈ శిఖ్కు వనిత గొంతు వ్యాధివల్ల మరణించింది. మరణానికి కొద్ది రోజులకు ముందు ఈమె డాక్టరువద్దకు వెళ్ళినప్పుడు, గొంతుక పరీక్షించుకోగా వెంటనే ఆస్పత్రిలో చేరవలసిందని, ప్రమాదమని డాక్టరు హెచ్చరించారు. వెంటనే ఆమె యింటికివచ్చి, బ్యాంకులోని డబ్బు, నగలు, సమస్తమూ తీసి వేసి కుమారుడు దినేష్ పేర విల్లు వ్రాసింది. ఈమెకు ఒక్కడే కుమారుడు. డెహ్రాడూన్‌లో చదువుకొంటున్నాడు. ఈమెకు 17 సంవత్సరాలక్రితం వివాహమైంది కాని సంసారజీవితం సరిగా సాగలేదు. భర్తకు 75 సంవత్సరాలు. 16 ఏళ్ళనుంచీ ఈయన వేరేవూరిలో వుంటున్నాడట. ఈమె విశిష్టంగా నటించిన చిత్రాలలో "గ్రహస్థి", "పంచాయత్" పేర్కొనదగినవి.





శ్రీ కృష్ణసాయి ఫిలిమ్సువారి "వీరజగ్గడు" లో జయరాజ్, జబీన్.

## గిరీశం ఉపన్యాసాలు: 3-వ భాగము

# కళాఖండాల లోగుట్టు

వెంకటేశం! మనవాళ్లు వట్టి వెధవాయిలోయ్! అందుకనే మనవాడు ప్రతివాడూ ప్రతి రెండోవవాడినీ వెధవాయ అంటాడు. అది మనకు ఉగ్గుపాలతో పెట్టిన విద్య. ఎదుటపడి ఆ మాటనిందికి దమ్ములు లేకపోతే ఏదో గుట్టుగా సంభాషణ చెప్పాలన్నట్టు లోపలనే అనుకుంటాడు. కాకపోతే - నక్క పుట్టి మూడాదివారాలు కాలేదన్నట్టు ఆ సత్రకాయగాడు సత్యజిత్ రాయి ఏదంత పొడిచేశాడని వాడికిలా ఒక్కలాగ బ్రహ్మరథం పడుతున్నారూ అని. వాడు నేర్చినట్టి ప్రజ్ఞ, వాడు వెలిగించిన బ్రహ్మవిద్య యేమిటి అని. ముందూ వెనకా పెద్దంత్రం చిన్నంత్రం లేకుండా అప్పుడైనవాడూ ఎగబడే వాణ్ణి తెగపొగిడెయ్యడమే. ఆపాటి ప్రతాపం ఈపట్టైన గొడ్డుపోయిందా.

మాస్టరుగారు ప్లేటు ఫిరాయిస్తున్నారనుకోకు. ఇంటర్నేషనల్ పబ్లెటుగీద లచ్చిరిచ్చినపుడు బంగాళీవాడు పొడిచేసేదేం ఉంటేరాగు. దేశవాళీ జనాభాగురించి మాట్లాడినప్పుడే బంగాళీవాడి ప్రజ్ఞను మెచ్చుకు ఎవరం అక్షింతలేసుకోవాలి. తప్ప ఇందులో మటుకు అందరం సగోత్రీకులమే. మళ్లా వరసా కల. అంతే తప్ప ఈ సత్యజిత్రాయంటే నాకు పగనుకునేవు - నాకంతా సమానమే. ఏరాయైతేం తలబద్దలగొట్టుకోడానికన్నారు.

ఇంతకీ చెప్పొచ్చిన ముక్క ఆ పథేర్ పాంచాలీని వాడు తీశాడు; నేను తియ్యలేను అంతేగదా తేడా. ఇలా బాజాలు వాయించి పొద్ద స్తమానం ఎవార్డులు గుప్పిస్తారని వాగ్దానమిస్తే నేను తెల్లవారేసరికల్లా అరడజను కళాఖండాల్లాగవతల పడేస్తాను.

అసలు కళాఖండాలనగా ఏమిటోయ్ - డబ్బురాని పిక్చర్లు... అంతేకదా. అసలే డబ్బు గిట్టక నెత్తిన చెంగేసుకు పోయేవాడి బోడిగుండుమీదికి మల్లెచెండులా ఈ పేరు తగిలిస్తారు - మరెప్పుడూ ఇలాటి ఓఘాయిత్యప్పన్లు చెయ్యకుమీ అని సున్నితంగా మందలించి, వాడూ నామాట దోసిటబుచ్చుకునే మాటాడుతున్నాడనుకో. 'మాయింటవాళ్లిగ్గిచుకొని తాటాకు బద్దలు నిండుకున్నరోజున నువ్వు ఈ సర్కారు వాళ్ళ సర్టిఫికెట్టు కోసం కళాఖండమొకటి తీస్తానని. అలాగ్గాదు బాబ్బాబు నువ్వు తీసితీరాలి మేం చూసితీరాలి అని కాళ్ళావేళ్ళా బడితే, తేడబ్బు అని డబాయించొచ్చు.

నేను పాలిటెమీద ఇక్కడికొచ్చేటప్పుడే గదోయ్—ఓ కళాఖండం చూసొచ్చాం. నాయుడుగారు తీయించారు. ఎలా వుంది గిరీశంగారు. డబ్బు లేకపైనా వొస్తేనా అన్నాడాయన దిక్కుమొహం వేసి. నువ్వులేకున్నా జాగర్తగా రాస్తావనీ అన్నా. అంతేనా అన్నాడు కుప్ప కూలిపోయి. అంతగాక మరేవిటయ్యా. ఇలా మాష్టరుపీసు తియ్యాలనుకున్నట్టు ఓ ముక్క నా చెవిన పారేస్తే కక్కుర్తిరకంగా కుండా కడితేరా కళాఖండమే తీసిపడేసి పెడదును గదయ్యా అన్నాను. మరేం దారి బాబూ అని ఇదయ్యాడు పాపం.

సరే ఇప్పుడైనా మించిపోయిందేమీ లేదూ. ఈ పిక్చర్లో డాన్సులూ, కామిక్కు వగైరా డబ్బు వాసనేసేవన్నీ తీసిపారేసి (ప్రెస్టేజి పిక్చర్ని పబ్లిసిటీ అఘోరించవయ్యా లేపోతే సెక్సేట్ పిక్చరుకు డిప్టి) బ్యూటర్రాడు అని ఓ చిటికా చెప్పానన్న మాట. పాపం వెర్రిముండావాడు వచ్చి నా కడుపున పుడతానన్నాడు. దీంతావాద్ది ఈలాగేసిన భాగాలన్నీ పోగేసి మాస్ పిక్చరు తీసిపెడితే సరిహా నేనీ జన్మకి చెప్పులు కుట్టించుకోనక్కర్లేదనన్నీ, తనే చర్మంకోసి కుట్టించి మరీ దాఖలు చేసుకుంటానన్నీ మొరపెట్టుకున్నాడు. వాడు మాటిచ్చాడని మనం జోళ్ళు కొనుక్కోడం మానేస్తేయాలాగ. ఇస్తేగిస్తే రెండు జతలు పడుంటాయి కాబట్టి నువ్వు ఓ కొత్తజోడు—ఘుష్ క్లాసు విలేజ్ మేకు గురుదక్షిణగా అర్పించుకుందికి సన్నాహాలారంభించవచ్చు. నేను యెంతమాత్రం అడ్డుపడను.

వెంకటేశం, కొంచెం చెవిచేసింటా జగత్తు ఓ కబుర్చెబుతా... చూడు నేను వెనక్కి తిరిగి జూస్తే బావుండదుగాని. ఈ పక్కన మండపంమీద కూచుని మన కబుర్లాలకిస్తున్న చౌదరిగారు ఇంకా అక్కడే ఉన్నాడా లేచి వెళ్ళిపోయాడా... ఆ- నా కెందుకులే. పట్నంలో ఓ బైస్కోపు కంపినీలో ఆయన పావలా వాటా పెడుతున్నాడని విన్నాంలే. నాలాటివాడిక్కడున్నాడని పోల్చుకోలేక. వళ్ళా డైరెక్టరు కోసం వెతుక్కుని డబ్బు తగలేసుకుంటాడన్న జాలి కొద్దీ - నేను బొత్తిగా నిపుణుగల్పిన నిప్పులాటి వాణ్ణయిపోతున్నానుగదోయ్. వెధవది అదే చిక్కు. మోడెస్టీ మహాలావు. ఆ మాట వాళ్లు పోల్చుకోవాలి. కోటి విద్యలు ధనుష్కోటిలో సంపాదగ అన్నాడు త్యాగరాజు వాడు. అదే గమ్మత్తు ఒళ్ళో బిడ్డనెత్తుకుని ఊరంతా వెతికినట్టు నేనిక్కడే ఉండగా చౌదరిగారు డైరెక్టర్లకోసం వెతకడం ఏవిటి ఘనం గనక-తరవాతాయన నాలిక్కరుచుకోలేక ఇదవాలిగదా.



మాట ఎత్తితే గండుపిల్లిలా నాన్నగారిమీద పడి బకిరే అమ్మ—చివరికి నన్ను అడపిల్లని చేసి పెళ్ళి చేయా లనుకుంటోంది.

మా అమ్మ మాటలు మంచంకింద ఆయన వింటున్నారో లేదో! విని నవ్వుకుంటున్నారో! ఆరిపోయిన తీర్థం అయనకి ఎగరేచ్చినట్టుంది. ఇంతకీ అదృష్టవంతుడాయన!

ఆలోచిస్తున్నాను. బాగా అలిసి వుండటంవల్లనూ. మత్తుగా భోజనంచేసి వుండటంవల్లనూ ఆయనకు ఇట్టే నిద్రపటినట్టుంది. మంచంకింద నుంచి గుర్రుగుర్రు ప్రారంభమయింది.

మాట్లాడుతున్న దల్లా అమ్మ చటుక్కున ఆగి నాముఖంలోకి తెల్లబోయి చూసింది. నా ప్రాణం నిలువునా ఎగిరిపోయింది. నానోటంట మాటరాలేదు.

చివరికి అమ్మే తేరుకుని, చటుగా తలుపులు బిగించి, గుప్పటీ ఎత్తి మంచం కిందకి చూసింది. వొళ్ళెరగకుండా నిద్రపోతున్నాడు మహానుభావుడు.

తప్పకుండా అమ్మ పెత్తి నోరూ బాదుకుంది. "ఇదేమిటే నీ మొహం ఈడ్చ! మన యింటావంటా లేదు. ఇలాంటి పెంకిపని చేశావేమిటే! అవ్వ! ... ఎవడే వాడు? చెప్పు! ముంగిలా చూస్తావేం?"

చూడకేం చేస్తాను? తప్పంతా నాది. దొరికి పోయ్యాను, కన్నంలో దొంగకి తేలుకుట్టినట్లయింది. అయినా ఎలాగో గొంతుక తడుపుకుని ఫలానా స్నేహితుల కొడుకని చెప్పేశాను.

"వాడా? వాడిముఖం తగలెయ్య! వాడిలాంటి వెధవ అనుకున్నాను. అందుకే వాళ్ళు భోజనానికి పిలిస్తే నన్ను వెళ్ళనివ్వలేదు. వీడెలా వచ్చాడు?"

మా అమ్మ తానే చాలా తెలివైన దనుకుంటుంది.

కాని, దానికేం తెలుసు?— కొబ్బరికాయలోకి నీళ్ళెలా వస్తాయో! అర్ధవికస్వరమైన పద్మంలోకి భ్రమరం ఎలా చొచ్చుకోంటుందో!— ఇవంతా చెప్పి వాదించా లనుకున్నాను కాని, ఇదికాని సమయం. పైగా స్వవిషయం. వొళ్ళుమండి వీపు చిట్లకొడుతుందేమో అమ్మ! కనుక వాదించి లాభంలేదు — పోతే ఏడిస్తేనే ఏదన్నా లాభం!

కళ్ళు చిల్లులుపడ్డట్టే ఏడవటం ప్రారంభించాను. వెక్కి వెక్కి ఏడ్చాను.

ఏడ్చినట్టే వుందని అమ్మ నన్ను తన గుండెమీద హత్తుకుంది. దానితో నాకు చాలా ధైర్యంవచ్చింది. నా పాచిక పారిందన్న మాటేగా!— చదువుకున్న స్త్రీలకు కూడా ఏడుపు ఎంత అవసరమో యిప్పుడర్థమయింది. కనుక ఏడుస్తూనే చెప్పా!

నా తప్పు క్షమించమన్నాను. ఏమో అలా ఎందుకు చేశానో నాకేమీ తెలియలేదన్నాను. అలాంటి తప్పుపని చేయకూడదనుకున్నాను గాని, ఎందుకో చేయకుండా ఉండలేక పోయ్యానన్నాను. నా ఒళ్ళు స్వాధీనం కాలేదన్నాను. తనకీ నాన్నగారికీ యింతద్రోహం చేశాక బ్రతికివుండటంకంటే ఛస్తే నయమన్నాను. విడిచిపెడితే ఒక్కసారి గోదావట్లోకి దూకి నాపాపం కడుక్కుంటా నన్నాను.

"ఛి ఛీ! అలాంటి అప్రాచ్యపు మాటలనకు" అని అమ్మ మందలించింది. అమ్మకు కూడా కళ్లంట నీళ్లు జలజలా రాలాయి. "మాయలాడిముండ్క, ఎంతపని చేశాడో!" అంది.

ఆ మాయలాడి గుర్రు అంత కంతకీ శృతి మించిపోతోంది. మాఅమ్మకు ఒళ్ళుమండింది. 'ముందు ఆ గుర్రు ఆపు! వెధవగుర్రు! మాటలన్నా వినబడకుండా!"

అమ్మ చరచరా బయటకు వెళ్ళిపోయింది. ఆయనముఖం చూడటం అమ్మకు యిష్టంలేదు.

లే పాము; ఆయన త్రుళ్ళిపడి లేచారు.

"ఏమండీ మీకు పుణ్యముంటుంది. కాస్త మెల్లగా గుర్రుపెడుదురూ! మన బ్రతుకంతా బయటపడింది. మీ గుర్రుమూలాన."

ఆ మాట వినేసరికే ఆయనకు ముచ్చెమట్లూ పోశాయి. ఒళ్లు యించుమించు చల్లబడిపోయింది, వీరుడు!

ఈయనేదో పెద్ద తెలివైన వాడనుకున్నాను. ఛీ! ఇలాంటి పిరికివారికోసమేనా భారతపత్రికలు ప్రాణమాన ధనాల్ని బలిపెట్టేది?

"అప్పుడే భయపడకండి! ఎలాగో మా అమ్మను బ్రతిమాలుకున్నాను. మా అమ్మ తప్పకుండా నాన్నగారికి నచ్చచెబుతుంది. మా నాన్నగారికి తిక్క తిరిగిందా, సరే. తిరగదూ, అప్పుడే పావుకాళింగా చావచ్చు" అన్నాను.

ఈలోగా అమ్మ నాన్నగారి దగ్గర కెళ్లింది. ఆయన ఏదో టైపుచేసుకుంటున్నారు. మహామంత్రిగారు కూడా పక్కనే నిలబడి కాయితాలు సర్దుతున్నాడు.

సమయం కాదనుకుని అమ్మ వూరుకుంది. కాని, ఆమె కన్నీళ్ళు వూరుకోలేదు. ఆమెకి తెలియకుండానే అవి బొటబొటా కారటం ప్రారంభించాయి. నా సంగతి ఏమయిందోనని నాన్నగారు కంగారుపడి ఉంటారు.

"నీకేమన్నా మతిపోయిందా ఏమే! ఊరికే ఎందుకలా యేడుస్తావ్? ఒకటి రెండురోజుల్లో అదే సర్దుకుంటుంది." అన్నారాయన.

నౌకరు బయటకు వెళ్ళిపోయాడు.

"నిక్షేపంలా వుంది; దానికేం రోగం? ఆడాక్టరేదో చెప్పారని మీరూ అదే పట్టుకు కూచుంటున్నారు. మీ కీయింటిగొడవలే అక్కరేదా యిరి! — ఆకాయితాలు, బంట్రోతువుంటే చాలు!"

"అవేమిమాటలే!"

ఏమిమాటలో అమ్మ స్పష్టంగా చెప్పేసింది. తను చూసిందీ, విన్నదీ ఒక్కమాట కూడా దాచలేదు.

నాన్నగారు మండిపడ్డారు.

"ఛీ, యిది నాకూతురుకాదు. నాకడుపున పుట్టలేదనుకుంటాను. నా వంశగౌరవాన్నంతని నాశనం చేసింది. పద, యిద్దర్నీ నరికేసి గోదావట్లో పారేస్తాను!"

భర్రున కుర్చీలోంచి లేచారు. అమ్మ చటుక్కున నాన్నగారి రెండుకాళ్లూ పట్టుకుంది: పట్టుకుని వలవలా ఏడ్చింది. సమస్తమూ శూన్యమై, ఘోరమై కనపించే ఈ దారుణప్రపంచంలో ఒక్క మాతృహృదయంలో మాత్రమే ప్రగాఢమై, నిష్కల్మషమై. నిరుపమానమై, అనంతమైన నిస్వార్థప్రేమవాహిని గోచరిస్తుంది. దేవుడు సర్వాంతర్యామి కాలేకనే మాతృహృదయాన్ని సృష్టించాడేమో!

"మీకు పుణ్యముంటుంది. కాస్త తమాయించుకోండి! ఒక్కగా నొక్క పిల్ల! కడుపు చించుకుంటే కాళ్ళమీదపడుతుంది. కని పెంచే వయస్సుకాదు. ఆ ఒక్కపిల్లా మనకు దక్కకుండాపోతే మన బ్రతుకులేంగాను? వాడూ పైవాడుకాదు. చదువుకున్నవాడు. స్ఫురద్రూపి - మీరూ కోరిన సంబంధమేగదా! ఎటొచ్చీ పెద్దవాళ్ళ నిర్ణయం జరగకుండానే తొందరపడ్డారు. పోనీ, యిప్పుడైనా వాళ్ళ నాన్నకి వ్రాసి యీసంబంధం స్థిరపరచండి! అప్రతిష్ఠ లేకుండా పోతుంది."

## [illegible] 17

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | ■ | 2 | ■ | 3 | 4 | | 5 |
| | ■ | 6 | | 7 | ■ | | ■ | |
| 8 | | | ■ | 9 | 10 | ■ | 11 | |
| | ■ | | ■ | ■ | | ■ | | ■ |
| 12 | 13 | | 14 | ■ | 15 | 16 | | 17 |
| ■ | | ■ | | ■ | ■ | | ■ | |
| 18 | | ■ | 19 | 20 | ■ | 21 | | |
| | ■ | 22 | ■ | 23 | 24 | | ■ | |
| 25 | | | | ■ | | ■ | 26 | |

### అడ్డము

1. [illegible] పుడుతుంది.
3. రాత్రి తరువాత వచ్చేది అలాంటిదే.
6. పోరాటములో వడకసేది.
8. రాయలసీమలో రాలసీమ.
9. భారత–చైనా సరిహద్దు చివర [illegible]
11. ఇ[illegible] ముదిరితే ప్రకృతి మించిపోతే లెక్క.
12. అర్థం పర్థం ఏమీ తెలియనిది.
15. కుసుమ ధూళి.
18. చెవికళ్లల్లో మెదులుతోంది.
19. కథ.
21. పిపి విరగడ కొవటంలో అయిన అల్లరి.
23. వారంగఫలములోని రంగు.
25. ఒక ప్రముఖ మొగల్ చక్రవర్తి.
26. నుడికట్టు పూర్తిచేసేది.

### 16 వ నుడికట్టుకు జవాబులు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 మ | ■ | 2 మ | డి | ■ | 3 నా | 4 స | ■ | 5 ఖ |
| 6 న | గ | రు | ■ | ■ | 7 సే | ఖ | ■ | యా |
| నం | ■ | వ | ■ | ■ | ■ | ఖి | ■ | ము |
| ■ | 8 సు | ము | 9 ఖం | ■ | 10 వి | రా | గం | ■ |
| ■ | ■ | ■ | 11 ద్ది | మ | ము | ■ | ■ | ■ |
| ■ | 12 మె | 13 ల | త | ■ | 14 ఖం | 15 జ | రి | ■ |
| 16 ము | ■ | వం | ■ | ■ | ■ | ల | ■ | 17 త్రీ |
| 18 సు | ర | గ | ■ | ■ | ■ | 19 క | టా | రి |
| పు | ■ | 20 ము | ష్ప | ■ | మే | ము | ■ | క |

### నిలువు

1. 14 నిలువులోనిది చాలా ఉన్న ఆ అడవిలో పద్యాలు గబగబా చెప్పవచ్చు.
2. నగరంలోనూ, పోరంలోనూ ఉండేది.
4. అబద్ధం తిరగబడింది.
5. కమతం తీసుకున్నప్పుడు అవక్తి.
6. కలగలుపుగా వాపరాయి.
7. విపరీతమైన గుమ్మ.
10. ఆంజనేయుని మరో పేరు.
11. ఒక ప్రాచీన నగరంలోని ఎర్రని పువ్వు.
13. లక్ష్మి ఉండేచోటు.
14. కలచివేసిన పక్షి.
16. బూడిదరంగు.
17. ఒకానొక మండలములోని నిటిపట్టు.
18. షాలిమారి తోటలు మొదట పాడు కొలిపిన రాజు.
20. వందేమాతరంచేత ప్రాప్యమైనది.
22. ! అతిరాసవాసం.
24. బౌద్ధుల పుణ్యక్షేత్రం.

# పెళ్లి ముచ్చట

తుఫాను ఉద్ధృతానికి తాటిచెట్టు ఎత్తున లేచినతరంగం నడుంవిరిగి కూలినట్టు నాన్నగారు చతికిలబడ్డారు.

ఇంతలో బంట్రోతు వచ్చాడు.

"అయ్యగారూ! రాజమండ్రీ వచ్చేసిందండి!"

"సరే, అవతలవుండు!"

నౌకరు వెళ్లిపోయాడు; నాన్నగారు చరచరా నా గదిలోకి వచ్చారు. మావారు నాన్నగారి రెండు కాళ్లమీదా పడి తప్పు క్షమించమన్నారు.

"అబ్బాయి! చదువుకున్నవాడివి! పెద్ద వంశంలో పుటినవాడివి. నీకు బుద్ధీ జ్ఞానం ఉండక్కర్లేదా? ఇలాంటి వెధవపనులు చేస్తావా? అది నా కడుపున చెడబుట్టింది. అది నాకూతురేమిటి? — దానిముఖం నేను చూడదలచుకోలేదు. దాన్ని తీసుకుపోయి నువ్వే పెళ్లి చేసుకో! కాదంటావూ జాగ్రత్త"! అన్నారు.

నేను ముసుగుతన్ని ఏడుస్తున్నాను. మా నాన్నగారిమాటలు నాకే ఆశ్చర్యాన్ని కలిగించాయి. కాని, ఆయన ముఖం చూడలేకపోయాను.

"ఏమే. లేవే!" అమ్మ పిలిచింది.

గజగజ వణుకుతూ లేచాను. అమ్మ నన్ను దగ్గరికి తీసుకుంది.

"ఏమే, యిదమేనా నీకు!" నాన్నగారు గర్జించారు.

నేనింకా అలానే ఏడుస్తున్నాను. ఆయన హృదయం కరిగింది. "నిప్పు ముట్టుకుంటే కాలుతుందని తెలియకపోతేఎలాగ! అన్నారు. ఆయన గొంతుకలో దుఃఖం కుకకురలాడింది.

"మావాళ్ళకి చెప్పి, నేను ఒప్పించుకుంటాను. మీ ఉపకారం మరిచిపోలేను" అన్నారీయన.

తర్వాత ఒక్క నిమిషంకూడా ఆయన్ని మా నాన్నగారు అక్కడ ఉండనివ్వలేదు. రాజమండ్రీ రాకుండానే మరో లాంచీ ఎక్కించి పంపించివేశారు. ఈలోగా వాళ్ళతో ఎక్కడ మాట్లాడతారో అని భయం ఆయనకి!

మా అమ్మ మాత్రం నన్ను కనిపెట్టుకు వుంది. అవమానంతో ఏ అఘాయిత్యం తలపెడతానో అని అమ్మ భయం. ఏడుస్తూనే "అమ్మా, వాళ్ళు ఒప్పుకుంటారో లేదోనే" అన్నాను.

అమ్మ ఆలోచించింది. ఎందుకైనా మంచిదని బంట్రోతుకో ఉత్తరం యిచ్చి, వాణ్ణి కూడా భద్రాచలం పంపించింది.

* * *

ఇక ఆ స్పెషలాఫీసరు సంగతి!

వాళ్ళ లాంచీ చాలా దూరం వెళ్ళిపోయాక జాము పొద్దు ఎక్కినా కొడుకు ఎందుకు లేవలేదా అని ఆదంపతులు వెళ్ళిచూసుకున్నారు. ఖాళీ!

వాళ్ళ ప్రాణాలు నిలువునా ఎగిరిపోయాయి.

తమ కొడుకు, బహుశా, గోదావరిలో పడి మునిగి పోయాడనుకున్నారు. ఏడుస్తూనే, బహుశా శవమైనా దొరక్కపోతుందా అన్న ఆశతో, లాంచీని వెనక్కి తిప్పి ఆ ప్రదేశాలన్నీ గాలించారు.

ఆఖరికి నిస్పృహతో భద్రాచలం చేరుకున్నారు.

ఆ మర్నాడు కొడుకు వచ్చాడు.

ఆ మర్నాడే మా బంట్రోతు వచ్చాడు.

మా అమ్మ వ్రాసిన ఉత్తరం ద్వారా నిజం తెలిసి వాళ్లుకూడా కొడుకును చెడ తిట్టారు. మా బంట్రోతుకు నజరానా ఇచ్చి ముహూర్తం పెట్టించమన్నారు.

కథ అయిపోయిందనుకోండి. మా పెళ్లి కూడా అయిపోయింది. పెళ్లి ముహూర్తం కన్నా మా ముహూర్తబలంవల్లనే పండంటి పాపాయి మా చేతుల్లో నవ్వుతున్నాడు.

చీకటి వెలుగుల మిశ్రమంగానే మా జీవితాలు నడుస్తున్నప్పటికీ మా చేతుల్లో పాపే మా యింటి పున్నమ చంద్రుడు. 

Printed and Publshed for NagswaraRao Estates (Private) Ltd,. by S. Ratha Krishna at




## ముస్తాబు ద్రవ్యముల చరిత్రలో ఇంతవరకు తయారుకాని క్రొంగ్రొత్త ఫేస్ పౌడర్లు!

### గోకుల్ శాంటోల్ టాయిలెట్ పౌడరు :

శుద్ధమైన చందనపు చెక్కల పొడరుతో (మైక్రోనైజ్డ) చాల ఇంపైన టాల్కం చేర్చబడి, తయారుకాబడిన పౌడరు. మీ ముఖ కాంతిలో మెరుగు చూపుట, చెమటను అపుట, చాలకాలము వాసన యుండుట దీని ముఖ్య విశేషములు. చెమట పొక్కులను అపుచేయును.

### గోకుల్ శాండల్‌వుడ్ టాయిలెట్ పౌడరు

శుద్ధమైన చందనపు చెక్కలనుండి తయారుకాబడిన పౌడరు. ఫేస్ పౌడరులకు వలయునంత సున్నితము చేయబడినది.

### గోకుల్ బ్యూటీ పౌడరు :

పరిశుద్ధమైన పసుపుకొమ్ముల నుండి తయారుకాబడిన పౌడరు. వివిధ చాయలలో గలవు. మీ ముఖవర్ఛస్సును పెంపొందించునట్టియు, క్రిమి సంహారక సంబంధమగు నట్టియు గుణములు గలది దీని సువాసన గంటలతరబడి నిలచియుండును.

**టి.యస్.ఆర్ & కో, కుంబకోణమ్**

C. L. Mani

# పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్ మరియు ఫేస్ పౌడరు వాడి అందాల భరిణగా కనపడండి

మొదట, తేలికైన మరియు మంచువలె నున్న పాండ్స్ వ్యానిషింగ్ క్రీమును రాసుకోండి. అది మీ సున్నితమైన ముఖ చర్మమునకు రక్షణనిచ్చి దానిని మృదువుగా, మనోహరముగా ఉండేలా ఉంచుతుంది. జిడ్డులేని యీ క్రీము ముఖముమీద చిన్నచిన్న కళంకములను కనపడకుండా ఉంచుతుంది మరియు పౌడరును అంటుకొని ఉండేలా చేస్తుంది!

తరువాత, మెత్తని పాండ్స్ ఫేస్ పౌడరును తేలికగా పైపైన అద్దుకోండి. అది మీ ముఖముయొక్క రంగులో కలిసిపోతుంది మరియు దానికి శోభను చేకూరుస్తుంది!

ప్రతి సారి పైవిధముగా చేస్తే మీరు గంటలతరబడి అందముగా కనబడతారు!

ప్రపంచమంతటా
సౌందర్యవతులు
వీటినే ఎన్నుకొంటారు




JWT. P. 72

చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ. లో సంస్థాపించబడినది)